


# చతుర

జనవరి : 1983

సంపుటి : 5   సంచిక : 12




## ఈ నెల సమగ్ర నవల

జీవనగమనంలో ఎదురయే సహజసిద్ధమైన మార్పులు సర్వదా వాంఛనీయమే! ప్రకృతి సహజంగా తుళ్ళిపడే జలపాతం లాంటి వయసులోని ఆ కన్నెకుసుమం కూడా తన జీవితాన్ని చిగురింపజేసే వసంతం కోసం ఆశగా ఎదురుచూసింది. కాని చదువూ, మంచితనం, అందం అన్నీ వున్నా ఆ అందాల బొమ్మ జీవితం అనేక కారణాలవల్ల వెదురుపొదలా, అడవి గాచిన వెన్నెలలా అయిపోయింది. ఇక ఈ జీవితానికి వసంతం లేదు .... రాదు అని నిరాశపడుతున్న తరుణంలో ఆమెకన్నా పదేళ్ళు చిన్నవాడయిన యువకుడు ఉధృత ప్రవాహంలా

# వెదురు పొదలు

వంటి ఆమె జీవిత వనంలోకి దూసుకువచ్చి జీవితాన్ని మురళిగా మార్చి ప్రణయ సంగీతం విన్పిస్తానన్నాడు. ఆ ఆహ్వానాన్ని ఆమె అందుకొందా? వయోభేదం వారి మధ్య సమస్యలు సృష్టించిందా? చదువు, సంస్కారం, అందం అన్నీ వున్న ఆమె జీవితానికి పెళ్ళి అనేది ఒక సమస్యగా ఎందుకు మారింది? తాను మెచ్చిన, తనకు నచ్చిన యువకుడు ఎందుకు దూరమైపోయాడు? అలస్యంగానైనా అందిన అనందం చివరి వరకూ నిలిచిందా? జీవితాన్ని మధుర మురళీనాదంగా మారుస్తానని ముందుకు వచ్చిన ఆ యువకుడు తన మాట నిలబెట్టుకోగలిగాడా?

## కృష్ణజ

ఒంటరి బతుకుల్లోని ఆవేదన, ఆరాటాలను, వయోభేదాన్ని విస్మరించలేని కట్టుబాట్లను హృదయానికి హత్తుకునేలా విశ్లేషించిన ''వెదురు పొదలు'' ఈ నెల చతుర సమగ్రనవల.

ముఖచిత్రం : జగ్ మోహన్
రెండవ కవరు : ఎ. అంబరీష్
మూడవ కవరు : సూరజ్.యస్. శర్మ

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

*ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.*




## ఇది హఠాత్తుగా తయారైనదేం కాదు కాని, ఉక్కులో 200 సంవత్సరాల ఉత్కృష్ట కౌశల్యపు ఫలితమే ఇలాంటి రేజర్ బ్లేడ్ విల్ట్ఎడ్జ్.

విల్ట్ఎడ్జ్.
ప్రపంచపు సర్వోత్తమ బ్లేడుల వెనుకవున్న విల్కిన్సన్ వారి 200 సంవత్సరాల నిశిత నైపుణ్యంతో భారత దేశంలో తయారైన రేజర్ బ్లేడ్.




విల్ట్ఎడ్జ్.
దిగుమతి చేయబడిన ఉక్కుతో తయారై, యాంత్రిక సానరాయి మరియు తోలుపట్టీ మీద పదును పెట్టబడి గోథిక్ ఆర్చ్ ఆకారం పొందిన మొనతో కూడిన రేజర్ బ్లేడ్— ఈ గోథిక్ ఆర్చ్ మొన ఎన్నో సంవత్సరాల తీవ్ర సంశోధన ద్వారా ఉత్కృష్టం చేయబడి మరియు పి.టి.ఎఫ్.ఇ పూత కల్గినది. షేవింగ్ టెక్నాలజీలో సంభవించిన మహత్వపూర్ణమైన ఏకైక ప్రగతి. మీకు మునుపెన్నడూ లభించని అతి నున్నని, సురక్షితమైన మరియు చక్కటి షేవ్‌ను అందించడానికి, ఆహా... షేవ్ తర్వాత షేవ్...ఎన్నో-మరెన్నో షేవ్‌లు.

నిజానికి ఎన్ని ఎక్కువ షేవ్‌లంటే దీనికోసం కాస్త ఎక్కువ పైకాన్ని ఖర్చు పెట్టడానికి మీరు ఏమాత్రం వెనుకాడరు.

విల్ట్ఎడ్జ్.
ఇది మీపై చెరగని ముద్రను వేసి పోతుంది—దీని నాణ్యత అసమానం, దీనితో లభించే షేవ్‌లు అధికం.

**విల్ట్ఎడ్జ్: మరింత ఎక్కువ పొందాలని అభిలషించేవారి కోసం- ఎక్కువ షేవ్‌లు, ఎక్కువ సుఖం, ఎక్కువ సంతృప్తి.**

**Wiltech India Ltd.**

Rediffusion/WIL/1784h/ TL

# ప్రకృతి ప్రపంచం

## పక్షుల విడాకులు

'తాళికట్టు శుభవేళ మెడలో కల్యాణ మాల...' అని మనం పాడుకున్నట్టే పక్షులు కూడా 'ప్రేమా పెళ్ళీ ముచ్చట లంటే కాదులే తమాషా...' అంటూ విడాకుల దాకా వెళ్ళిపోవటం వినడానికి విడ్డూరంగానే వున్నా సత్యదూరం మాత్రం కాదు.

సోవియట్ రష్యా సర్వే ప్రకారం పక్షుల పెళ్ళి వయసు వాటి సైజు మీద ఆధారపడి వుంది. వార్ బ్లెర్స్, వాగ్ టైల్స్, త్రషెష్, నైటింగేల్ వంటి పాటలుపాడే చిన్న చిన్న పక్షులు త్వరగా జతకట్టి అవి పుట్టిన మొదటి వేసవిలోగానే (సంవత్సరంలోగానే) గుడ్లు పెట్టేస్తాయి.

పెద్ద పెద్ద పక్షులు వీటికి పూర్తిగా విరుద్ధం. సంవత్సరాల తరబడి ఒంటరిగా వుండిపోతాయి. ఉదాహరణకి 'రాయల్ ఆల్‌బట్రాస్' పక్షి రెక్కలు నాలుగు మీటర్ల పొడవుంటాయి. హాయిగా రెక్కలు విసురుకుంటూ సముద్రపు నీటి నురగల మీద తేలుతూ, సరదాగా ఆకాశంలో పల్టీలు కొడుతూ ఎనిమిదేళ్ళు గడిపి తొమ్మిదో ఏటగాని, పదో ఏట గాని పెళ్ళి చేసుకుంటాయవి. ఓ విధంగా లేట్ మారేజ్ అన్నమాట.

అన్నిటికంటే ఎక్కువ కాలం అంటే 11 ఏళ్ళపాటు బ్రహ్మచర్యం వహించే పక్షి 'కుండర్'.

పక్షి ప్రపంచంలో కూడా భార్యాభర్తల మధ్య వయోతారతమ్యం వుంది. పెద్ద పెద్ద 'టామిటిస్' పక్షుల్లో మగ తోంతుల పక్షులు తమకంటే వయసులో చిన్నవైన ఆడపక్షుల్ని పెళ్ళాడ్డానికి ఇష్టపడతాయి.

పక్షులెక్కువగా వాతావరణాన్ని బట్టి స్థలమార్పిడిని కోరుకుంటాయి. అలా గూటి చెట్టుని వదిలేసి కాలనీలకు వలస వచ్చిన 'కిట్టివేక్స్' అనే పక్షులు సంవత్సరం తర్వాత ఓ రోజు వున్నట్టుండి వెనక్కి తిరిగి వచ్చేస్తాయి. పాపం ఆడ పక్షులు వాటిని వెతుక్కుంటూ వెళ్ళలేక, వెళ్ళినా సరిగ్గా స్థలాన్ని గుర్తించలేక వెనుదిరుగుతాయి. గూటికి చేరిన మగ పక్షులు మళ్ళీ ప్రేమా, పెళ్ళి అంటూ కొత్త పాటలు పాడుకుంటాయి. గుడ్లని పొదిగి, రెక్కలిచ్చి ఆడ పక్షులూ అవకాశం కోసం, సరైన మరో జోడు కోసం కొమ్మలెక్కి కూనిరాగాలు తీస్తుంటాయనుకోండి.

వయసులో వున్న పక్షుల్లోనే ఈ రకమైన విడాకులెక్కువ. వయసు మళ్ళిన పక్షుల్లో 85 శాతం పక్షి జంటలు కలిసే వుంటాయి. అలా స్థిరత్వం ఏర్పడిన పక్షి కుటుంబాలు గూటిని గట్టి పర్చుకుని గుడ్లను పెట్టి, పిల్లల్ని పొదిగి వాటి అలనా పాలనా చూసుకుంటూ ఆనందంగా కాలం గడుపుతూ, విడాకులు తీసుకున్న మగ పక్షుల్ని సన్నగా చీవాట్లు పెడుతుంటాయి.

## జీన్స్ కార్నర్

ఎక్కడే కొత్త వచ్చినా క్షణాల మీద సెంటువాసనలా వ్యాపించి పోయే రోజులివి. ఇప్పుడెక్కడ చూసినా జీన్స్ పాంట్లు, డిస్కో షర్టులు. ఆ జీన్స్ ఎంత నలిగిపోతే అంత ఫేషను, ఎంత మాసిపోతే అంత అందం. ఏదోలే సూటింగులు. షర్టింగులు అని గోల పెట్టకుండా జీన్స్‌తో సరిపెట్టుకుంటున్నార్లే చౌకలో పోతుందని తల్లిదండ్రులు 'హమ్మయ్య' అనుకోడానికి వీల్లేదు. వాటి ఖరీదేం తక్కువ లేదు. 'జీన్స్' అంటే 'గుర్రపుజీన్లా' అని బామ్మలు బుగ్గలు నొక్కుకునే రోజులు పోయాయి. పిల్లల దగ్గర్నించి పెద్దలదాకా అర్థం తెలిసిపోయిన జీన్స్ పుట్టుక వింటే చాలా చిత్రంగా, గమ్మత్తుగా ఉంటుంది.

1950లో న్యూయార్క్ వాస్తవ్యుడయిన లెవిస్ట్రాస్ అనే సేల్స్‌మన్ శాన్‌ఫ్రాన్సిస్కోలో ఉన్న చెల్లెల్ని చూడ్డానికి వస్తూ పన్లోపని గుడారాలు వేసుకుందుకు ఉపయోగపడాయని ఓ విధమైన కాన్వాస్ బట్టను తీసుకొచ్చేడు అమ్మకానికి. కానీ అది గుడారానికి పనికిరాదని తిప్పి కొట్టడంతో అతని వద్దే కుప్పవేసుకు పోయింది. ఓరోజు ఏదో గనిలో పనిచేస్తున్న అతని స్నేహితుడు ఎంతగట్టి బట్టకొన్నా తన వద్ద నిలవడంలేదని, వూరికే చిరిగి పోతున్నాయని చెప్పడంతో గప్‌చుప్‌గా



ఆ కాన్వాసు బట్టతో ఓ రెండు పాంట్లు కుట్టిచ్చాడు. అంతే! అది గనికార్మికుల ఫేవరేట్ అయిపోయింది. అవే మొట్ట మొదటి డెనిమ్ జీన్స్. తన దగ్గరున్న మొత్తం కాన్వాస్ అయిపోగానే న్యూయార్క్‌లో ఉన్న అన్నగారికి మళ్ళీ పంపమని ఉత్తరం రాశాడు.

ఈసారి లెవీ అన్న ఫ్రాన్స్‌లోని 'నిమ్'లో తయారయ్యే మరోగట్టి నూలు బట్ట పంపించేడు. ఫ్రెంచి భాషలో దాన్ని 'సార్జ్ డినిమ్స్' అంటారు. అదే వాడుకలో 'డినిమ్స్' అయింది. జెనోవా ఉచ్చారణలో ఆ బట్టను 'జీన్స్' అని పిలుస్తారు. సాధారణంగా అక్కడ్నించి బట్టల్ని తెచ్చి అమ్మేలెవీ ఆ పేరుని అలాగే ప్రచారం చేశాడు. ఒరిజినల్‌గా ఫ్రెంచి ఉచ్చారణ అయిన ఆ పదం 'డినిమ్ జీన్స్'గా అన్ని దేశాల్లోనూ చలామణీ అవుతూ యువతీయువకుల 'హాట్ ఫేవరేట్'గా తయారయిందన్నమాట.

## టెలిఫోన్ షాక్

కంగారుపడకండి. షాక్‌లు రకరకాలు. కొన్ని షాకులు ప్రాణాల్ని పోగొడతాయి. అవి మంచివి. కొన్ని చిత్ర హింసలు పెడతాయి. అవి ఘోరమైనవి. వాటిల్లో మొదటిది టెలిఫోన్ షాక్.

మద్రాసు ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పేపర్లో పనిచేస్తున్న ఎమ్.ఎ.చాకో చెట్‌పేటలో వుంటున్నాడు. 1966 నుంచీ అతని ఇంట్లో టెలిఫోన్ వుంది. టెలిఫోన్ నంబరు 665020. క్రమశిక్షణకు పెట్టింది పేరైన అతను ప్రతిసారీ ఖచ్చితంగా టెలిఫోన్ బిల్లు కట్టేస్తాడు. బిల్లుమొత్తం మూడు వందల నుంచి ఐదువందల దాకా వుంటుంది.

మొన్న మార్చి 18వ తేదీన అతనికందిన బిల్లు చూసి మూర్ఛ వచ్చినంత పనైందతనికి. బిల్లు మొత్తం ముప్ఫయివేల అయిదు రూపాయల యాభై పైసలు.

ఇదేదో పొరపాటు జరిగి వుంటుందని భావించి పాపం ఆయన స్వయంగా టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌కి వెళ్ళి, బిల్లు చూపించి సరైన ఎమౌంట్ వెయ్యమంటే అవన్నీ ఏం లేదనీ, ముందు బిల్లు వెంటనే కట్టేయాలనీ, లేకపోతే మార్చి 28 తర్వాత టెలిఫోన్ కనెక్షన్ తీసేస్తామనీ చెప్పారు కౌంటరు అధికారులు.

సాధారణంగా ఆయనకి మూడునెలలకోసారి బిల్లు వస్తుంది. ఈ బిల్లు మాత్రం



నెల తిరక్కుండానే వచ్చింది. పైగా ఆ నెలంతా ఆయన శ్రీమతి కూడా వూళ్ళో లేదు. పోనీ బైటివాళ్ళెవరైనా వచ్చి చేసుకున్నారనడానికి కూడా వీల్లేదు. ఎందుకంటే ఆయన ఆఫీసుకెళ్ళి వచ్చేవరకూ రోజంతా ఇల్లు తాళం వేసే వుంటుంది.

చాకోగారు ఈ విషయం వివరిస్తూ పై అధికారులకు పిటీషను దాఖలు చేశారు- అది 305 రూపాయలు అయివుంటుందేమో గాని మరీ 'వేలు' కాదని-ఏమౌతుందో చూడాలి. మన టెలిఫోన్ శాఖ ఎంతకయినా సమర్థమైనదే.

# అమ్మకోసం

ఒకప్పుడు పర్షియా దేశాన్ని ఫ్రెడరిక్ ది గ్రేట్ పరిపాలించేవాడు. ఈయనగారు



ఎప్పుడన్నా నిద్రపట్టకపోతే కాపలాదారుని కేకేసి తన లైబ్రరీలోంచి ఓ పుస్తకం తెప్పించుకొని చదువుతూండేవాడు. ఓ రోజు రాజుగారికి ఎంత ప్రయత్నించినా నిద్రరాలేదు. సరే కాసేపు పుస్తకం చదువుతూ కాలక్షేపం చేద్దామనుకుని తన పడగది ముందు గదిలో డ్యూటీలో ఉన్న జథన్ అనే కాపలావాడిని పిలిచారు.

అయితే అతను అంతకుముందు కొన్ని రాత్రుల నుంచి నైట్ డ్యూటీ చేస్తున్నందు వల్ల ఆపుకోలేక అప్పటికే నిద్రలోకి జారి పోయిఉన్నాడు. తన పిలుపుకి బదులురాక పోవడంతో రాజుగారికి కోపం వచ్చి ఆవేశంతో ఊగిపోతూ బయటికివచ్చి కాపలాదారు ఏదో రాస్తూ రాస్తూనే నిద్రపోవడాన్ని గమనించారు. దగ్గరికెళ్ళి ఆ కాగితంతీసి చూస్తే అది కాపలాదారు తల్లికి రాస్తున్న ఉత్తరమని తేలింది. అందులో "అమ్మా! గత కొన్నిరాత్రులుగా నైట్ డ్యూటీలు చేయడం వలన నిద్ర ముంచుకు వస్తోంది. కళ్ళువాలిపోతున్నాయి నిజానికిది నా డ్యూటీ కాదు. కాని మరింత ఎక్కువ డబ్బు సంపాదించి నీకు పంపించుదామని ఇలా చేస్తున్నాను. దీనిద్వారా సంపాదించిన డబ్బులు నీకు పంపిస్తున్నాను" అని వుంది.

ఆ ఉత్తరం చదవగానే ఫ్రెడరిక్ ది గ్రేట్ కోపం చల్లబడిపోయింది. తల్లికోసం



ప్రియ తోడుగా ఉంటే చాలు...
...మరింత సంతృప్తి!
GONGURA
PICKLE
IN OIL
priya
బ్రేక్‌ఫాస్ట్ తీసుకొనేవేళ పక్కన 'ప్రియ' ఉంటే ప్రతి ఉదయం రుచులమయం. అదే 'ప్రియ' ఆకర్షణలోని రహస్యం. నోరూరించే పలురకాల పచ్చళ్ళలో మీకు కావలసింది ఎన్నుకోండి.
వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.
* మామిడికాయ * నిమ్మకాయ * టొమాటో
* అల్లం * గోంగూర * ఉసిరికాయ * చింతకాయ
* పండు మిరపకాయ * వంకాయ
తీపిరకాలు : * మామిడికాయ * అల్లం
ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ
ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్
Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004

కష్టపడుతున్న అతని పట్ల జాలితో నిండి పోయింది రాజు మనసు. వెంటనే తన గదిలో కెళ్ళి చేతినిండా బంగారు నాణాలు తీసుకొని వచ్చి గార్డుని లేపకుండానే వాటిని ఉత్తరం మీద వుంచి లోపలికెళ్ళి పోయాడు.

## చదువు-వయసు

చదువుకునే మనసుండాలేగాని చదువుకి వయసుతో పనిలేదు. చదువుకునే వయసులో కుదురులేక, అల్లరిచిల్లరిగా తిరిగి చదువు పాడుచేసుకుని పబ్లిక్‌పరీక్ష పాసవడానికి దండయాత్రలు చేసేవారు కోకొల్లలు. దాంతో జీవితంమీద, చదువు మీద విరక్తి పెంచుకొని ఇరవయిలోనే అరవయి వయసువారిలా అయిపోతారు. కొంతమందికి 'వివాహం విద్యనాశాయ' అన్నమాట ఖచ్చితంగా సరిపోతుంది.

కానీమాజీ ప్రతిపక్షనాయకుడుమద్రాసు నివాసి అయిన వి.కె. రామస్వామి ముదలియార్ తన 80వ ఏట ఎమ్.ఎ. పరీక్షకు సిద్ధపడుతున్నాడు. మామూలుగా అందరిలాగానే కాలేజీలో చదివి పట్టభద్రుడయిన రామస్వామికి అపైన చదివే అవకాశం అప్పట్లో లేక ఉద్యోగాన్వేషణలోను, దేశసేవలోను మునిగిపోయాడు.

ఆమధ్య మైసూరు విశ్వవిద్యాలయం పోస్టల్ సౌకర్యంద్వారా కరస్పాండెన్స్ కోర్సు చదువుకోవచ్చు, 25 ఏళ్ల పైబడిన వారెవరయినా ఇందుకు అర్హులు - అని ప్రతికాప్రకటన చేసింది. ఆ ప్రకటన రామస్వామిలోని విద్యాతృష్ణను తట్టి లేపింది. అన్నిరకాల కరస్పాండెన్స్ కోర్సు లకుశిక్షణనిచ్చేఒక ట్యుటోరియల్స్‌లో చేరి, క్రమం తప్పకుండా ప్రతిరోజు క్లాసులకు వెళ్తూ అత్యంత శ్రద్ధతో చదువుకుంటున్నాడాయన.

చదువేగాక ఆయనకు ఇతర వ్యాపకాలు కూడా చాలానే వున్నాయి. అయినా సరే అన్నింటినీ దేనికి దానికి చక్కబెట్టుకు రాగల సమర్థుడు. రాత్రిళ్ళు ఎక్కువసేపు మేల్కొవడం, తెల్లవారుఝామునే నిద్ర లేవడం ఆయనకు బాగా అలవాటు.

'ఒకేసారి మూడుగంటలపాటు కదల కుండా కూర్చుని వంచిన తలఎత్తకుండా పరీక్షలు రాయడం ఈ వయసులో ఎలా సాధ్యం' అనిఎవరయినా అడిగితే ఫక్కున నవ్వుతాడాయన.'దేనికయినాఆత్మవిశ్వాసం ముఖ్యం. నేనీపని చెయ్యాలి, చేయగలను అనుకున్నాను.అంతే! చేస్తున్నాను' అంటాడు.

రోజుకి రెండుమైళ్ళు ఏకధాటిగా నడిచే రామస్వామి టీ, కాఫీలు తప్ప ఇతర పానీయాలేవీ పుచ్చుకోడు. ధూమపానం బొత్తిగా గిట్టదు. ఎపుడోగాని, అదీ మరీ అవసరమైనపుడు తప్ప కళ్ళజోడు జోలికి వెళ్ళని రామస్వామి తాతగార్ని చూసి ఈ నాటి మనుమలు, మనుమరాళ్లు నేర్చుకో వల్సింది చాలావుంది కదూ!



తెల్లగులాబీ గుబురు విరగబూచింది.

కొన్ని పూలు పూర్తిగా రేకులువిప్పి గాలికి తలలూపుతూ తెల్లగా చల్లగా చిరునవ్వుతో పలకరిస్తుంటే-

నిన్న పూచిన పూలు వాడిపోయి రేకలూడి దయనీయంగా ఉన్నాయి. విచ్చీవిచ్చని మొగ్గలు నూతన వధువులా మధువులు కురిపిస్తున్నాయి. ఆనందంతో ఊగిపోతున్న కన్నెమొగ్గలను చూసి నిన్నటిమొగ్గలుచిరునవ్వునవ్వుతున్నాయి-

'నిన్న మేమూ మీలా పొంగిపోయినవాళ్ళమే' అన్నట్లు. గుబురునిండా ఇంకా ఎన్నో కళ్ళుతెరవని పసిపాపల్లాంటి మొగ్గలు.

హారతికి తెల్లగులాబీ గుబురు అంటే ఎంతో మక్కువ.

ప్రభాకర్‌తో వివాహం జరిగిన తొలి దినాల్లో ప్రభా ఇంటి నుండి ఓ అంటుతెచ్చి స్వయంగా నాటి అపురూపంగా పెంచుకుంది. ఆమెకాగుబురులోని ప్రతి రెమ్మా, ప్రతి కొమ్మా, ప్రతి చిగురూ సుపరిచితమైనవే.. !

హారతి ఆప్యాయంగా గులాబీపొదను స్పృశించింది. చేతులకు ముళ్ళు గుచ్చుకున్నాయి.

అవును! భూమి గుండ్రంగా ఉంది.

ఎవరు ఎక్కడినుండి ప్రయాణం మొదలుపెట్టినా చివరికి మొదటిచోటికే చేరతారట. అలాగే తన బతుకూ ఎడారి వంటి వంటరిబతుకు ... ఎడారిలో ఈ కాలం అనేది ఒక ఒయాసిస్సు తప్ప తన బతుక్కు పరిపూర్ణతలేదు...

నిజమైన శాంతిలేదు .... ఆత్మీయత లేదు...రక్షణ లేదు.. 'నాకెవ్వరూలేరు... నాకెవ్వరూలేరు...' అంటూ పిచ్చిగా కేకలు పెట్టాలనిపించింది హారతికి.

'చూశారా! నాకెవ్వరూ లేరు ... ఈ ప్రేమలూ-పెళ్ళిళ్ళూ, ఆప్యాయతలూ - ఆరాధనలూ అన్నీ వట్టి వ్యామోహాలూ, బూటకాలుకాదూ...' అంటూ ఎలుగెత్తి అరుస్తూ పగలబడి నవ్వాలనిపించింది.

నేలమీద దొర్లుతూ గుండెలు పగిలేలా ఏడవాలనిపించింది. ఏమీ చెయ్యలేని హారతి విషాదంగా నవ్వుకుంది.

తన బతుకులో ముప్పై వసంతాలు జరిగిపోయాయి.ఎన్నో..ఎన్నోమార్పులు! తమ్ముడు గిరిధర్ చదువు పూర్తిచేసి ఉద్యోగం చేస్తున్నాడు. గిరిధర్‌కిప్పుడు ఓ పాపా, ఓ బాబూ.

బాధ్యతలు తీరకపోయినా మరి బాధ్యతల బరువును భరించలేని హారతి అమ్మా - నాన్నా వృద్ధాప్యపు బరువును మోస్తున్నారు.

అన్నిటా, అందరిలోనూ మార్పు!

జీవనగమనంలో సహజమైన మార్పులు అన్నింటా, సర్వదా వాంఛనీయం. కానీ...మారనిదీ, మార్పులేనిదీ తన జీవనగమనమే! గడచిన వసంతాలలో ఏ ఒక్క వసంతమూ తన జీవితాన్ని చిగుర్చలేకపోయింది.

గడచిపోయిన కాలంలో ఏ ఒక్క క్షణమూ శిలా సదృశ్యమైన తన జీవనగమనంలో మార్పుతేలేకపోయింది.

పగలు... రాత్రి... చీకటి ... వెలుగుల వంటి మార్పులేని జీవితం...చిరునవ్వు కరువైన భారమైన హృదయం.

నిరాశనూ, విరక్తినీ, చీకటినీ నింపుకున్న కళ్ళు-ఆఫీసు, ఇల్లూ, తిండీ, కలత నిద్రా, కన్నీళ్ళూ-ఇదీ జీవితం. క్రమక్రమంగా మోడుబారుతున్న పచ్చని తరువులా తన బతుకు క్రమక్రమంగా

బందబారిపోతోంది.

జీవించాలనిలేని జీవితం ఎంత దుర్భర మైనది.

అశాంతీ, అవమానాలూ, కలతలూ, కన్నీళ్ళూ సమానంగా పంచుకుంటున్న తరుణంలో తన జీవితక్రమంలో అనుకోకుండా ఓ చిన్న మార్పు సంభవించింది.

ప్రమోషన్ ఇస్తూ తనను ఆ బ్రాంచి నుండి రాజమండ్రికి ట్రాన్స్‌ఫర్ చేశారు. తనిప్పుడు రాజమండ్రి బ్రాంచికి ఆఫీసరు.

రాతిమీద కురిసిన వర్షపు చినుకులు ముత్యాలుగా మారవు. స్పందనలేని తన హృదయానికి ఆ వార్త ఎలాంటి కదలికనూ కలిగించలేకపోయింది.

ఎప్పటిలా నిర్లిప్తతా, నిరాశా తోడు రాగా వెళ్ళి రాజమండ్రి బ్రాంచికి ఆఫీసరుగా ఛార్జి తీసుకుంది.

* * *

ఊరికి కాస్త దూరంగా ఉన్న పార్కేమో అట్టే జనం లేదు. హారతిని ఆఫీసు వారిచ్చిన క్వార్టరూ, దాని చుట్టూ పూల మొక్కలతో ఉన్న చిన్న ఆవరణా, ప్రశాంతంగా ఉన్న పరిసరాలూ... అదే ప్రశాంతత నింపుకున్న ఇరుగూ,పొరుగూ ఇళ్ళూ అన్నింటినీ మించి ఇంటికి అతి సమీపంలో ఉన్న చిన్న పార్కూ అమితంగా ఆకర్షించాయి.

క్రమం తప్పకుండా పార్కుకు వచ్చి కూర్చోడం అలవాటు చేసుకుంది. పచ్చని మొక్కలూ, అందంగా కత్తిరించిన పొదలూ, పాదాలకు గిలిగింతలు పెట్టే ఆకుపచ్చని మఖమల్‌ను మరిపించే పచ్చని పచ్చికా..అన్నింటినీ మించి మనుష్యుల సందడి కనిపించని ప్రశాంతమైన వాతావరణం.

ఈ ప్రశాంతత, ఈ స్తబ్ధ వాతావరణం ఆమెలోని అశాంతిని, ఆవేదనను ఉపశమింప చేస్తుందో లేక గడచిన విషాదాన్ని మననం చేసుకుంటూ, భవిష్యత్తును తలచుకుని నిట్టూర్పును విడుస్తూ అందులోనే ఆనందం పొందే అలవాటు చేసుకుందో చెప్పడం కష్టం. కానీ, హారతికి ఆ పార్కులో గడపడమనేది చాలా ఇష్టమైన విషయం. అలా ఒంటరిగా కూర్చుని గంటలు గంటలు తన జీవితంలోని విషాదాన్ని మననం చేసుకోడం అలవాటయిపోయింది.

పార్కులోకి వచ్చిన హారతి శుభ్రమైన సిమెంటుబల్ల చూసుకుని కూర్చుంది. ఎప్పటిలా కూర్చున్న వెంటనే తల ఎత్తి చూసింది. వెంటనే కనుబొమలు చిట్లించుకుంటూ దృష్టి మరోవేపుకు తిప్పుకుంది. ఆమె కూర్చున్న సిమెంటు బల్లకు మరికొంత దూరంలో ఉన్న మరొక బల్ల మీద కూర్చున్న యువకుడు అలవాటు ప్రకారం పలకరింపుగా చిరునవ్వునవ్వాడు. ఆయువకుడుహారతి పార్కుకువచ్చేప్పటికి సిద్ధంగా కూర్చోవడమో లేక రెండు మూడు నిమిషాలు ఆలస్యంగా రావడమో జరుగుతుందే తప్ప అసలు రాకపోవడం అంటూ జరగదు.

హారతి దృష్టి తన దృష్టిలో కలిసినప్పుడు మాత్రం చిరునవ్వు నవ్వకుండా ఉండడు.

కూర్చున్నంత సేపూ తదేక దృష్టితో ఆమె వంకనే చూస్తూ గడుపుతాడు. ఆమె లేచి వెడుతూనే ఇక తనకక్కడ పనేమీ లేనట్లు తనూ వెంటనే లేచి వెళ్ళిపోతాడు.

ఇది కొన్ని నెలలుగా వారి మధ్య జరుగుతున్న దినచర్య. మొదట అంతగా గమనించని హారతి క్రమేపి అతని ఉనికిని గమనించసాగింది. అతనలా గంటలు




ఫలానా చోట భద్రత ఉంటుందని గట్టిగా నమ్మి మీ డబ్బును అక్కడ దాస్తారు. ఆ నమ్మకం కాస్తా వమ్మయితే...! అలా జరిగే అవకాశాలు లేకపోలేదు. అందుకే - కష్టార్జితాన్ని ఎక్కడ మదుపు పెట్టాలా అన్న విషయంలో మీరు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావడం చాలా ముఖ్యం.

రెండు దశాబ్దాల అనుభవం ఉన్న మార్గదర్శిలో మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి రక్షణ ఉంటుంది. అందరి అవసరాలకూ సరిపడే విధంగా వివిధ రకాల చిట్‌లు మార్గదర్శిలో మీకు అందుబాటులో ఉన్నాయి. అంతేకాదు, మీరు పొదుపుచేసే మొత్తాలకు ఆకర్షణీయమైన డివిడెండ్లు కూడా లభిస్తాయి.

మార్గదర్శిలోని హితులు మీ ఆశలకూ, ఆశయాలకూ ఒక ఆకృతి కల్పిస్తారు. మార్గదర్శిలో పొదుపు చేస్తే ధనానికి పూర్తి రక్షణ ఉంటుందని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు.

మరి మీ మాటేమిటి?

**డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!**

## మార్గదర్శి

**చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్**

మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

శాఖలు: ● అబిడ్ సెంటర్, హైదరాబాద్ ● లక్డికాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● చంద్రలోక్ కాంప్లెక్స్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం

గంటలు తనవంక చూస్తూ గడపటం ఆమెకు వింతగా ఉంది.

ముక్కూ మొహం ఎరగని ఓ కుర్రాడు తనను ఎంతో కాలంగా తెలిసినట్లు పలకరింపుగా నవ్వడం, గంటల తరబడి తన వంకే చూస్తూ కాలక్షేపం చేయడమనేది మొదట హారతిని భయపెట్టింది. వరుసగా రెండుమూడు రోజులు పార్కుకు రావడం మానుకుంది కూడా. ఆ సమయాన్ని తన ఇంటి ఆవరణలోని పూల మొక్కల మధ్యే గడిపింది. కానీ, ఆ యువకుడు తన ఇంటి ముందు కూడా తచ్చాడటం గమనించింది, ఆ రెండు రోజులూ...

అతడు కేవలం తనను చూసేందుకే పార్కుకు వస్తున్నాడనే విషయం అర్థమైపోయింది.

ఆశ్చర్యంతో పాటుగా ఓ అరక్షణం ఆనందానికి కూడా లోనయింది హారతి.

శిథిలమైపోతున్న తన సౌందర్యంలో ఇంకా ఆ పాత ప్రాభవం, ఆకర్షణ మిగిలి ఉందా...?

తన ఆలోచనకు సిగ్గుపడింది హారతి.

తన సౌందర్యం పదిమందినీ ఆకర్షిస్తుంది. నిజమేగానీ ఆకర్షించాలి అనుకోడానికి ఇంకా తానేమీ టీనేజ్ గర్ల్ కాదు. పైగా ఆ కుర్రాడికి ఇరవై-ఇరవైరెండేళ్ళ కన్నా ఎక్కువ ఉండవు. తనకిలాంటి ఆలోచన రావడమేమిటీ...? బుద్ధి లేకపోతే సరి...తనను తాను మందలించుకుంది హారతి. కానీ పార్కుకు వెళ్లాలో వద్దో మాత్రం తేల్చుకోలేకపోయింది. 'పార్కుకు వెడితే అతను కనిపిస్తాడు' అనుకుంటే భయం వేసింది. ఇరవై ఏళ్లు లేని ఆ కుర్రాడికి తను భయపడటం ఏమిటీ...? అయినా అతను తననేమీ అల్లరి పెట్టడం లేదుగా ? అతని చూపులో ఆత్మీయతా, చిరునవ్వులో అభిమానం తప్పితే అసభ్యత, వెకిలితనం కనిపించవు. అతని వరకు అతను కూర్చుంటాడు. తన వరకు తాను కూర్చుంటుంది. అంతమాత్రానికి అసలు పార్కుకే పోకుండా ఎందుకుండాలి...?

తనకు ఆనందం కలిగించే ఒకే ఒక విషయాన్ని వదులుకోవాలనిపించలేదు హారతికి. అందుకే ఎప్పటిలా మళ్ళీ పార్కుకు పోవడం ప్రారంభించింది.

మూడు రోజుల తరువాత పార్కులో తనని చూసిన అతని కళ్లు వింతగా మెరవడం గమనించి, 'ఈ కుర్రాడికిదేం. పిచ్చి' అనుకుంది చిరాగ్గా.

ఇల్లు దగ్గరేగా వెళదాంలే...వెళదాంలే...అనుకుంటూనే చీకటి పడే వరకూ పార్కులోనే గడిపేసింది హారతి ఆరోజు.

చుట్టూ మసక చీకట్లు అల్లుకుంటున్నాయి. 'ఇక వెళదాం' అనుకుంటూ లేచి రెండడుగులు వేసింది. ఆమె వెనకగా వస్తూన్న ఇద్దరూ నవ్వుతూ తుళ్ళుతూ వస్తున్నారు. వాలకం ఉద్యోగస్తులలాగే ఉన్నా స్వభావం రౌడీల్లా ఉంది. హారతి గబగబా నాలుగడుగులు వేసింది.

"పిట్ట బెదిరిపోయింది బ్రదర్..."

"పిల్ల కొబ్బరి ముక్కలా ఉంది గురూ..." వెకిలిగా అన్నాడు రెండోవాడు.

"పిల్లేమిటి నీ ముఖం ముసలి తొక్కయితేనూ..." ఈసడింపుగా అన్నాడు మొదటివాడు.

"నీకు తెలుసేవిటి గురూ..."

"తెలీకపోవడం ఏమిటి...? అది జె అండ్ బి కంపెనీలో పనిచేస్తుంది. మన లాంటి వాళ్లు ఎందరో అయిపోయారు

దానికి..."

"కదిలించి చూస్తే ఎలా ఉంటుందంటావు...?"

"అలాంటి భయమేమీ వద్దు...కదిలిస్తే చాలు...కాలు..."

ఆ మాటలు పూర్తి కాకుండానే "కెవ్వు" మంటూ వాడు పెట్టిన కేకతో ఉలిక్కిపడిన హారతి చటుక్కున వెనుతిరిగి చూసింది.

తనను ప్రతిరోజూ చిరునవ్వుతో పలకరించే ఆ యువకుడు ఎడాపెడా వాయించేస్తున్నాడతన్ని. అతను తన్నిన తన్నుకు మొదటి వాడు వెళ్ళి అంత దూరంలో పడ్డాడు. అతను లేచి వచ్చే లోగా రెండోవాడి దౌడ పగిలి నోటి నుండీ, ముక్కు నుండీ రక్తం కారుతోంది. ఈసారి స్నేహితులిద్దరూ కలిసి ఒకే సారి ప్రత్యర్థి మీద దాడి చేశారు. ఎవరు ఎవరిని కొడుతున్నారో సరిగా అర్థం కాలేదు హారతికి. తనకు సహాయంగా వచ్చిన యువకుడి తల ఇనుప గేటుకు కొట్టుకుని రక్తం కారడం మాత్రం ఆ గుడ్డి వెన్నెలలో మసకగా కనిపించింది.

ఈలోగా గేటు దగ్గర గలాటా విని పార్కులో చెదురు మదురుగా ఉన్న నలుగురూ పోగయ్యారు.

దెబ్బలు తిన్న ఇద్దరూ కింద పడ్డ ఫైల్స్ తీసి చంకన పెట్టుకుని గబగబా వెళ్ళిపోయారు ఏమీ జరగనట్లుగా.

నుదుటి మీదుగా రక్తం కారుతున్న అతని ముఖాన్ని చూస్తూ ఏం మాట్లాడాలో తెలీనట్లుగా ఉండిపోయింది హారతి.

ఆ యువకుడు రక్తం కారుతున్న నుదుటికి కర్చీఫ్ అడ్డుగా పెట్టుకుని, "మీరు ఇంటికి వెళ్ళండి మేడం..." అంటూ పెద్ద పెద్ద అంగలేస్తూ అక్కడ్నించి వెళ్ళిపోయాడు మరోమాటకు అవకాశంలేకుండా.

ఆ రాత్రి చాలా సేపటివరకూ ఆ యువకుడిని గురించి ఆలోచిస్తూనే గడిపింది....

ప్రతిరోజూ తనను చూస్తూనే పలకరింపుగా చిరునవ్వులు చిందించే అతని అందమైన, చురుకైన రూపమూ.. చెదిరిన జుట్టుతో రక్తం కారుతూండగా తగ్గని ఉద్రేకంతో బుసలు కొట్టే రూపమూ పదే పదే కళ్ళముందు కదలాడాయి.

అతని ఆరాధనా, ఆ సాహసమూ గుర్తుకు వస్తున్న కొద్దీ ఆమెకు అంత క్రితం అతనిపట్ల ఉన్న చిరాకూ, కోపం కరిగిపోయి వాటి స్థానంలో జాలి ముంచుకు వచ్చింది.

ఇంతకాలంగా అతని పట్ల తను కనబర్చిన నిర్లక్ష్యానికీ, నిరసనకూ పశ్చాత్తాపంలాంటి భావంకూడా కలిగింది.

ఆ కుర్రాడు అభిమానంగా తనవంక చూసి నవ్వితే, తాను ముఖం చిట్లించుకునేది...ఎంత అనాగరిక ప్రవర్తన...?

అతనికి కృతజ్ఞతలు చెప్పుకోలేదనే విషయంతో పాటుగా అతడు ఓ అనవసరమైన న్యూసెన్సు సృష్టించాడనే విషయం కూడా హారతికి స్ఫురించింది. అయినా వాళ్ళు అక్కడ అలా వెకిలిగా, అసభ్యంగా నవ్వడం, వ్యాఖ్యానించడం తప్ప తనకెలాంటి హానీ చేసే అవకాశం లేదు.

వాగిన ప్రతివాడినీ ఇలాకొడుతూపోతే ఈ లెక్కన సదా, ఓ దొమ్మీ కేసో, ఓ కొట్లాటో, హత్యో జరిగి ఊరుకుంటాయి.

అతని పేరేమిటో...? దెబ్బకు కట్టు కట్టించుకున్నాడో... లేదో? దెబ్బ ఎందుకు తగిలిందంటే ఇంట్లో వాళ్ళకు

ఏం చెప్పాడో...?

తను టీనేజ్‌లో ఉన్నప్పుడు ఒకసారి తన వల్ల కృష్ణమూర్తి కూడా గాయపడ్డాడు ఇలాగే....

అన్నట్లు కృష్ణమూర్తి ఎలాఉన్నాడో..? వేణు ఇప్పుడెక్కడున్నాడో..?అప్పుడు.. అప్పుడేంజరిగింది...?

* * *

ఆ ఏడాది కాలేజీ యానివర్సరీ ఫంక్షన్‌కు అద్భుతమైన ఏర్పాట్లు చేశారు.

ప్రతి విద్యార్థి ఏదో ఒక ప్రజ్ఞ చూపి బహుమతి గెలుచుకోడంతో విద్యార్థుల ముఖాల్లో ఆనందం, ఉత్సాహం చిందులు వేస్తోంది.

పురుషులను ఆహ్వానించేందుకు యువకులూ, స్త్రీలను ఆహ్వానించేందుకు యువతులూ జట్లుగా విడివడి వచ్చేవారిని మర్యాదగా, సమ్రతగా, నాజూకుగా ఆహ్వానించి వారి వారికి ఉద్దేశించిన స్థలాలను చూపిస్తున్నారు.

అంతటా ఆనందం ఉత్సాహం ... నవ్వుల పువ్వులు కేరింతల గలగలలూ.

ఎంతటి సందడిలోనైనా సరే మా బుద్ధి మాత్రం పోనిచ్చుకోం అన్నట్లుగా అమ్మాయిలను రకరకాలపేర్లతో వెక్కిరించే కొక్కిరాయిలు...వాలు చూపులతో గాలాలు వేసే నెరజాణలూ.

అబ్బాయిలు చేసే కామెంట్సుకు ఎప్పటిలా కోపం రావడం లేదు అమ్మాయిలకు.

చాలా తేలికగా తీసుకుని హాయిగా నవ్వేసుకుంటున్నారు. ఈరోజు ఎవ్వరికీ, ఎవ్వరిమీదా కోపం ఉండదు..రాదు. అంతా సంతోషమే-అంతా ఆనంద కోలాహలమే!

రంగు రంగుల విద్యుద్దీపాల వెలుగులలో సభా కార్యక్రమం ప్రారంభించబడింది. ప్రముఖులందరూ వేదికను అలంకరించారు.

సభికులను విసిగించకుండానే తమ ప్రసంగం ముగించారు ప్రిన్సిపాల్. ఆ తరవాతి ఐటమ్ బహుమతి ప్రదానం.

మైక్ ముందు ఉన్న సీనియర్ లెక్చరర్ ఒక్కొక్కరిపేరూ, వారు చదువుతున్న క్లాసూ, వారు పొందిన బహుమతి వివరాలూ ఎనౌన్స్ చేస్తుండగా విద్యార్థులు గర్వంగా నడుస్తూవచ్చి తమ తమ బహుమతులు స్వీకరిస్తే, విద్యార్థినిలు ప్రవాహం వంటి ఆ జనసమూహం మధ్యలోనుండి సిగ్గు సిగ్గుగా, భయంగా, బిడియంగా తమతమ బహుమతులు అందుకుంటున్నారు. కూర్చున్నవాళ్ళు వెడుతున్నవారి అడుగులకు అనుగుణంగా రిథమిక్‌గా చేతులతో తాళం వేస్తున్నారు.

ఒకటికి రెండుసార్లు స్టేజీమీదికి వెళ్ళి పిల్లల్ని చూస్తూ మరింత ఉత్సాహంతో తాళం వేస్తున్నారు.

"మిస్ కల్యాణి బెస్ట్ సింగర్"

"వెళ్ళవే" మోచేత్తో పొడుస్తూ హెచ్చరించింది హారతి పక్కనే ఉన్న కల్యాణిని. తర్వాత తనపేరే వచ్చింది.

"మిస్ హారతి థర్డ్ బి.యస్సీ, ఫస్ట్ ప్రైజ్ ఇన్ ద మోనోయాక్షన్"

ఏమాత్రం సిగ్గుపడకుండా, బిడియపడకుండా చకచక అడుగులువేస్తూ వెళ్ళి బహుమతి అందుకుంటున్న హారతి సౌందర్యం ప్రేక్షకుల కళ్ళకు విందును కలిగిస్తే ఆమె ధైర్యం, చురుకుదనం ఆశ్చర్యాన్ని కలిగించింది.

బహుమతి అందుకుని స్టేజీ దిగివస్తూ ముందువరుసలో రెప్పవాల్చకుండా తన వంకే చూస్తున్న యువకుడిని చూస్తూనే హారతి అడుగులు తడబడ్డాయి.



మూర్తీభవించిన పురుషత్వంలా ఉన్న ఆ యువకుడి సౌందర్యం హారతిని విచలితను చేసింది.

ఇద్దరి కళ్ళూ క్షణమాత్రం కలుసుకుని విడివడ్డాయి. ఆ యువకుడు చిరునవ్వుతో ఆమెను ప్రశంసించాడు.

పురుషులకు సైతం మోహం కల్పించే సౌందర్యం అతనిది. కన్నెపిల్లలు కలలు గనే సుందరరూపం. మగసిరి ఉట్టిపడే శరీర సంపద. ఆడపిల్లలను గాలంవేసి లాగగల కొంటెగా నవ్వే కళ్లూ... అందమైన చిరునవ్వూ.

ప్రథమ వీక్షణంలోనే అతని రూపం హారతి గుండెల్లో ముద్రపడింది.

హారతి చకచక అడుగులు వేస్తూ వెళ్ళి తన స్థానంలో కూర్చుంది. మరో రెండు పేర్ల తరువాత –

"మిస్ హారతి: థర్డ్ బియస్సీ. ఫస్ట్‌ప్రైజ్ ఇన్ షటిల్ కాక్ సింగిల్స్ మాచ్"

ఈసారి హారతి అడుగులు చురుకుగా పడలేదు. అతడు తనను గమనిస్తున్నాడేమోనన్న ఆలోచనతో అడుగులు తడబడ్డాయి. బహుమతి అందుకుంటూ అతడు తనను చూస్తున్నాడో లేదో అన్నట్లుగా క్రీగంట చూసింది.

ఆమె చూపును అందుకున్న అతడు చిరునవ్వు నవ్వాడు.

బహుమతి అందుకుని స్టేజీ దిగుతూ దూరంగా కూర్చుని నవ్వుతూ తనను అభినందిస్తున్న కృష్ణమూర్తిని చూసి ప్రతిగా తాను నవ్వింది.

"మిస్ హారతి. థర్డ్ బియస్సీ. బెస్ట్ యాక్ట్రెస్ ఇన్ ద కాలేజ్"

ఈసారి ప్రిన్సిపాల్‌గారు అందిస్తున్న నటరాజ విగ్రహం చూసి ముచ్చటపడింది హారతి.

స్టేజీ దిగుతూ అతని వంక చూసింది. ప్రతిగా అతను చిరునవ్వు చిందించాడు.

"ఆగండాగండి..." చిరునవ్వుతో ఆమెను ఆపుతూ కాలేజీ లిటరరీ సెక్రటరీ మాధవ్ హారతినినటరాజ విగ్రహంతోసహా ఫొటోతీశాడు. తన కాలేజీమాగజైన్ కోసం ముచ్చటైన నటరాజ విగ్రహాన్ని రెండు చేతులతోపట్టుకుని శిల్పంలా నిలిచిన హారతిమూర్తిని శాశ్వతంగా ఫొటోలో బంధించాడుమాధవ్. సభాస్థలం చప్పట్లతో మారుమోగింది,

చివరగా కల్చరల్ యాక్టివిటీస్...

లైలా మజ్నూ నృత్యనాటిక...చిన్న చిన్న డాన్సు ప్రోగ్రాంస్, తరువాత కృష్ణుని విరహాన్ని అనుభవిస్తున్న సత్యభామ...

అల్లనల్లన పాదమంజీరాలు ఘల్లనగా, ఇరుపేపుల చెలులు వింజామరలతో తోడురాగా సర్వభూషణ భూషితయైన సత్యభామ వేదికనలంకరించింది...

ప్రేక్షకుల కళ్లు చెదిరిపోయాయి.

ఎవరీ సుందరి...? ఓహ్...మిస్ కాలేజీగా సత్కరింపబడిన హారతి.

సత్యభామను చూస్తూ కళ్లు జిగేలుమంటున్న ప్రేక్షకులు ఆ పాత్రధారిణిని స్పష్టంగా గుర్తించలేకపోతున్నారు.

సౌందర్యసంపద, అంతకుమించిన ఐశ్వర్యసంపద—రెండిటినీ మించిన ఆత్మవిశ్వాసంతో వెలిగిపోతోంది సత్యభామాదేవి.

ద్వాపరయుగంలో నిజంగా సత్యాదేవి ఇంత అందంగా ఉందోలేదోకానీ ఈ అమ్మాయిమాత్రం సత్యభామ అంటే ఇలాగే ఉంటుంది, ఇలాగే ఉండాలి అనిపించేలా ఉంది.

సత్యభామ తన చెలులతో తన మనోనాథుడు తనను మోసగించి సవతులతో కలసిన వైనం కన్నీటితో వివరిస్తుంది.

ఆ తరువాత తన మనోనాథుడు ఇక తన మందిరానికి రాడేమోనని వ్యధ చెందుతుంది. వేదన ననుభవిస్తుంది.

సత్యభామ కృష్ణున్నెంతగా ప్రేమిస్తున్నదీ, కోరుకుంటున్నదీ, హారతి కళ్లల్లో స్పష్టంగా చూసిన ప్రేక్షకులు సత్యభామమీద కొంతంత జాలి కొంతకృష్ణుని మీద కోపం కలిగాయి.

తెర వాలింది. కరతాళధ్వనులు మిన్ను ముట్టాయి.

మరికొన్ని ఐటమ్స్ తరువాత ఫంక్షన్ పూర్తయింది.

ప్రేక్షకులు తమకునచ్చిన ఐటమ్స్‌ను ప్రశంసిస్తూ గుంపులుగుంపులుగా నడుస్తున్నారు.

కృష్ణమూర్తి గేటుదగ్గర హారతిని కల్సుకున్నాడు.

ఆ కొంచెం టైంలో పూర్తిగా తుడిచి వేసుకోలేని మేకప్...సత్యభామ అందాలను జ్ఞాపకం చేస్తోంది.

ఇద్దరూ జనాల్ని తప్పించుకుంటూ ముందుకు నడుస్తున్నారు.

హారతి కళ్లు వెదుకుతున్నాయి. ఆ రద్దీలో...

"మిస్ హారతీ" వెనకనుంచి ఎవరో పిలవడంతో ఆగి వెనక్కి చూసింది. ఆమె కళ్లు తళుక్కుమన్నాయి. అతన్ని చూసి చిరునవ్వు నవ్వింది.

"మిస్ హారతీ కంగ్రాచ్యులేషన్స్."

"థేంక్యూ..."

"సత్యభామగా మీ నటన అమోఘంగా ఉంది. మీ రూపంతో మీ అభినయంతో ఆ పాత్రకు జీవం పోశారు"

"హారతి సిగ్గుపడుతూ తలవంచుకుంది.

"పొ గు డు తు న్నా న ని మీరు అనుకోపోతే...నిజంగా ఆక్షణంలో మీరే నిజమయిన సత్యభామ అనిపించారు"

కృష్ణమూర్తి హారతిపక్కనే నిలబడి ఉన్నాడు.

జనం పలుచబడుతున్నారు. మరి కాస్త ఆలస్యం అయితే హారతీ, తాను మాత్రమే ఒంటరిగా వెళ్ళాల్సి వస్తుంది.

"మీరెటు వెళ్ళాలి...?" అంది హారతి మాట మారుస్తూ.

''కమల్ థియేటరు మీదుగా పక్క వీధిలోకి వెళ్ళాలి."

''అన్నట్లు వీరు..." కృష్ణమూర్తిని చూస్తూ అడిగాడు.

"వీరు...వీరు కృష్ణమూర్తిగారనీ... మా ఇంటిపక్కనే. మాకు బాగా కావల సినవారు"

హారతి పరిచయం పూర్తికాకుండానే కృష్ణమూర్తి కలిగించుకుని, "ఇక వస్తా మండీ, చాలాదూరం వెళ్ళాలి" అన్నాడు.

''సారీ,మాటల్లో పడి మరిచేపోయాను. వెళ్ళిరండి.మిస్ హారతీ గుడ్‌నైట్.... ఉంటానండీ కృష్ణమూర్తిగారూ"

హారతీ, కృష్ణమూర్తీ ముందుకు నడిచారు– 'గుడ్‌నైట్' చెబుతూ.

''రతీ, అతని పేరేమిటి....?"

"ఉహుఁ నాకు తెలీదు."

"పేరు తెలీదా...? అతను ఇంతక్రితం నీకు పరిచయం లేదా?"

"అబ్బే లేదు. ఇంతక్రితం హాల్లో చూశాను అంతే"

"మనిషికి చొరవ ఎక్కువ. ఇట్టే స్నేహం చేసుకోగలడు. అతను అంత చొరవగా మాట్లాడుతూంటే ఇంతక్రితం నీకు తెలుసేమో అనుకున్నాను..."

నిజమే... పేరయినా తెలుసుకున్నాను కాదు. అతను ఎవ్వరో...ఏమిటో, మరో సారి కనిపిస్తాడో... లేదో?

ఆలోచిస్తూ నడుస్తోంది హారతి.

"అన్నట్లు రతీ... ఇవ్వాళ ఫంక్షన్ అంతా నీదేకదూ...?"

హారతి నవ్వింది "నాదేమిటి... అందరిదీను"

''ఇవ్వాళ అందరికళ్లూ నీమీదే ఉన్నాయి. ఉండు...ఇంటికెళ్లాక అత్తయ్యను దిష్టి తీయమంటాను..."

హారతి నవ్వింది.

"నిజంగా సత్యభామ భార్యగా దొరికిన కృష్ణుడు అదృష్టవంతుడు సుమా"

"ఎందుకూ...?"

"ఏమో... ఈరోజు సత్యభామగానిన్ను చూసిన తరువాత అలా అనిపించింది"

కాలేజి ఊరికి చాలాదూరం ఉండటం చేత అందరూ జట్లుజట్లుగా వెళ్ళిపోవడంతో ఆ ప్రాంతంఅంతా నిర్మానుష్యంగా ఉంది.

రోడ్డుకు రెండువైపులా జీబురుమంటూ పెరిగిన పిచ్చిమొక్కలూ, దానిపక్కనే ఫ్యాక్టరీ, ఆ పక్కనే రైలుపట్టాలూ, ఇది ఒంటరిగానడిచే ప్రదేశం కాదు సుమా అన్నట్లు హెచ్చరిస్తున్నాయి.

పక్క సందులోనుండి ఎవరో ఇద్దరు ఈలలేస్తూ తూలుతూ వస్తున్నారు. వాళ్ళ వాలకం అనుమానాస్పదంగా అనిపించి వెనక్కు తిరిగి చూశాడు మూర్తి. వెనక నుండి ఎవరో ఇద్దరు వస్తున్నారు.

కృష్ణమూర్తి అడుగులు వడివడిగా

వేస్తూ "రతీ, త్వరగా పద..." అంటూ హెచ్చరించాడు.

"బ్రదర్...అగ్గిపెట్టె ఉంటేఇవ్వు.." ముందునడుస్తున్న ఇద్దరిలో ఒకడు కృష్ణమూర్తి అడుగులకు అడ్డంపడుతూ వెటకారంగా అడిగాడు.

"లేదు" పొడిగాచెప్పి మారో రెండు అడుగులువేశాడు మూర్తి.

"ఈ పిల్ల నీకేమవుద్ది...?"

ఇంతలో వెనకనడుస్తున్న ఇద్దరూ వచ్చిచేరారు.

"ఇదేదో లేపుకొచ్చిన సరుకులాఉంది గురూ..." రెండోవాడు అందించాడు.

కృష్ణమూర్తి ఆలోచిస్తున్నాడు...అంతా ఒకేగాంగ్. పిచ్చిగా నవ్వుతూ పేలుతూ హారతీ, కృష్ణమూర్తి అడుగుల్లో అడుగులు వేస్తూ అడ్డంతిరుగుతున్నారు. హారతి నిలువెల్లా ఒణికిపోతోంది. వీళ్ళను తప్పించుకోవడం ఎలా...? పిలిస్తే పలికే దిక్కు కూడా లేకుండావుంది. హారతిని రక్షించుకోడం ఎలా...?



తానొక్కడు.. వాళ్లు నలుగురు. తాను ఎంతగా ధైర్యంచేసినా నలుగురిని ఎదిరించడం కష్టమే. క్రాఫు చెదరకుండా, డ్రస్సు నలగకుండా, పెదవులమీది చిరునవ్వు మాయకుండా హీరోయిన్ని రక్షించేందుకు ఇదేమీ సినిమాకాదు...వాస్తవం!

ఉపాయంగా బయటపడాలే తప్ప ఎదిరించి లాభంలేదు... కృష్ణమూర్తి మెదడు తీవ్రంగా ఆలోచిస్తోంది.



“అడిగితే చెప్పవేంటే...”కయ్యానికి కాలుదువ్వుతూ, పిడికిలి బిగించి కృష్ణ మూర్తి మెడమీద పిడికిలితో ఒక్క గుద్దు వేశాడు మొదటివాడు.

ఆపదను శంకిస్తూనే ఉన్న మూర్తి ఆ దెబ్బను కాచుకుంటూ వాడికి అలాంటిదే మరోగుద్దు ప్రసాదించాడు.

ఎదుటివాడినుండి దెబ్బ ఆశించనివాడు అనుకోని ఈ దెబ్బకు దిమ్మెరపోయి ఆ తరువాత రెచ్చిపోతూ కృష్ణమూర్తి మీద కలియబడ్డాడు.

కృష్ణమూర్తి మీద మొదటిదెబ్బ పడుతూనే కెవ్వున అరచింది హారతి. ఊపిరి తిప్పుకోకుండా సహాయం కోసం అలా అరుస్తూనేవుంది ఇంకా...ఇంకా..ఇంకా.

‘అవసరం అయితే మేం ఉన్నాం...’ అన్నట్లుగా చోద్యంచూస్తున్నారు ఇద్దరు. ఒకడు హారతికి అతిసమీపంగావచ్చి ఆమె గుండెలమీద చేతులువేశాడు తమకంగా.

నిస్సహాయస్థితిలో భయంతో హారతి స్వరం మూగపోయింది. నోట మాట రానట్లు అలా చూస్తుండిపోయింది. కొన్ని క్షణాలు..ఆతరువాత గజగజ వణికిపోతూ పెద్దపెట్టున కేకలుపెట్టింది. వాడు హారతి చెయ్యిపట్టుకుని గుబురుగాఉన్న చెట్లలోకి లాక్కువెడుతున్నాడు.

తనమీద కలియబడుతున్న వాళ్ళను ప్రతిఘటిస్తూనే అది గమనించిన కృష్ణ మూర్తి తనమీద పడుతున్న వాడి గుండెలమీద బలంగా తన్ని వాడిని వది లించుకుని హారతివైపు పరుగుతీశాడు. హారతి కేకలుపెడుతూ వాడితో పెనుగులాడుతోంది. వెనకగావచ్చిన కృష్ణమూర్తి వెనకనుండి రెండుచేతులూ వాడి మెడ చుట్టూచుట్టి బలంగా లాగాడు వెనక్కు.

ఈ హఠాత్పరిణామానికి తట్టుకోని వాడు వెల్లకిలాపడిపోయాడు. పడిపోయిన వాడి గుండెలమీద బలంగా తన్ని కాలు నొక్కిపట్టి ముక్కుమీద గుద్దాడు.

వెనకనుండి సహాయంకోసం వచ్చిన వాళ్ళు మూర్తిని చుట్టుముట్టారు. ఒకడు మూర్తి డొక్కలో బలంగా తన్నాడు. నిలదొక్కుకోలేని మూర్తి రాతిమీద వెల్లకిలా పడిపోయాడు. పడిపోయినవాడిని మరి లేవనీయకుండా నలుగురూ చుట్టుముట్టారు.

ఇంతలో ఎవరో పరిగెత్తుకుంటూ ఇటే రావడం గమనించిన ఒకడు, “ఒరేయ్, ఎవరో ఇటే వస్తున్నార్రా...” అన్నాడు మిగిలినవాళ్ళతో.

ఆ వ్యక్తి రావడమూ, అందులో దొరికినవాడికి తన చేతివాటము రుచి చూపించడమూ జరిగింది.

ఇప్పుడు ఒకళ్ళకిద్దరు అవడంతో నలుగురు రౌడీలూ కాలికి బుద్ధిచెప్పారు. కృష్ణమూర్తికి బాగా దెబ్బలు తగిలాయి.

వచ్చిన ఆగంతకుడు తన చేతిలో ఉన్న టార్చిని కృష్ణమూర్తి మీద ఫోకస్ చేసి చూశాడు.

కృష్ణమూర్తి పెదవి చిట్లి రక్తం కారుతోంది. రాతిమీద పడటంవల్ల తలకు పెద్ద గాయమే అయ్యింది. రక్తంతో షర్టంతా తడిసిపోతోంది.

కాళ్ళూ, చేతులూ గీరుకుపోయి బట్టల నిండుగా రక్తపు మరకలూ-దుమ్మూ.

“మిస్టర్ కృష్ణమూర్తీ! మీకు పెద్ద గాయాలే తగిలాయి...”

కృష్ణమూర్తి అతని స్వరాన్ని గుర్తించాడు.

అతను ఇంతకుముందు తమకు కాలేజీలో కలిసిన యువకుడు. కృష్ణమూర్తి హృదయంలో ఓ చిన్న అనుమానం

చోటుచేసుకుంది. కానీ అతని సంస్కారం అతన్ని గద్దించింది.

హారతి భయంతో ఇంకా వణికి పోతూనే ఉంది. జుట్టూ, బట్టలూ అస్తవ్యస్తంగా ఉండి భయంతో గజగజ వణికిపోతున్న ఆ పిల్లను చూస్తుంటే వారికి జాలివేసింది.

'ఎన్ని అర్హతలున్న ఆడపిల్లయినా ఈ విషయంలోమాత్రం అబలేకదా...?' అనిపించి నిట్టూర్పు విడిచాడు మూర్తి.

"రతీ...ఇంక భయంలేదు...వెడదాం పద..." అన్నాడు మూర్తి ఆమె దగ్గరగా వస్తూ.

"హారతిగారూ! భయపడకండి. వాళ్లు పారిపోయారు.పదండి వెడదాం"అన్నాడా యువకుడు-ఇంకా పిచ్చిచూపులు చూస్తూ అంగుళం కూడా కదలని హారతిని చూస్తూ.

"రతీ! కాస్త స్థిమితపడు" మూర్తి హారతి చెయ్యిపట్టుకున్నాడు. అంతే! పెద్దగా కేకలువేస్తూ తోచిన దిక్కుగా పరుగులుతీసింది హారతి.

చూస్తున్న ఇద్దరూ నివ్వెరపోయారు.

"రతీ..రతీ" గట్టిగా పిలుస్తూ ముందుకు పరుగెత్తాడు మూర్తి. హారతి వెనక్కు తిరిగిచూస్తూ అరుస్తూ పరిగెడుతూంది.

మూర్తి ఆమె వెనుకనే కాస్త వేగంగా పరుగుతీసి ఆమెను అందుకున్నాడు.

"రతీ! రతీ! ఏమిటిది? నేను...నేను మూర్తిని"

హారతి పిచ్చిదానిలా అతని వైపు చూస్తూ అతని చెయ్యి విదిలించికొడుతూ తిరిగి పరుగు మొదలుపెట్టింది కేకలు పెడుతూ.

వెనకనే వచ్చిన యువకుడు కృష్ణమూర్తి భుజంమీద చెయ్యివేస్తూ "ఆమె మెంటల్‌గా షాక్ తిన్నారు" అన్నాడు సాలోచనగా. కృష్ణమూర్తి అయోమయంగా అతనివంక చూశాడు. మెంటల్ షాక్ అనేమాట అతన్ని భయపెట్టింది.

ఆ యువకుడు క్షణం ఆలోచించి "మీరిక్కడే ఉండండి. ఆవిణ్ని నేను తీసుకొస్తాను" అంటూ ఆమె వెనకే పరుగెత్తాడు. అలసిపోయిన హారతి త్వరగానే దొరికిపోయింది.

"హారతిగారూ ... ఏమిటిది చిన్నపిల్లలా?" మందలిస్తూ ఆమె చేతిని అందుకున్నాడు.

హారతి అతని చేతిలో నుండి చెయ్యి విడిపించుకునేందుకు కీచుగా అరుస్తూ గింజుకుంటోంది. కేకలు పెట్టి పెట్టి ఆమె స్వరం కీచుగా మారిపోయింది. ఆమె గించుకుంటున్నకొద్దీ అతని పిడికిటిలో ఆమె చెయ్యి బిగుసుకుంటోంది "హారతీ... పద వెడదాం" అతను ఆమె చెయ్యి పట్టుకుని ముందుకు అడుగు వేశాడు.

ఆమె బలమంతా ఉపయోగించి అతని నుండి విడిపించుకుని పారిపోయేందుకు ప్రయత్నిస్తోంది.

అంతే...అతని చెయ్యి గాలిలోకి లేచి ఆమె చెంపను బలంగా తాకింది. చెంప చెళ్లుమన్నది...

హారతి కళ్ళ ముందు చుక్కలు మెరిసాయి...

కళ్ళనిండుగా నీళ్లు బుగ్గల మీదుగా జారిపడ్డాయి. దూరం నుండి చూస్తున్న కృష్ణమూర్తి హృదయం ఆ దెబ్బ తన చెంప మీద పడ్డట్లుగా విలవిలలాడిపోయాడు.

అతని హృదయం బాధగా మూలిగింది.

గింజుకోడం మానేసిన హారతి బేలగా

అతనివైపు చూస్తోంది.

"పద..." అన్నాడు కఠినంగా.

హారతి మాటమాటాడకుండా మంత్రముగ్ధలా అతని వెనకే నడిచింది. ఆమె చెయ్యి ఇంకా అతని చేతిలో బిగుసుకునే ఉంది. అతను హారతిని నడిపించుకుంటూ కృష్ణమూర్తి దగ్గరకు వచ్చాడు.

"కృష్ణమూర్తిగారూ! మీ తలకు అయిన గాయానికి వెంటనే యాంటిసెప్టిక్ ఇంజక్షన్ తీసుకుని కట్టుకట్టించుకోకపోతే ప్రమాదం. నా డిస్పెన్సరీకి వెడదాం పదండి" అన్నాడు నడుస్తూ. కృష్ణమూర్తి అనుసరించాడు.

హారతి మాటా పలుకూ లేకుండా పిచ్చిదానిలా అతనివెంట నడుస్తోంది.

డిస్పెన్సరీ తాళం తీసి, "కూర్చో" అన్నాడు చెయ్యి వదిలిపెడుతూ. అక్కడే ఉన్న కుర్చీలో కూలబడింది హారతి బొమ్మలా.

అతను కృష్ణమూర్తి గాయాలన్నీ శుభ్రంచేసి కట్టుకట్టి ఇంజక్షన్ చేశాడు. హారతి అతను చేస్తున్న పనులన్నీ బొమ్మలా చూస్తూ కూర్చుంది. "మీరు... డాక్టరా...?" ఆశ్చర్యంగా అడిగాడు కృష్ణమూర్తి.

అతను నవ్వి "అవుననుకుంటాను" అన్నాడు జోక్‌గా. కృష్ణమూర్తి నవ్వేశాడు.

ఇంతకు పూర్వం తన హృదయంలో మెదిలిన అనుమానానికి సిగ్గుపడ్డాడు.





ఈ సినిమాలూ, ఈ నాటకాలూ, ఈ నవలలూ, అన్నిటినీ అందరినీ అనుమా

నించడం మాత్రమే నేర్పుతున్నాయి.

"ఏమిటీ.. మీలో మీరే నవ్వుకుంటు న్నారు?" అతని కాలికి తగిలిన గాయా నికి బాండేజ్ వేస్తూ అడిగాడు డాక్టర్.

కృష్ణమూర్తి చెప్పాలా...వద్దా అన్నట్లు కొన్నిక్షణాలు-"ఏమీలేదు... ఈమధ్య ఒక సినిమా చూశాను.అందులో హీరో హీరోయిన్ ప్రేమ సంపాదించుకు నేందుకు ఆమె మీద రౌడీలను ప్రయో గిస్తాడు. వాళ్లు ఆమె మీద అఘాయిత్యం జరపబోతుండగా అతను వచ్చి ఆమెను రక్షించి, ఆమె ప్రేమను సంపాదిస్తాడు. ఆ విషయం గుర్తుకు వచ్చి నవ్వు వచ్చింది..."

"కొంప తీసి ఆ హీరోతో నన్ను పోల్చుకోలేదు కదా?" నవ్వుతూ అడిగాడు డాక్టర్.

"పోల్చుకున్నాను కాబట్టే నవ్వు వచ్చింది..."

"అంత అభాండం వేయకండి నా మీద. నాకూ నలుగురు చెల్లెళ్ళున్నారు"

డాక్టర్ నవ్వుతూనే అన్నా అందులో లీలా మాత్రంగా బాధ, నిష్ఠూరం ఉంది.

"సారీ... డాక్టర్! నా పోలిక తప్పని తెలుసుకున్నాను"

"ఇట్స్ ఆల్ రైట్" కృష్ణమూర్తి ఎంతో నిజాయితీగా తన తప్పును ఒప్పు కోవడం డాక్టరుకు ఎంతో నచ్చింది.

"డాక్టర్, రతి..." తామింతగా మాట్లాడుతున్నా పట్టనట్లుగా పిచ్చిగా, బేలగా చూస్తున్న హారతిని చూస్తూ అన్నాడు మూర్తి.

"ఫరవాలేదు... మెంటల్‌గా షాక్ తిన్నారు. కాస్త విశ్రాంతి తీసుకుంటే షివిల్ బీఆల్ రైట్"

డాక్టర్ హారతికి ఇంజక్షన్ చేశాడు. ఆతరువాత ఫ్లాస్క్‌లోఉన్న కాఫీ ముగ్గురూ పంచుకు తాగారు.

డిస్పెన్సరీకి తాళం వేసి ముగ్గురూ బయటికి వచ్చారు. హారతినీ, కృష్ణ మూర్తినీ ఇంట్లో దిగ విడిచి వెనక్కి తిరిగేసరికి సరిగ్గా అర్ధరాత్రి రెండు గంటలు దాటింది.

తిరిగి వస్తుండగా కృష్ణమూర్తి అడిగాడు.

"డాక్టర్,మళ్ళీ ఎప్పుడు కలుస్తారు?"

"పేషంట్స్‌ను విజిట్ చేసేందుకు రేపు తప్పనిసరిగా రావాలికదూ..."

"డాక్టర్ మీ పేరు?"

డాక్టర్ నవ్వాడు. పేర్లు తెలియ కుండానే ఈ రెండుగంటల కాలంలో తమ మధ్య ఎంతో ఆత్మీయత అల్లు కుంది. ఈ ఆత్మీయ భావనకు కారణమైన హారతి తనను పట్టనట్లుగా వాళ్ళవెనకే యాంత్రికంగా అడుగులువేస్తోంది.

"వేణు..."

"ఓ.కె. గుడ్‌నైట్ డాక్టర్..."

"గుడ్ నైట్..."

* * *

కృష్ణమూర్తిచెప్పగా విషయమంతా విన్న పార్వతమ్మగారు, కృష్ణమూర్తిగాయాలన్నీ తడిమి తడిమి మరీ కన్నీరు పెట్టుకుంది.

"నాకేమీ ఫరవాలేదత్తయ్యా! డాక్టరు గారు ఇంజక్షన్ చేశారు. రతి బాగా భయపడిపోయింది. కాస్త దగ్గర కూర్చుని ధైర్యం చెప్పు. నేనింటికి వెడతాను"

"మూర్తీ! నీ ఋణం ఎలా తీర్చు కుంటాం నాయనా?" పార్వతమ్మగారు కన్నీరు ఒత్తుకున్నారు.

"అత్తయ్యా! ఋణంగిణం అంటూ నన్ను పరాయివాణ్నిగా చెయ్యకు. రతిని రక్షించాల్సిన బాధ్యత నాకు మాత్రం లేదూ? దేవుడిలా ఆ డాక్టరుగారు రాకపోతే.

ఊఁ..సర్లే! నేను వెడుతున్నాను" గుమ్మం దిగాడు మూర్తి.

* * *

ఆనాడు అలా జరిగింది. పెద్ద ప్రమాదం నుండి మూర్తి,వేణుల పుణ్యమా అని బయటపడగలిగింది. ఇప్పుడు మళ్లీ దాదాపుగా అదే ఘట్టం. ఈరోజు ఈ కుర్రాడిలా ఆపద్బాంధవుడిలా ఆదుకున్నాడు కాబట్టి సరిపోయింది.

అప్పుడు ఆదుకున్న మూర్తి, వేణు కాలక్రమంలో తనకు దూరమైపోయారు. కాదు... కాదు తనే దూరం చేసుకుంది.

మరి, రేపు ఈ కుర్రాడు...?

* * *

మరునాడు పార్కులోకి అడుగుపెడుతూనే హారతి కళ్ళు అతని కోసం వెదుక్కున్నాయి. అతనెక్కడా కనిపించక పోవడంతో నిరాశగా ఆమె హృదయం నిట్టూర్చింది. అతణ్ని కలుసుకునేందుకు తానెంతగా ఆరాటపడుతుందీ ఆక్షణంలో స్పష్టంగా తెలిసి వచ్చింది.

'అతనికి దెబ్బలు బాగా తగిలాయేమో ఎలాఉందో...?' అనుకుంది ఆందోళనగా గేటువంకే చూస్తూ.

అయిదు నిమిషాలు అయిదు యుగాల్లా గడిచాయి హారతికి. అమ్మయ్య అతను వస్తున్నాడు. పెద్దపెద్ద అంగలు వేస్తూ గంతులువేస్తున్నట్లు చలాకీగా- అవును... అతనే!

అతను వస్తూనే ఆమెను చూసి చిరునవ్వు నవ్వాడు ఎప్పటిలా. ప్రతిగా ఆమె నవ్వింది.

నవ్వుతోన్న ఆమెను చూసిన అతడు నేరుగా వచ్చి హారతికి కొంచెం దూరంలో కూర్చున్నాడు.

అతని ముఖం సంతోషంతో వెలిగిపోతోంది. ఎదురు చూస్తున్న శుభసమయం వచ్చినట్లూ, ఎంతో కాలంగా తపస్సు చేస్తున్న దేవత కరుణించి వరమిచ్చినట్లూ సంతోషంతో, ఉద్వేగంతో అతనిలోని అణువణువూ ఉప్పొంగిపోతుంది. ఆ సంతోషం అతని ప్రతి కదలికలోనూ, ప్రతిచూపులోనూ, నవ్వులోనూ స్పష్టంగా కనిపిస్తోంది.

ముందుగా ఎవరు మాట్లాడాలో తెలీనట్లు ఇద్దరూ ఒకరినొకరు చూస్తూండిపోయారు కొంతసేపు.

దూది అంటించిన నుదిటి మీది గాయం చూస్తూ చివరికి హారతే అంది-"మీకు దెబ్బ బాగా తగిలినట్లుంది..."

అతని ముఖంలో ఉప్పెన వంటి సంతోషం... పలకదు అనుకున్న శిలా రూపంలో ఉన్న దేవత పలికినప్పటి ఆనందం.

"లేదు, మేడం చాలా చిన్నదెబ్బ" చాలా తేలికగా తీసివేశాడతను.

"ఎందుకలా చేశారు...?"

"ఏం చేశాను...?"

"అదే... అదే వాళ్ళమీద ఎందుకు కలియబడ్డారు ?"

"లేకపోతే వాళ్లు పిచ్చిగా వాగుతుంటే వింటూ, చూస్తూ ఊరుకోమన్నారా?"

అప్పటి వరకూ నవ్వుతూన్న అతని ముఖంలో అకస్మాత్తుగా కోపం, ఉద్రేకం చోటు చేసుకోవడం గమనించిన హారతి నవ్వుకుంది.

"వాళ్ళు వాగినంత మాత్రాన మనకు పోయేదేముంది? మీరు పట్టించుకోకుండా ఉండవల్సింది. అనవసరంగా న్యూసెన్సు"

హారతి మాటలకు అతను దెబ్బతిన్నట్లున్నాడు. ముఖం చిన్నబోయింది.

"ఏమో! మిమ్మల్నలా మాట్లాడు తూంటే వింటూ సహించలేకపోయాను. సారీ!"

"అహా ఎంత మంది మీదికి దెబ్బ లాటకు వెడతారు?" నవ్వుతూ అడిగింది హారతి.

ఆమె ముఖంలో నవ్వుచూసిన తరువాత అతని ముఖం తిరిగి వికసించింది.

"మిమ్మల్ని ఎవరేమన్నా నేను సహించ లేను. ఎంత మందితోనైనాసరే దెబ్బ లాడతాను. చివరకి ప్రాణంపోయినా సరే"

అతని మాటలు వింటున్న హారతి గుండెలు సన్నగా కంపించాయి.

* * *

'మిమ్మల్ని ఎవ్వరేమన్నా సరే



సహించలేను. చివరికి ప్రాణంపోయినా సరే'

'మిమ్మల్ని ఎవరేమన్నా సహించలేను. చివరికి ప్రాణంపోయినా సరే..' ఆ రాత్రి తిరిగి తిరిగి అవే మాటలు హారతి చెవుల్లో ప్రతిధ్వనించాయి పదే పదే!

మూర్తి కూడా తనను ఇలాగే పిచ్చిగా ప్రేమించేవాడు. ఆ అనురాగంలో వ్యామోహానికీ, స్వార్థానికీ తావు లేదు.

అవధులు లేని అనురాగం అది!

మూర్తి ఎలా ఉన్నాడో? సంసారంలో పడి తనని పూర్తిగా మరచిపోయి ఉంటాడు. మూర్తి తనను మరిచిపోకుండా ఇంకా ప్రేమిస్తూనే ఉండాలని కోరుకోడం ఏమిటి?

స్త్రీకి సర్వదా సర్వావస్థలయందూ తనను ప్రేమించే ఓ ఆలంబన కావాలి. తనకోసం ప్రాణంపెట్టగల మనిషి కావాలి. కనీసం అలాంటి మనిషి తనకున్నాడనే భ్రమ అయినా కావాలి.

ప్రేమరాహిత్యంలో స్త్రీ బతకలేదు. బతికినా మెంటల్ పేషంట్‌గా బతుకుతుందే తప్ప రసమయ జీవితాన్ని పొందలేదు.

అవునూ ఇతను..ఇతను ఏమన్నాడూ?

'మిమ్మల్ని ఎవరేమన్నా సహించలేను. చివరికి ప్రాణం పోయినా సరే'

ఇంతకూ ఇతని పేరేమిటో?

మనిషిలో ఇంకా పసితనం పోలేదు.

యవ్వనం తెచ్చిన చురుకుదనం, చలాకీదనం, ఆరోగ్యం అతన్ని అందంగా, ఆకర్షణీయంగా కనిపించేలా చేస్తున్నాయి. గంతులు వేస్తున్నప్పటి చురుకుదనం... హైస్కూలు వదలని అమాయకత్వం.

* * *

"గుడీవినింగ్"

"గుడీవినింగ్..." హారతి ప్రసన్నంగా నవ్వుతూ అతని ఎదురుగా కూర్చుంది.

"ఎంతసేపయింది మీరు వచ్చి?" అడిగింది హారతి పచ్చగడ్డిమీద సర్దుకుని కూర్చుంటూ.

"ఓ పదినిమిషాలయి ఉంటుంది మేడం" అతని చేతుల్లో ఓ జంట గులాబి గుత్తి ఉంది.

"మేడం ఇవి తీసుకోండి" అంటూ ఆమెకు అందించాడు.

హారతి సంశయించింది.

"తీసుకోండి మేడం...''అతను అంత ఆప్యాయంగా అందిస్తున్న వాటిని వద్దని తిప్పికొట్టేందుకు మనస్కరించక సంశయిస్తూనే తీసుకుంది. అప్పుడే రేకులు విచ్చుకుంటున్నట్లున్న తెల్లగులాబీలు, విడీవిడని రేకులతో ముద్దులు మూటకడుతున్నాయి.

వాటివంక ఆప్యాయంగా చూస్తోంది హారతి.

తను ఇచ్చిన చిన్ని కానుక ఆమెను ఆకర్షించినందుకు అతని ముఖం వెలిగిపోతోంది.

"మేడం..."

"నా పేరు హారతి" నవ్వుతూ అంది హారతి.

'నాకు తెలుసు...' అన్నట్లుగా నవ్వేశాడు.

తనపేరు చెబుతాడేమోనని ఎదురుచూసిన హారతి అతను చెప్పకపోవడంతో అడగక తప్పలేదు.

"మీ పేరు?"

"ప్రభాకర్! అందరూ 'ప్రభా' అంటారు"

"ఏం చదువుతున్నారు?"

"బి.కాం. అయిపోయింది. జాబ్ కొరకు ప్రయత్నం. ఈ రోజుల్లో ఉద్యోగమంటే ఇంద్రపదవిలా ఉంది"

"ఉద్యోగంకంటే ఇంద్రపదవి సంపాదించడమే సులభమేమో..." నవ్వుతూ అంది హారతి.

"మీరు అదృష్టవంతులు మేడమ్! మీకా శ్రమ తప్పిపోయింది. గ్రాడ్యుయేట్స్, పోస్టు గ్రాడ్యుయేట్స్ హోటల్స్‌లో సర్వర్లుగా, థియేటర్ గేట్లదగ్గరా పనులు చేస్తున్నారు. నేనే గేటు వెదుక్కోవాలో" నవ్వుతూనే అన్నా, అతని మనస్సులోని బెంగ స్వరంలో తొంగిచూస్తూనే ఉంది.



నవ్వుతూ కబుర్లు చెప్పుకొంటున్న వాళ్లు చీకట్లు ముసురుకుంటూన్న విషయం గమనించలేదు.

"ఇక వెడతానండీ... చీకటి పడుతోంది" లేచి చీరకు అంటిన గడ్డిపరకలు దులుపుకుంటూ అంది హారతి.

"పదండి..."

ప్రభాకర్ ఆమెను ఇంటివరకూ దిగబెట్టి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి... ప్రభాకర్ ఇచ్చిన జంట గులాబీల గుత్తిని చెంపలమీద ఆనించుకుంటూ ఆలోచనలలో మునిగిపోయింది హారతి.

తాను పూలసుతాకీ, కనీసం వాటిగురించి ఆలోచించీ ఎంతకాలం అయిపోయిందీ.... ఒకప్పుడు పూలంటే తనకు ఎంత మోజు? ఆ ఇష్టం అంతా ఏమైపోయిందో...? కాలేజీకి ఎప్పుడూ జడ నిండుగా పువ్వులతో వెళ్ళేది... అది ఫాషన్‌కాదని తెలిసినా. 'పూలదయ్యం...' అంటూ స్నేహితులు వెక్కిరించేవాళ్లు. క్రమేపీ తన హృదయం కరుడు కట్టుకుపోయి పుష్ప సౌకుమార్య సౌందర్య సౌరభాలు తనని కదిలించి, కరగించటం మానేశాయి.

* * *

హారతికిప్పుడు ప్రభాకర్‌ను 'ప్రభా' అనిపిలిచేంత చనువుఏర్పడింది. ప్రభాకర్ రోజూ ఆత్మీయంగా గులాబీలు సమర్పించుకుంటాడు దేవీ విగ్రహంముందు భక్తుడు భక్తిభావంతో సమర్పించుకునే చిన్ని కానుకలా. ఆ ఇచ్చేముందు ఒక్కసారి సున్నితంగా తన పెదవులకు ఆనించుకుని మరీఇస్తాడు. ఈ విషయం హారతి దృష్టికి వచ్చినా చూడనట్లు నటిస్తుంది. అవి స్వీకరించేందుకు సంకోచించకపోగా కించిత్ గర్వంగా కూడా ఫీలవుతోంది ఆమె స్త్రీ హృదయం.

ప్రభాకర్ చనువుగా హారతి ఇంటికి వచ్చి వెడుతున్నాడు. ఒకవేళ అతను ఏ కారణంచేతైనా రాలేకపోయినా ఆమె అతని కోసం ఎదురుచూస్తుంది. 'గుడ్‌మార్నింగ్ మేడం' అనో 'గుడీవినింగ్ మేడం...' అనో ప్రభాకర్ స్వరం వినిపించనిరోజున ఆమెకు ఏదో పోగొట్టుకున్నట్లుంటుంది.

'మిమ్మల్ని చూడనిరోజున, మీతో మాట్లాడనిరోజున నాకు అన్నం తినబుద్ధి రాదు...నిద్రరాదు.ఏదో పోగొట్టుకున్నట్లు వెంగగా ఉంటుంది మేడమ్' అంటూ తన అవస్థ అంతా వర్ణించే ప్రభాకర్ వంక అయోమయంగా చూస్తుంది.

పార్కులోనో, ఇంటిదగ్గరో కూర్చుని గంటల తరబడి కబుర్లు చెప్పుకోవటం మామూలయిపోయింది. అతను వెళ్ళిపోయిన తరువాత హారతి అనుకుంటుంది– 'ఇంత సేపూ మేం ఏం మాట్లాడుకున్నాము'...అని.

'ఏమీలేదు..ఒట్టి స్వీట్ నథింగ్స్ తప్ప' అనే విషయం ఆమెకు స్పష్టంగా తెలిసిపోతుంది.

ఈ స్నేహంగురించి హారతి అప్పుడప్పుడూ ఆలోచించకపోలేదు. ఎడారి వంటి తన జీవితంలో ప్రభా స్నేహం ఒయాసిస్సులాంటిది. లేనిపోని అనుమానాలతో, భయాలతో, శంకలతో తానీ చిన్న తృప్తిని కూడా దూరం చేసుకోలేదు.

ఈ స్నేహానికి మూలంఏమిటో, ఈ స్నేహస్వభావం, స్వరూపం ఏమిటో ఆమె ఊహకు అందుతూనే ఉన్నా దాన్ని గురించి ఎక్కువగా ఆలోచించేందుకు ఇష్టపడలేదు ఆమె హృదయం.

* * *

పార్కులో మెత్తని గడ్డి పరకలు

వేళ్లతో తుంపుతూ పరధ్యానంగా కూర్చుంది హారతి.

ఆకుపచ్చని నేతచీర పచ్చగడ్డిరంగుతో పోటీ పడుతోంది. పచ్చని పాదాలమీద జీరాడే ఆకుపచ్చని కుచ్చిళ్ళు...!

పొడవైన లేత వేళ్ళమధ్య గడ్డి పరకలు పచ్చగా, అందంగా... చిత్రకారుడు రచించిన ఆకుపచ్చని వర్ణచిత్రంలా ఉన్న ఆమెవంక తదేకంగా చూస్తూ కూర్చున్నాడు ప్రభాకర్.

"ఇవాళ మీరు చాలా పరధ్యానంగా ఉన్నారు..." ఉలిక్కిపడ్డట్లుగా తలఎత్తి చూసింది హారతి.

ఆ తరవాత చిన్నగా నవేస్తూ, "అబ్బే, అదేం...లేదు..." అంది చిన్నగా.

"మేడం మీకళ్ళు మాట్లాడతాయి. మీరు నోటితో అబద్ధం చెప్పినా మీకళ్ళు నిజమే చెబుతాయి"

హారతి తలఎత్తి చూసింది.

అతనికళ్ల నిండుగా అంతులేని అభిమానం...ఆరాధన! హారతి కళ్ళు చెమరించాయి.

''ఏం జరిగింది మేడమ్?"

హారతికి ఏంచెప్పాలో తోచలేదు. తన జ్ఞాపకాలను, తన భావాలను అతనిముందు పరచలేదు.

"అమ్మకు బాగుండలేదట. గిరి ఉత్తరం రాశాడు'' అంది నెమ్మదిగా.

''మీరు వెళ్ళాలా?'' అన్నాడు ప్రభాకర్ దిగులుగా.

''ఊఁ...''

''ఎన్నాళ్లు సెలవు పెడుతున్నారు?''

''నెల''

''అమ్మో... నెలఎందుకు మేడమ్?''

''సెలవులున్నాయిగా. అమ్మను చూసి అలాగే గిరిదగ్గర కొన్నాళ్లుంటాను. వెళ్ళి చాలాకాలం అయింది''

ప్రభాకర్ దిగులుగా తలవంచుకున్నాడు.

అతను ఏదో చెప్పాలనుకుని చెప్పలేకపోతున్నాడు.

''మీరు వెళ్ళకపోతేనేం...''అన్నాడు చివరకు.

హారతి ఆశ్చర్యంగా చూసింది అతనివంక. తను వెడుతున్నందుకు అతని కళ్ళల్లో దిగులు, బెంగ స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"వెళ్ళకపోతే ఎలా?" అంది వెళ్ళవలసి వచ్చినందుకు తనూ బాధపడుతున్నట్లుగా.

"పోనీ, ఓ రెండు రోజులు ఉండి వచ్చేయండి"

హారతి మాట్లాడలేదు. పరధ్యానంగా ఏదో ఆలోచిస్తూ ఉండిపోయింది. ప్రభాకర్‌కు పార్కుకు వచ్చినప్పటి ఉత్సాహం ఊదేసినట్లుగా ఆరిపోయింది. దానిస్థానే అతని కళ్ళల్లో కొండంత దిగులు చోటు చేసుకుంది.

"మళ్ళీ ఎప్పుడు వస్తారు!" అన్నాడు విడిపోయేలోపు పదహారోసారి.

"ఊఁ...ఊఁ" అంది పరధ్యానంగా హారతి.

ఆ సాయంత్రం ప్రభాకర్ దిగులుతోనూ, హారతి తరుముకువచ్చే జ్ఞాపకాల జ్ఞాపకాలతోనూ ఎక్కువగా మాట్లాడలేకపోయారు.

* * *

వాలు కుర్చీలో కూర్చుని కళ్ళపై చేతులుంచుకుని ఆలోచిస్తున్న హారతి చటుక్కున లేచి వెళ్ళి టేబిల్ మీద ఉన్న అద్దం చేతిలోకి తీసుకుంది.

తన ముఖం తాను అద్దంలో చూసు

కునేందుకు సంశయిస్తున్నట్లుగా ఒక్క క్షణం అలాగే నిలబడిపోయింది.

ఆ తరువాత తిరిగి అద్దం చేతిలోకి తీసుకొని తనముఖం పరీక్షగాచూసుకొంది.

'మీ కళ్ళు మాట్లాడతాయి' ఉలిక్కిపడి చుట్టూ చూసుకుంది. 'ఊహూఁ... ఎవరూ లేరు' ఈసారి ధైర్యంగా మొహం చూసుకుంది. రంగు వెలసిన బొమ్మలా అద్దంలో తన మొహం!

'తన కళ్ళు మాట్లాడతాయా?'

'నీ కళ్ళు కథలు చెబుతాయి రతీ' ఎప్పుడో, ఎంతకాలం కిందటో విన్న మాట.

తిరిగి ఈరోజు అదేమాట – కొంచెం తేడాతో.

హారతి అద్దంలో తన కళ్ళ వంక పరీక్షగా చూసుకుంది.

విశాలంగా, సోగగా ఉన్నకళ్లు కాంతి విహీనాలై వెలవెలబోతున్నాయి. కళ్ళ కింద నల్లటి వలయాలు చోటు చేసుకుంటున్నాయి. 'ఈ కళ్లేనా మాట్లాడేది?' పేలవంగా నవ్వుకుంది హారతి. పలుచబడుతున్న జుట్టులోనుండి తెల్లవెంట్రుకలు తొంగి చూస్తున్నాయి. పచ్చగా, చేమంతి పూలలా, మృదువుగా, నిండుగా ఉండే చేమంతిబుగ్గలు పాలిపోయి గుంటలు పడుతున్నాయి.

ఈ హారతి ఒకప్పటి కాలేజీ బ్యూటీ అంటే ఎవరు నమ్ముతారు?

ముప్పై ఏళ్ళకే వార్ధక్యం తనని కబళిస్తోంది.

అకాల వార్ధక్యం...

హారతి భారంగా నిట్టూర్చి అద్దం టేబిల్ మీద పెట్టి తిరిగివెళ్ళి వాలుకుర్చీలో కూర్చుంది.

నిజమే. అకాల వార్ధక్యం తనను కబళిస్తోంది.ఇన్నాళ్లూ తనను తానెప్పుడూ పరీక్షగా చూసుకోలేదు.

రాలిపోగా మిగిలిన జుట్టూ చెంపల దగ్గర తెల్లబడుతోంది.

అంటే...అంటే తన యవ్వనానికి చరమదశ ఆరంభమైనదన్నమాట. తనేమీ అనుభవించకుండానే తన యవ్వనం పరిసమాప్తి కాబోతోంది.

తన కళ్లు ఒకప్పుడు మాట్లాడమేకాదు. నవ్వించేవి...కవ్వించేవి. ఎదుటివారిని మరీ మరీ చూడాలనిపించేలా చేసేవి.

'రతీ! నీ చూపులో అయస్కాంతం ఉంది సుమా' కృష్ణమూర్తి తరుచూ అనేవాడు

'మీరు కళ్ళతో కట్టివేయగలరు...' నవ్వుతూ వేణు అనేవాడు. మళ్ళీ ఇన్నాళ్ల తరువాత... ఇన్నేళ్ళ తరువాత.. ప్రభా... అప్రయత్నంగా హారతి పెదవులు మీద ఓ చిరు మందహాసం మెరిసి మాయమయ్యింది.

"అమ్మా! బియ్యం కడిగి స్టౌమీద పెట్టమన్నారా?" పనిమనిషి రంగమ్మ పిలుపుతో ఈ లోకంలోకి వచ్చింది హారతి.

"వద్దు రంగమ్మా! ఆకలి వేస్తే నేను పెట్టుకుంటాలే"

రంగమ్మ ఆశ్చర్యపోలేదు. తరుచుగా వచ్చే జవాబుకు అలవాటు పడేఉంది.

'ఏం చదువులో, ఏం ఉద్యోగాలో! ఏ ఈడులో ఉండవలసిన అచ్చటా ముచ్చటా ఆ ఈడులో లేకపోతే అంతే మరి' మనస్సులోనే గొణుక్కుంటూ నిష్క్రమించింది రంగమ్మ.

హారతి తిరిగి తన ప్రపంచంలోకి వెళ్ళిపోయింది.

'ప్రభాకర్ ఏమన్నాడూ?'

'మీ కళ్లు మాట్లాడతాయి మేడమ్'

తను వెడతానన్న మాట వింటూనే అతని కళ్ళల్లో ఎంత దిగులు... ఎంత బెంగ!

తనను వెళ్ళవద్దనీ, వెళ్ళినా తిరిగి వెంటనే వచ్చేయమనీ, 'మిమ్మల్ని చూడ కుండా ఉండలేను మేడమ్' అనీ చెప్పాలని కాబోలు ఎంత గింజుకున్నాడు?

తను వెడితే అతనికెందుకింత దిగులు?

హారతి మనస్సు వణికింది. 'ఈ స్నేహానికి ఇంతటితో ఫుల్‌స్టాప్ పెట్టటం చాలా మంచిది' అనుకుంది.

దానికి కారణం అతను ఒక్కరోజు రాక పోతే తానుకూడా అతనికోసం అలాగే ఎదురుచూస్తాను అనే విషయం గుర్తుకు రావడమే.

కొన్నాళ్ళు దూరంగా ఉంటే నే మంచిది. అందుకే ఓ నెల సెలవుపెట్టి వెళ్ళిపోవాలనే నిర్ణయాన్ని బలపరిచింది హారతి మనస్సు.



"ఆంటీ! నీకు ఉత్తరం వచ్చింది" గిరి కొడుకు అనిల్ వచ్చి చెప్పడంతో పూరీలు వత్తుతున్న హారతి ఆశ్చర్యంగా తల ఎత్తింది. తనకు పర్సనల్ లెటరా? తనకంతటి అదృష్టం కూడానా? ఎప్పుడో కొంతకాలం క్రితం వరకు మూర్తి రాసే వాడు. ఇప్పుడదీలేదు. మరి ఈ ఉత్తరం ఎవరు రాసినట్లు?

హారతి ఆ కవరు చేత్తోపట్టుకుని అటూ ఇటూ తిప్పి చూస్తూ ఆలోచనలో పడి పోయింది.

ఎవరు రాసిఉంటారు? కొంపదీసి ప్రభా కాదుకదా! ఎదురుగా కూర్చుని పూరీలు కాలుస్తున్న వసంత ఆడబిడ్డ ముఖంలో కనిపిస్తున్న ఆలోచనలను పసికట్టినట్లుగా కుతూహలంగా చూస్తోంది.

హారతి ఉత్తరం విప్పింది.

పాల నురగవంటి తెల్లటి పేపరుమీద మంచి ముత్యాల్లాంటి అక్షరాలు!

'మేడంగారూ.. నమస్తే! నేనెవరో గుర్తుకు వచ్చానాండీ... ప్రభాకర్‌ను. మేడం! మమ్మల్ని పూర్తిగా మరచిపోయారు. మీరు ఇక్కణ్నించివెళ్ళి ఎంతకాలమైందో తెలుసా? ఈ ఉత్తరం మీకు అంది మీరు చదువుకునేప్పటికి సరిగ్గా పధ్నాలుగు రోజుల ఒకపూట గడిచిపోయిందన్న మాట. కానీ నాకైతే మాత్రం పదిహేను సంవత్సరాలులా ఉంది. మిమ్మల్ని చూడ కుండా, మీతో మాట్లాడకుండా ఉండలే నని తెలుసుకున్నాకనే మీకీ ఉత్తరం రాస్తున్నాను. మేడం..కోపం వస్తోందాండీ! ఏంచెయ్యనూ? నిజం రాయకుండా ఉండ లేకపోతున్నాను. ఈ ఉత్తరం చూసిన వెంటనే మీరు తప్పకుండా వచ్చేయండీ. మీరు రాకపోతే నేనే వచ్చేస్తాను. తప్ప కుండా వస్తారుకదూ.

మేడం కళ్లుమూసుకున్నా, కళ్ళు తెరి చినా మీరే కనిపిస్తున్నారు. వెంటనే వచ్చే స్తారుకదూ.

మీ దర్శనభాగ్యం కోసం చకోర పక్షిలా ఎదురుచూసే-

మీ ప్రభా'

ఉత్తరం చదువుతూనే రంగులు మారుతున్న ఆడబిడ్డ మొహం చూస్తూ—

"ఎవరు రాశారు పిన్నీ" అంది వసంత.

"ఆఁ ... ఇదీ..ఇది మా బ్రాంచ్ మేనేజర్‌గారు రాశారు"

తడబడుతూ అబద్ధం చెప్పింది హారతి.

వసంత ముఖంలో 'ఏం రాశారూ?' అన్న ప్రశ్న చదువుతున్న హారతి "అర్జంటు కాగితాలు సంతకాల కొరకు ఉన్నాయట! త్వరగా రమ్మని రాశారు"

అబద్ధాలుచెప్పే అలవాటులేని హారతి ప్రాణాలన్నీ బిగపట్టుకుని ఒకటి తరువాత ఒకటిగా అబద్ధాలు చెప్పేస్తోంది.



అన్ని అబద్ధాలు చెప్పాల్సిన పరిస్థితి కల్పిస్తున్న ప్రభాకర్ మీద ఆమెకు చాలా కోపంగా ఉంది.

ఏమిటీ పిల్లాడు? తనంటే ఎందుకీ ఆరాధన? ఈ ఉత్తరం ఎవరికంటనైనా పడితే ఎంత అసహ్యంగా ఉంటుంది.

'అలాగా', అన్నట్లు చూసింది వసంత.

హారతి ప్రయాణమయ్యేందుకే నిర్ణయించుకుంది.

"మీ అక్కయ్య రేపు ఉదయం వెడతారట" ఆ రాత్రి గిరితో చెప్పింది వసంత.

"అదేం! సెలవు పెట్టానందిగా?" గిరి ఆశ్చర్యంగా అడిగాడు.

"ఈవేళ ఆవిడగారికి ఏదో ఉత్తరం వచ్చింది. ఎక్కణ్నించి పిన్ని అంటే మేనేజర్‌గారు రాశారు అంటూ చెప్పింది"

గిరి మౌనం వహించాడు.

"ఏమైనా పెళ్ళిచేసుకుంటే ఇంత స్వేచ్ఛ ఉండదుగా?" వ్యంగ్యంగా ఆడబిడ్డపైన తన అభిప్రాయానికి ముగింపు నిస్తూ ఆ టాపిక్ పూర్తిచేసింది వసంత.

పక్కగదిలోకి ఆ మాటలు వినకూడదనుకున్నా స్పష్టంగానే వినిపిస్తున్నాయి. హారతికి చిన్నతనంలో ఎప్పుడో చదువుకున్న తెలుగు పద్యం గుర్తుకువచ్చింది.

'చులకన జలరుహ తంతువు; దూది చుల్కన'. ఇల ఎగయు ధూళి చుల్కన; చుల్కన మరి తల్లిలేని సుతుడు కుమారా! అన్నాడు కానీ 'చులకన మరి పెళ్ళికాని పడతి కుమారా!' అని కూడా చేర్చాలి అనుకుంది గాఢంగా నిట్టూరుస్తూ.

హారతికి వారంరోజుల క్రితం జరిగిన ఒక చిన్న సంఘటన గుర్తుకువచ్చింది.

హారతి వచ్చిన రెండో రోజున వసంతతో కాలక్షేపానికి పొరుగింటి ఇల్లాలు వచ్చింది ఓ మధ్యాహ్నంవేళ.

"వసంతా నిన్న! మీ ఇంటికి ఎవరో చుట్టాలు వచ్చినట్లున్నారే"

"ఆ(...మా ఆడపడుచు వచ్చారు"

"ఏరీ... ఎక్కడా కనిపించరేం? ఎక్కడికయినా వెళ్ళారా? చూద్దామనే వచ్చాను"

"గదిలో పడుకున్నారు"

"ఏ ఊరిచ్చారూ...?"

వసంత ఆమె ప్రశ్న వినిపించుకోకుండా పక్కనే ఉన్న చంటాడిని ఒక్క కసురు కసిరింది.

"వెధవ! అంటిపెట్టుకుని తిరక్కపోతే కాస్త దూరంగా వెళ్ళి ఆడుకో కూడదూ..."

వచ్చినావిడ తన మొదటి ప్రశ్న మరిచిపోయి రెండో ప్రశ్న వేసింది.

"అన్నట్లు మీ ఆడపడుచుకు పిల్లలెందరూ...?"

ఈ సారి జవాబు చెప్పడం వసంతకు తప్పనిసరి అయింది.

"ఆవిడకింకా పెళ్ళికాలేదు..."

"ఏమిటీ! మీ ఆడపడుచుకింకా పెళ్ళి కాలా...? మీవారికంటే పెద్దదని చెప్పినట్లున్నావు?"

"ఆ(... పెద్దవారే! కానీ ఆవిడ పెళ్ళి చేసుకోలేదు"

"అదే...?"

"అదేమో మనకెలా తెలుస్తుంది?"

"నిజమేలే... ఏ వ్యవహారాలూ లేకపోతే పెళ్ళెందుకు చేసుకోరూ" ఆ తరువాత వాళ్ళ చర్చ అవివాహితలుగా ఉండి ఉద్యోగాలు చేస్తున్న స్త్రీలూ, వాళ్ళ చరిత్రల మీద సాగిపోయింది.

రెండుగంటల తరువాత ఆవిడలేస్తూ

"ఇక వెడతాను వసంతా, మీ ఆడపడచును చూద్దామనుకున్నాను ఏదీ ఆవిడ ఇంకా లేవనట్టుందిగా" అంటూ బయటికి దారి తీసింది.

గదిలో గట్టిగా కళ్లుమూసుకుని నిద్ర పట్టించుకునేందుకు ప్రయత్నిస్తోన్న హారతి "అమ్మయ్య" అంటూ ఊపిరి తీసుకుంది తేలికగా.

*　　*　　*

బస్సు దిగుతూనే హారతి చుట్టూ కలియజూసింది.

ఎదురుగా ప్రభాకర్!

అతని పెదవుల మీద అందమైన చిరునవ్వూ... కళ్లల్లోని కాంతీ.. అతను ఎంత సంతోషంగా ఉందీ చెప్పకనే చెబుతున్నాయి.

అతని పెదవులపై పలకరింపు... కళ్ళల్లో ఆరాధన... చివ్వున ముఖం తిప్పుకుంది హారతి.

ప్రభాకర్ దగ్గరగా వచ్చి చిరునవ్వుతో "గుడ్ మార్నింగ్" అన్నాడు.

హా ర తి మాట్లాడకుండా బాగ్ తీసుకుని రెండడుగులు వేసింది. ప్రభాకర్ చనువుగా ఆమె చేతిలోని బ్యాగ్ అందు కుంటూ ఆమెపక్కనే నడుస్తూఅన్నాడు- "మేడం! మీకు బాగా కోపం వచ్చింది కదూ..."

హారతి మాట్లాడలేదు.

"నేను ఇన్ని రోజులుగా మీకోసం ఎదురు చూస్తుంటే మీరు వచ్చి కూడా నాతో మాట్లాడటం లేదు"

కొంచెం నిష్ఠూరంగా అన్నాడు ప్రభాకర్.

"ఇవ్వాళ్ళ నేనొస్తున్నానని నీ కెలా తెలుసు?"

ప్రభాకర్గా చిన్నగా నవ్వాడు.

"మీకు ఉత్తరం అందినప్పటినుండీ ఏ బస్సులోనైనా మీరు రావొచ్చునని ప్రతి బస్సూ చూసి వెడుతున్నాను..."

హారతి నడుస్తున్నదల్లా చటుక్కున ఆగి అతని వంక విచిత్రంగా చూసింది.

అతని కళ్లు నిండుగా ఆమెను చూసి నప్పటి ఆనందంతో తళతళ లాడు తున్నాయి.

అంత బరువు బ్యాగూ తేలికగా పట్టు కుని చురుగ్గా అడుగులు వేస్తూ నవ్వుతూ కబుర్లు చెబుతున్నాడు.

"నేనసలు రాకూడదనే అను కున్నాను"

"మీరు వస్తారని నాకు తెలుసు..."

హారతి చివ్వున తలెత్తింది. ఇతడు తనను హేళన చేస్తున్నాడా?

"నేను మిమ్మల్ని చూడకుండా ఉంత లేనని మీకు తెలుసు. అందుకే నామీద జాలిపడి వస్తారనుకున్నాను.. వచ్చారు" నవ్వుతూ అన్నాడు ప్రభాకర్.

'ఏమిటీ పిచ్చి......? ఇతని ఈ అమాయకమైన ఆరాధనకు అంతం ఎక్కడ? దీని పర్యవసానం ఏమిటి?'

"ఏమిటీ ఆలోచిస్తున్నారు? మీ వాళ్ళను చూసి మమ్మల్ని మరచిపోయారు కదూ! నిజం చెప్పండి. మీకు నేనసలు గుర్తుకు వచ్చానా?" ఆసక్తిగా ఆమెవంక చూస్తూ అడిగాడు ప్రభాకర్.

అతను తనకు పదేపదే గుర్తువచ్చిన మాట నిజమే. కానీ అలాచెప్పడం ఇష్టంలేని హారతి, "అబ్బే! మావాళ్ళ సందడిలో నాకసలు ఈ ఊరు, ఈ మనుష్యులు, ఈ ఉద్యోగం..అసలు ఏవీగుర్తురాలేదు" అంది చిన్నగా నవ్వుతూ.

చిన్న బుచ్చుకున్నట్లుగా అతని

పెదవులు ముడుచుకున్నాయి.

* * *

తలంటుకుని వరండాలో అటూ ఇటూ తిరుగుతూ జుట్టు చిక్కులు తీసుకుంటున్న హారతి గేటు తీసుకుని ప్రభాకర్, అతని వెకననే ఓ పదహారేళ్ళ అమ్మాయి రావడం చూసి ఆశ్చర్యపోయింది.

"గుడ్ మార్నింగ్ మేడం"

"రండి...రండి" అంది ఆ అమ్మాయి పంకచూస్తూ.

"లల్లీ! నేను చెప్పానే హారతిగారనీ..."

అతని నోట్లోంచి తన పేరు గమ్మత్తుగా వినిపించింది హారతికి. ప్రభాకర్ ఆమెను ఎప్పుడూ పేరు పెట్టి పిలువలేదు.

"మా సిస్టర్ లలిత మేడం"

లలిత నమస్కరించింది.



ఆ అమ్మాయి హారతినీ, ఆ ఇంటినీ సిగ్గుసిగ్గుగా పరిశీలిస్తోంది.

"ఏమిటి విశేషం? లలితకు మా ఇల్లు చూడాలనిపించిదా..." నవ్వుతూ అంది హారతి.

లలిత సిగ్గుపడుతూ తలవంచుకుంది.

"చెప్పవేం మొద్దూ...?"

"ఏమిటి ప్రభా...? నువ్వు చెప్ప కూడదూ...?"

"వస్తానూ వస్తానూ అంటూ వెంటబడి వచ్చిందిగా. మరి వచ్చింది చెప్పడానికేం?"

"పొరపాటు చేసిందిలే. క్షమించి ఇక చెప్పు" నవ్వింది హారతి.

ప్రభాకర్ చూపులు తిప్పుకోలేనట్లుగా చూస్తుండిపోయాడు నవ్వుతూన్న హారతి వంక.

"రేపు లల్లీ పుట్టినరోజు. మిమ్మల్ని పిలవాలని వచ్చింది"

నవ్వుతూ కాఫీ అందించి "ఫంక్షన్ ఎన్ని గంటలకూ?" అనడిగింది హారతి.

"ఫంక్షన్ అంటూ అట్టహాసం ఏమీ ఉండదు మేడమ్! మీ కి ష్ట మై న ప్పు డు రావచ్చు. ఇక్కడికి చాలా దగ్గరే ఇల్లు. మీరు రెడీగా ఉంటే నేను వచ్చి తీసుకెడ తాను..."

"వద్దులే..అడ్రసివ్వు నేనే వస్తాను" హారతి ప్రభాకర్‌కు పెన్నూ. కాగితం అందించి అడ్రసు రాయించుకుంది.

"తప్పకుండా వస్తారుగా?" హారతికి స్వతహాగా ఎక్కడికీ వెళ్ళే అలవాటు లేదని తెలిసిన ప్రభాకర్ సంశయంగా అడిగాడు.

"తప్పకుండా వస్తాను. సరేనా?" నవ్వుతూ అంది హారతి.

"ప్రామిస్?" అరచెయ్యి చాపాడు ప్రభాకర్.

అతనిచేతిలో చెయ్యి ఉంచి "ప్రామిస్" అంది వాగ్దానం చేస్తున్నట్టుగా.

ప్రభాకర్ ఆమె చేతిని సున్నితంగా నొక్కాడు.

అతని చేతిలోని ఆమె చెయ్యి సన్నగా వణికింది.

మరింత సేపు కూర్చుని ప్రభాకర్, లలితా వెడతామని లేచారు. హారతి గేటు వరకూ సాగనంపింది. గేటు తీసుకొని బయటికి వెడుతూ వెనక్కు తిరిగి హారతి కళ్ళల్లోకి చూశాడు ప్రభాకర్.

'తప్పకుండా వస్తారు కదూ! మీకోసం ఎదురు చూస్తుంటాను...'

అదీ ఆ చూపులో సందేశం.

మరునాడు ఆఫీసు నుండి ఇంటికి వస్తూనే హారతి గబగబా తయారయి, ప్రజెంటేషన్ కొరకు తెప్పించిన పాకెట్ అందుకుని అడ్రసు చూసుకుంటూ బయలుదేరింది.

ఇల్లు చాలా దగ్గరే! బయట ఎవరూ కనిపించకపోవడంతో మొహమాటంగా బయటే నించుండిపోయింది. ఏదో పని మీద అప్పుడే బయటికి వచ్చిన లలిత గు మ్మం లో ఉన్న హారతిని చూస్తూ "రండి...రండి..." అంది సంతోషంగా.

ఆ తరువాత "అమ్మా! హారతీ మేడం వచ్చారే..." అంటూ ఇంట్లోకి ఓ కేక పెట్టింది.

లలిత తల్లి భవానీ నవ్వుతూ బయటికి వచ్చింది.

"కూర్చోండి. మావాడు మీగురించి అస్తమానమూ చెబుతూ ఉంటే నాకు చూడాలనిపించి నిన్న అ మ్మా యి ని పంపాను"

మొహమాటంగా నవ్వింది హారతి.

"'అమ్మా! హారతీమేడమ్ అంతమంచి

వాడు, ఇంత మంచి వాడు' అంటూ ఎప్పుడూ మీగురించే మాట్లాడుతుంటాడు"

'అహఁ అలాగా...' అన్నట్లుగా తల ఊపింది హారతి.

"మా పెద్దమ్మాయి భారతి భర్త పిల్లలతో పూనాలో ఉంటుంది. అక్కయ్యంటే వాడికి వల్లమాలిన అభిమానం. మా భారతీ నీలాగే చెయ్యెత్తు మనిషి..."

హారతి చేతిలో పాకెట్ లలితకిచ్చింది.

"ఎందుకమ్మా ఇవన్నీ...పుట్టిరోజులంటూ పెద్దగా ఆర్భాటం, హడావిడి చెయ్యం. ఏదో నిన్ను చూడాలనిపించి పిలిపించాం. అంతే"

పెద్ద పెద్ద అంగలు వేస్తూ బయటి నుండి వచ్చిన ప్రభాకర్ ముఖం ఇంట్లో హారతిని చూస్తూనే వెలిగిపోయింది. "గుడీవినింగ్" అన్నాడు సంతోషంతో.

ఆమె రాక అతనికెంత సంతోషాన్ని కలిగించిందీ స్పష్టంగా తెలిసిపోతోంది. అతను ప్రదర్శిస్తున్న ఆనందం చూసి హారతి ఇబ్బందిగా ఫీలయింది.

"'మా మేడం...మా మేడం అన్నావుగా అదుగో వచ్చేశార్రా మీ మేడం" నవ్వుతూ అంది తల్లి.

''అలా చూస్తూ నించోకపోతే టిఫిన్ పట్రాకూడదూ'' హడావిడిగా చెల్లెలికి పురమాయించాడు ప్రభాకర్.

''అమ్మాయ్...మీ ఆఫీసులో ఏమైనా ఖాళీలున్నాయా? ఉంటే కాస్త వీడికో దారి చూపించుదూ..."

తల్లి మాటలు రుచించని ప్రభాకర్ చేదు తిన్నట్లుగా ముఖం పెట్టి, "అమ్మా! కూర మాడువాసన వస్తోంది..." అన్నాడు తమాషాగా

"హారతీ! నువ్వు చెప్పు. ఎవరినీ అడగొద్దంటాడు. ఎవరినీ అడగకుండా ఉద్యోగాలు ఎలా వస్తాయి?" చిటపటలాడుతూ ఆమె లోపలికి వెళ్ళిపోయింది.

ఆవిడ హారతిని కాసేపు ''నువ్వూ" అనీ, కాసేపు ''మీరూ" అంటూ ''అమ్మాయ్" అనీ, "హారతీ" అనీ ఇలా రకరకాలుగా సంబోధిస్తూ గలగలా మాట్లాడేస్తుంటే ప్రభాకర్‌కు ఇబ్బందిగా ఉంది.

తల్లి లోపలికి వెడుతూనే రిలీఫ్‌గా ఫీలయ్యాడు.

''మీ కోసం ఉదయం నుండీ ఎదురు చూస్తున్నాను" అన్నాడు- 'ఇప్పుడా వచ్చేదీ' అన్న నిష్ఠూరం వచ్చేలా.

హారతి నవ్వింది.

"ఉదయం నేను ఆఫీసుకు వెళ్ళాలి"

"ఓ...అవును కదూ! నాకు ఆఫీసు విషయమే గుర్తు రాలేదు. ఎంతయినా నిరుద్యోగులం కదూ"

హారతి ప్రభాకర్ నవ్వుతో శృతి కలిపింది.

లలిత ఫలహారం తేవడంతో ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ ఫలహారం చేయసాగారు.

"ఇవ్వాళ మీరెంత బాగున్నారో తెలుసా...!!"

చటుక్కున తల ఎత్తి చూసింది హారతి.

అతని కళ్ళు ఎప్పటిలా నిర్మలంగా అభిమానాన్ని వర్షిస్తున్నాయి. తరువాత ప్రభాకర్ పెరట్లోకి వెళ్ళి వెదకి వెదకి ఓ అందమైన తెల్ల గులాబీని తీసుకొచ్చాడు.

లలిత, భవాని వంటగదిలో ఏదో పనిలో ఉన్నారు.

ప్రభాకర్ ఒకసారి గులాబీ సున్నితంగా పెదవులకు తాకించుకుని గులాబి

ఉన్న చేతిని ముందుకు సాచాడు.

హారతి అందుకునేందుకు చెయ్యి సాచింది.

"ఊహూఁ..." అన్నాడు ప్రభాకర్. ఇవ్వను అన్నట్లు కొంటెగా నవ్వుతూ.

'ఏం' అన్నట్లుగా తల ఎగరవేసింది హారతి చిరునవ్వుతో. ప్రభాకర్ చటుక్కున హారతి వెనగ్గా వెళ్ళి ముడిలో గులాబీని అమర్చాడు. ఈ హఠాత్సంఘటన నుండి ఆమె తేరుకోకుండానే, "ఈ తెల్ల చీరలో మీరెంత అందంగా ఉన్నారో తెలుసా ? ఈ గులాబీలా" అంటూ ఆమె మెడ ఒంపులో ముద్దుపెట్టుకున్నాడు. ఆ తరువాత ఆమె చేయి అందుకుని మృదువుగా పెదవులకు ఆనించుకుని తన్మయంగా ముద్దు పెట్టుకుని వదిలేశాడు. ఆ వెంటనే పెద్ద పెద్ద అంగలతో బయటికి వెళ్ళిపోయాడు.

నివ్వెరపోయినట్లుగా గుడ్లప్పగించుకుని చూస్తూండిపోయింది హారతి.

అతన్ని విదిలించడంగానీ, వారించడంగానీ, కనీసం తన అయిష్టతను చూపడానికైనా అశక్తురాలైనట్లు అచేతనంగా నించుండిపోయింది.

తర్వాత ఆమెను ఇంటివరకూ సాగనంపుతూ ముభావంగా, గంభీరంగా ఉన్న హారతిని చూస్తూ కొంచెంగా జంకాడు ప్రభాకర్.

"మీకు బాగా కోపం వచ్చింది...నేనేం చేశాను" అన్నాడు ముఖం చిన్నబుచ్చుకుంటూ భయంగా.

హారతి మౌనంగా ఉండిపోయింది.

హారతి మౌనం అతన్ని మరింత భయపెట్టింది.

"ఐయామ్... సారీ... మీకింత కోపం వస్తుందనుకోలేదు."

ఆమె మౌనాన్ని ఎలా వదిలించాలో అతనికి అర్థం కాలేదు. ఇంటిదగ్గరకు రాగానే తనను లోపలికి రమ్మంటుందనుకున్న ప్రభాకర్ ఆమె 'గుడ్‌నైట్' చెప్పి లోపలికి వెళ్లి తలుపు వేసుకోవడంతో ముఖానే తలుపులు వేసుకున్నట్లుగా ఫీల్ అయ్యాడు...

'మేడంకు బాగా కోపంవచ్చింది...' అనుకున్నాడు దిగులుగా.

పడకమీద పడుకున్న హారతికి అయోమయంగా ఉంది. మెదడు మొద్దుబారినట్లు, జరిగింది ఏమీ అర్థంకానట్లూ గింజుకుంది. కానీ...స్వప్నావస్థలో అలా జరిగిందంతా కళ్ళకు కట్టినట్లు కనిపిస్తూనే ఉంది.

తన ఎదుట భయం భయంగా, సిగ్గు సిగ్గుగా మాట్లాడే ప్రభాకర్ ఇంత ధైర్యం చేశాడనే విషయం తలుచుకొన్నకొద్దీ ఆశ్చర్యంగా ఉంది. ఆలోచిస్తున్న హారతికి ప్రభాకర్ విషయంకంటే కూడా తన విషయంలో తనకే ఆశ్చర్యంగా వుంది. అతను తనముడిలో గులాబీని అమరుస్తున్నప్పుడూ... తనమెడ ఒంపులో వెచ్చగా అతని ఊపిరి, పెదవులూ తాకినప్పుడూ, తన అరచేతిని సున్నితంగా నొక్కుతూ తమకంగా ముద్దు పెట్టుకుంటున్నప్పుడూ తానెందుకు అతన్ని వారించలేకపోయింది.

తన ముఖంలో అయిష్టత కూడా లేదు. కేవలం తనముఖంలో, మనస్సులో అయోమయం, నిశ్చేష్టత తప్ప మరో భావం లేదు. తమ స్నేహంలో స్వాభావికతలేదనే విషయం తనకు తెలుసు. మరి అలాంటి స్నేహాన్ని తానెందుకు ప్రోత్సహిస్తున్నట్లు? ప్రభాకర్‌తో తను శారీరక సౌఖ్యం కోరుకుంటోందా? లేదు... లేదు. తన మనస్సు ప్రభాకర్‌ను వాంఛించడం లేదు. మరి... ఈ అస్వాభావికమైన

స్నేహాన్ని ఎందుకు ప్రోత్సహిస్తున్నట్లు. అతని ఆరాధనతో తను మానసికంగా తృప్తి పడుతోంది. తనపట్ల అతనికి ఆరాధన, ఆసక్తి ఉన్నాయనే విషయం తనకు స్పష్టంగా తెలుసు. అతని ఆరాధనను తాను నిరసించలేదు. వ్యతిరేకించలేదు. తృణీకరించలేదు. తనంతగా తను అతనిని ప్రోత్సహించకపోయినా తన మనస్సు అతని ఆరాధనను సంతోషంగా స్వీకరించింది.

ఏ మానసిక ప్రలోభాలకులొంగి తానీ స్నేహాన్ని ప్రోత్సహిస్తున్నట్లు? ఛీ...ఛీ. తానెందుకిలా మానసికంగా పతనమవుతోంది? హారతికి ఒక్కసారిగా దుఃఖం ముంచుకొచ్చింది. హృదయంలోని కల్మషం అంతా కరిగి కరిగి కన్నీటిలో తుడుచుకుపోయేలా, హృదయ భారం తీరేలా శోకించింది.

హృదయభారం తీరింది... మనస్సు ప్రక్షాళనం అయ్యింది. ప్రశాంతమైన హృదయంతో ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది.

తేలికపడిన మనస్సుతో మంచంమీద వాలి, నిర్మలమైన మనస్సుతో నిద్రాదేవిని ఆహ్వానించింది.

* * *

"గుడీవినింగ్"

ఉత్సాహంగా విష్ చేస్తూ గదిలోకి అడుగుపెట్టిన ప్రభాకర్ ముభావంగా ఉన్న హారతిని చూస్తూనే జంకాడు.

ఆమెకోపం ఎలా పోగొట్టాలో అతనికి అర్థంకాలేదు. ఆమెకోపం పోగొట్టేందుకు ఎన్ని వందలసార్లు క్షమాపణలు చెప్పడానికైనా తాను సిద్ధమే! అంతే కానీ... ఆమె అలా ముభావంగా, గంభీరంగా ఉంటే తాను భరించలేడు. ఆమెతో మాట్లాడకుండా తాను జీవించలేడు.

అతని ఆలోచన పూర్తికాకుండానే ఆమె అతని చేతిలో కాగితంపెట్టి గిరుక్కున తిరిగి గదిలోకివెళ్లి తలుపు వేసుకుంది- మరోమాటకు అవకాశం ఇవ్వకుండా. మూసిన తలుపులవైపూ, కాగితం వైపూ అయోమయంగా మార్చి మార్చి చూస్తూ కాగితం విప్పాడు.

"ప్రపంచానికే కాదు చివరికి మన మనస్సులలో మనకే అస్వాభావికంగా, అయోమయంగా తోస్తున్న మన ఈ స్నేహం మంచికంటే చెడే ఎక్కువగా కలిగిస్తుంది. మన ఈ స్నేహానికి ఇంతటితో 'ఫుల్‌స్టాఫ్' పెట్టడం మంచిది. ఇంకెప్పుడూ ఈ ఇంటికి రావద్దు. నాతో మాట్లాడ్డానికి ప్రయత్నించవద్దు..."

ప్రభాకర్ నిశ్చేష్టుడైనట్లు ఉండిపోయాడు కొన్నిక్షణాలు. క్రమేపీ ఉత్తరంలోని సారాంశం అర్థం అవుతోన్న కొద్దీ ఆవేశంతో అతని పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

మూసివున్న తలుపుల వంక వెర్రిగా చూశాడు. వెంటనే రెండంగల్లో తలుపు దగ్గరకు చేరుకున్నాడు.

చేతుల్తో తలుపుతు బాదుతూ "మేడం తలుపులు తియ్యండి! నేనేం చేశానని నాకింత శిక్ష? మేడం... నిజం చెబుతున్నాను...మిమ్మల్ని చూడకుండా, మీతో మాట్లాడకుండా ఉండలేను. మేడం! తలుపు తియ్యండి. నేను చేసింది తప్పేఅయితే... మీరు ఎన్నిసార్లు 'ఇలా దువ్వకుంటే బాగుండలేదు ప్రభా...' అంటూ నా క్రాప్ చెరపలేదూ. నా చెయ్యి ఎన్నిసార్లు పట్టుకోలేదూ. అది తప్పుకాదా? మేడం... తలుపులు తియ్యండి... మేడం ఒకవేళ నేను చేసిందే తప్పనుకుంటే మీకు వంద



సార్లు కాదు వెయ్యిసార్లు క్షమాపణ చెప్పు కుంటాను. మేడం తలుపు తియ్యండి" ప్రభాకర్ తలుపులు బాదుతూ పిచ్చిపట్టినట్లు అరుస్తున్నాడు.

ఒకరకమైన ఉన్మాదంతో, ఉద్రేకంతో ఊగిపోతున్నాడు.

తలుపులు తెరుచుకున్నాయి. ఎదురుగా హారతి ! నిప్పులు కక్కుతున్న కళ్ళతో హారతి...

ఆవేశంతో నిలువెల్లా ఒణికిపోతున్న హారతి...

కోపంతో, ఉద్రేకంతో ఊగిపోతున్న హారతి...!

హారతి రెండడుగులు ముందుకు

వేసింది... అంతే! ప్రభాకర్ చెంపలు ఛెళ్ళుమన్నాయి. ఒకటి, రెండు, మూడు!

"ఐ డోంట్ వాంట్ దిస్ కైండ్ ఆఫ్ న్యూసెన్స్. గెట్ అవుట్ ఫ్రం హియర్" గుమ్మం వైపు వేలు చూపిస్తూ, కళ్ళల్లో నిప్పులు రాలుస్తూ గర్జించింది హారతి.

ప్రభాకర్ నోట మాట రానట్లూ, ఏం మాట్లాడేందుకూ ... ఏం చేసేందుకూ అశక్తుడైనట్లూ అలాగే వెర్రిగా చూస్తుండి పోయాడు కొన్ని క్షణాలు.

తేరుకున్న మరుక్షణం తలవంచుకుని నెమ్మదిగా అడుగులు వేస్తూ గుమ్మం దాటాడు.

అతని వెనకే తలుపులు భళ్ళున మూసుకున్నాయి.

* * *

"మేడం..."

పేపరు చదువుకుంటున్న హారతి చటుక్కున తలఎత్తి చూసింది. ఎదురుగా లలిత! హారతి ఆశ్చర్యంగా ఆమె వంక చూస్తూండిపోయింది. క్రమంగా ఆమెలో చిరాకు చోటుచేసుకుంది. ఈ మూడు రోజులుగా ఆమె ప్రభాకర్ జ్ఞాపకాలనూ, ఆ రాత్రి సంఘటననూ మరిచిపోయేందుకు శతవిధాలా ప్రయత్నిస్తోంది. ఇంతలో ఈ పిల్ల రాక ఆమెకు రవ్వంత విసుగు, కోపంతో పాటు ఆశ్చర్యాన్ని కూడా కలిగించింది.

"మేడమ్! అన్నయ్యకు జ్వరంగా ఉంది. మిమ్మల్ని కలవరిస్తున్నాడు. అమ్మ మిమ్మల్ని పిలుచుకురమ్మంది"

హారతి అప్రయత్నంగాలేచినుంచుంది.

"జ్వరమా? ఎప్పటి నుండీ?" అంది కంగారుగా.

"మూడు రోజులనుండీ... ఏమిటేమిటో కలవరిస్తున్నాడు. మధ్యమధ్య మీ పేరు అంటున్నాడు. అమ్మకు భయంవేసి మిమ్మల్ని తీసుకురమ్మంది" అంది దిగులుగా.

ఉన్నపళాన బయలుదేరింది హారతి. ఆమెకు దిగులుగా, కంగారుగా, భయంగా ఉంది.

చలాకీగా, ఉత్సాహంగా, చైతన్య స్రవంతిలా తిరిగే ప్రభాకర్ అచేతనంగా మంచంమీద పడిఉండటం చూసిన హారతి కడుపులో దేవినట్లయింది.

గడ్డం మాసిఉంది. అసలే బక్కపలుచగా కనిపించే ప్రభాకర్ ఈ మూడు రోజుల జ్వరంతో మరీ బలహీనంగా తయారయ్యాడు.జ్వరతీవ్రతతో ముఖం ఎర్రగా కందిపోయింది. ముభావంగా, గంభీరంగా ఉన్న ప్రభాకర్ తల్లి హారతిని అంత ఆత్మీయంగా పలకరించలేదు.

కాఫీ తెస్తానంటూ లోపలికి వెళ్ళిపోయింది.

హారతి ప్రభాకర్ మంచం పక్కనే కూర్చుంటూ "ప్రభా" అంది ముడుచుకున్న అతని చేతులమీద చెయ్యి వేస్తూ నెమ్మదిగా.

ప్రభాకర్ మెల్లిగా కళ్ళు విప్పాడు. ఆ కళ్ళల్లో జీవంలేదు... కాంతి లేదు. నిస్తేజంగా ఆమె వంక చూస్తుండి పోయాడు.

ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి.

"ప్రభా... ప్రభా" అంటూ పిలిచింది ఆర్తిగా.

ఆమె చేతులు అతని చేతుల్ని ఆత్మీయంగా స్పృశిస్తున్నాయి.

ఆమె చేతుల్లోనుండి అతని శరీరంలోకి జీవం ప్రవహించినట్లు క్రమంగా అతని శరీరంలో చైతన్యం కలగసాగింది.

అతని కళ్ళు క్రమేపీ కాంతిని నింపు

కున్నాయి. పెదవులు నెమ్మదిగా విడివడి అస్పష్టంగా ఏదో ఉచ్చరించాయి.... దాని భావం 'మేడం మీరు వచ్చారా?' అతని కంటి చివరల నుండి ఓ కన్నీటి బిందువు జారిపడింది.

ఆమెలో దుఃఖం కట్టలు తెంచుకుంది. తాను కొట్టిన చెంపలనూ, జుట్టునూ ఆప్యాయంగా స్పృశిస్తూ "ప్రభా..ప్రభా" అంది కలవరిస్తున్నట్లు.

ప్రభాకర్ ఆమె రెండు చేతులనూ గుప్పెటలో బిగించి గుండెలమీద పెట్టుకున్నాడు. ఆ చేతులు వదిలితే ఆమె తనకు దూరం అయిపోతుందేమోనన్నంత తపనగా, ఆర్తిగా బలహీనమైన చేతుల్తో బిగించి పట్టుకున్నాడు.

ఆ స్పర్శలో ఆర్తి ఉంది. ఆరాటం ఉంది. ఆత్మీయత ఉంది. 'మేడం: ఈ చేతులను వదిలి వేయకండి' అనే అభ్యర్థన ఉంది.

భవాని కాఫీతేవడంతో హారతి ప్రభాకర్ చేతినుండి తన చెయ్యి విడిపించుకుంది మెల్లగా.

భవాని కాఫీ ఇచ్చి తిరిగి వెళ్ళిపోయింది ముభావంగా.

"మేడమ్ !! ఇక్కడ కూర్చోండి" అన్నాడు ప్రభాకర్- తన పక్కన మంచంలో చోటు చూపిస్తూ.

హారతి లేచి అతనిపక్కనే కూర్చుంది. ఆమె చేతులు ఆప్యాయంగా అతని వీపు నిమురుతున్నాయి.

ప్రభాకర్ బలహీనంగా లేచి తన తలను ఆమె ఒడిలో చేర్చి, ఆమె చేతులు తన చేతుల్లోకి తీసుకుంటూ తదేకంగా ఆమె వంక చూశాడు.

'మేడం: నెట్టివేయరుగా...' అదీ ఆ చూపుకు భావం.

అర్థం చేసుకున్న హారతి కనుకొలకుల్లో కన్నీటి బిందువులు నిలిచాయి. ఆమె చేతులు ఆప్యాయంగా అతని జుట్టును సవరించాయి




"మేడం ఇక మీకు దూరంగా ఉండలేను. మనం కలిసి ఉండాల్సిందే" పార్కులో, పచ్చగడ్డిలో చతికిలపడుతూ అన్నాడు ప్రభాకర్.

హారతి సహచర్యంతో ప్రభాకర్‌లో అస్వస్థత దూరమయ్యింది. ఇప్పుడు మునుపటిలా చలాకీగా, హుషారుగా ఉంటున్నాడు.

ఒడంబడిక ఏదో కుదిరినట్లు మునుపటిలా ఇద్దరూ కలుసుకుంటున్నారు. అయితే వారిద్దరిమధ్యా ఇప్పుడు 'స్వీట్ నథింగ్స్' కాకుండా ముఖ్యమైన ఒకే ఒక చర్చ సాగుతోంది.

"ప్రభా, ఎన్నిసార్లు చెప్పినా నీ మాట నీదేకానీ నా మాట వినిపించుకోవు" అంది కోపంగా.

"చెప్పండి... వింటాను" బుద్ధిగా చేతులు కట్టుకుని బాసింపట్లు వేసుక్కూర్చున్నాడు ప్రభాకర్.

హారతికి నవ్వు వచ్చింది. కానీ ఆ నిరునవ్వు కనిపించకుండా పెదవుల మధ్య బిగించి "మనం కలిసి ఉండటం

ఎలా సాధ్యం?" అంది.

"ఎందుకుకాదూ! మనం పెళ్ళి చేసుకుందాం. అప్పుడిక అడ్డేముంటుంది" ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ అన్నాడు ప్రభాకర్.

"పెళ్ళి...పెళ్ళి! అదే ఎలాసాధ్యం అంటున్నాను"

"మంగళసూత్రం కడితే పెళ్ళవుతుంది. అందులో ఏముంది?"

"ప్రభా... నవ్వులాటకాదు. ఈ విషయం మనం సీరియస్‌గా ఆలోచించాలి"

"ఓకే మేడమ్! యమ సీరియస్‌గా ఆలోచిస్తాను. ఇంతకూ మీ డౌట్ ఏమిటి?"

"'పెళ్ళి ఎలా సాధ్యం?' అంటున్నాను"

"అదే నేనూ అడుగుతున్నాను.



ఎందుకు కాదూ అంట"

"పెళ్ళికి మీవాళ్ళు ఒప్పుకుంటారా?"

"వాళ్ళు ఒప్పుకున్నా లేకపోయినా ఈ పెళ్ళి జరుగుతుంది"

"కానీ... కానీ నాకు ఇష్టంలేదు"

"లాభంలేదు. ఇలాంటి మాటలతో మీరు నన్ను మోసంచెయ్యలేరు. మీకు ఇష్టంలేకపోయినా బలవంతంగా తీసుకెళ్ళి పెళ్ళి చేసుకుంటాను. ఆ తరువాత మీరే ఒప్పుకుంటారు"

"ప్రభా! నా వయస్సెంతో తెలుసా?"

"ఎంతయినా ఫరవాలేదు. మీరు నా కంటికి పాపాయిలానే కనిపిస్తారు"

"ప్రభా! నువ్వు నాకంటే బాగా చిన్న వాడివి. ఇలా ఎక్కడా జరగదు"

"ఎందుకు జరగదూ? గాంధీగారికంటే కస్తూరీబాయి పెద్దదని చెప్పుకుంటారు తెలుసా?"ఎదురుప్రశ్న వేశాడు ప్రభాకర్.

"ఎంత పెద్దది ? నా అంతకాదుగా? ఇద్దరూ ఒకే సంవత్సరంలో పుట్టారు"

"అంతయినా, కొంతయినా, ఎంతయినా పెద్ద పెద్దేకదా! కాదంటారా?"

అవాక్కయింది హారతి.

"ప్రభా, ఈ వ్యామోహం తగ్గిన తరువాత ఇలా జరిగినందుకు విచారించాల్సి వస్తుంది. బాగా ఆలోచించు"

"మేడమ్! భవిష్యత్తును నేను ఊహించలేను. కానీ అలాంటిరోజు రాదనే నేను నమ్ముతున్నాను. మీరు నన్ను భయపెట్టేందుకు ప్రయత్నించి లాభంలేదు. నేను నిర్ణయించుకున్నాను"

"ప్రభా! రేపు ఏ టీనేజ్‌గర్లో నీకు ఈడూ జోడూ సరిపోయే అమ్మాయి తటస్థపడితే..."

"పోవోయ్! నా దేవత ముందు నువ్వు గడ్డిపోచవు" అంటాను.

"ప్రభా! నువ్వోచక్కని అమ్మాయిని పెళ్లి చేసుకుంటే నన్ను మరిచిపోగలవు. ప్రయత్నించి చూడకూడదూ. నాకేమిటో ఇది...ఇది చాలా ఎబ్బెట్టుగా ఉంది" అంది చివరి అస్త్రంగా.

"మేడమ్! నేను మిమ్మల్ని మరచిపోవడం అసాధ్యమైన విషయం. నాకు పెళ్ళంటూ అయితే అది మీతోనే అవుతుంది. మీకు ఇష్టం లేకపోతే..."

"ఆ...ఇష్టంలేకపోతే?" మరో మార్గమేదయినా సూచిస్తాడేమోననే ఆశతో చూసింది హారతి.

"మిమ్మల్ని చూడకుండా, మాట్లాడకుండా నేను బతకలేను. పెళ్ళంటూ కాకుండా అది ఎప్పుడూ సాధ్యంకాదు. అందుకే ఈ పెళ్లి కాకుంటే నేను...నేను ఆత్మహత్య చేసుకుంటాను"

అదిరిపడింది హారతి.

* * *

"లోకంలో అమ్మాయిలే కరువైనట్లు ఇదేం ప్రారబ్ధంరా తండ్రీ..." అసహనంగా తలకొట్టుకుంది ప్రభా తల్లి భవాని.

తలవంచుకుని తల్లిఎదుట కూర్చున్న ప్రభాకర్ మౌనాన్ని ఆశ్రయించాడు.

"ఇన్నేళ్లు వచ్చి పిల్లలతల్లిలా ఉన్న ఆవిణ్ని చేసుకుంటే నీ స్నేహితులు నవ్వరా...? అవ్వ...ఎంత సిగ్గుచేటు"

ప్రభాకర్ వంచిన తల ఎత్తలేదు.

"ప్రభా! మామయ్య కూతురు సుజాను ఈమధ్య నువ్వు చూడలేదుకానీ, పిల్ల సినిమా స్టార్‌లా ఉంటుంది. నువ్వీ ప్రయత్నం మానుకుంటే మీనాన్న వెళ్ళి ముహూర్తం పెట్టించుకువస్తాడు. మీ ఇద్దరికీ అయితే ఈడూజోడూ చక్కగా ఉంటుంది. చిలకాగోరింకల్లా ఉంటారు.... ఏం నాన్నా, ఏమంటావు?"

మాటా పలుకూ లేకుండా వంచిన తల ఎత్తకుండా కూర్చున్నాడు ప్రభాకర్.

మారుమాట లేకుండా ముంగిలా కూర్చున్న కొడుకును చూస్తుంటే ఆమెకు కోపం ముంచుకువస్తోంది. ఒకవంక ఇలా జరుగుతోందేమిటి అనే దుఃఖం.

"నీకు అదేం మందు పెట్టిందిరా? మాటా మంచీలేకుండా ఇలా మూగిమొద్దు వయ్యావు ? ఏదో అక్క తమ్ముళ్ళలా ఉన్నారేమో వెళ్ళి వస్తున్నాడనుకున్నానే గాని ఇంత ఘోరానికి పూనుకుంటారనుకో లేదు. ముంగిలాఉండి ఎంత పనిచేసింది"

తల్లి హారతిని తిట్టడం బాధనిపించినా మాట్లాడలేదు. "ప్రభా ఇంతకంటే నేనేం చెప్పను? అమ్మను అనే అభిమానం ఉంటే ఈ తలంపుమానుకో! కాదూ నీ ఇష్టం" చెంగుతో కన్నీళ్లు అద్దుకుంటూ అంది భవాని.

"అమ్మా...నేను ఆమెను చూడకుండా, మాట్లాడకుండా బతకలేనమ్మా. నువ్వు చచ్చిపొమ్మన్నా నాకు ఇష్టమే కానీ బతికి ఉంటేమాత్రం ఆమె లేకుండా బతక లేనమ్మా" వెక్కివెక్కి ఏడుస్తూ కాళ్ళకు చుట్టేసుకున్న కొడుకువంక అయోమయ ముగా చూస్తుండిపోయింది భవాని.

• • •

ఆ రోజు హారతి మనస్సు చెప్పలేనంత ఉద్వేగంగా ఉంది. కళ్ళెత్తి ప్రభాకర్‌వంక చూసేందుకుకూడా సంకోచంగా, బిడి యంగా ఉంది సాధ్యమయినంత వరకూ అతని చూపులనుండి తప్పించుకుంటూ కాలక్షేపం చేసింది. అయితే ఆ ఉద్వే గంలో కన్నె హృదయానికి ఉండే ఉత్సాహం లేదు. సంతోషంలేదు.

ఆ బిడియంలో నవ వధువులకు తొలి రేయి ఉండే తొట్రుపాటు లేదు. సుసు సిగ్గుల దొంతరలు లేవు.

ఆ సంకోచం, ఆ బిడియం తొలి రాతిరి భర్త సమక్షంలో కలిగే సంకోచ బిడియాలు కావు.

అనుకోనిదీ, జరగకూడనిదీ జరిగి నప్పటి సంకోచం, న్యూనత, బిడియం... 'దీనికి పర్యవసానం ఏమిటి' అన్న ఆందోళన, 'ఈ చర్యకు ఫలితం తమ జీవితాలమీద ఎలా ఉంటుంది?' అన్న ఉద్వేగం.

పగలు గడిచిపోయింది.

ప్రభాకర్ భర్త హోదాలో ఆ ఇంట్లో మొదటిభోజనం చేశాడు. భోజనం పూర్తి అవుతూనే మామూలుగా వెళ్ళి బెడ్ రూంలో ఓ కుర్చీలో కూర్చుని పుస్తకం తిరగేస్తున్నాడు.

హారతికి ఎంతసేపటికీ ఆ గదిలోకి వెళ్ళాలంటే కలిగిన సంకోచంతో, అదీ ఇదీ చక్కబెడుతూ హాల్లోనే గడిపింది చాలా సేపు.

గోడ గడియారం పదిగంటలుమోగించి మరి అలసిపోయినట్లుగా టిక్కు...టిక్కు మంటూ మూలుగుతోంది.

మరి తప్పదన్నట్టుగా నెమ్మదిగా గది గుమ్మంవేపు అడుగులు వేసింది. లోపల ఎప్పుడూ తాను పడుకుని దొర్లే తన మంచమే తనకు కొత్తగా కనిపించింది. తెల్లటి ఇస్త్రీ దుప్పటి పరచి నీట్‌గా ఉంది. గదిలో టీపాయ్‌మీద గుట్టగా పెట్టిన మల్లె పూల మాల, అంతక్రితమే వెలిగించి పెట్టిన అగరువత్తుల పరిమళం రంగమ్మకు హారతిమీద ఉన్న ప్రేమనూ శ్రద్ధనూ చాటుతోంది.

గదిలోకి అడుగుపెట్టబోతూ సంకో చంగా ఆగిపోయింది.

గదిలో అటుతిరిగి కూర్చున్న ప్రభా

కర్ ఇంతకు క్రితం తానెరిగిన ప్రభాకర్‌లా కాక ఎవరో కొత్తవ్యక్తిలా కనిపిస్తున్నాడు.

'ఇలా జరగకుండా ఉంటే బాగుండేది' అనిపించింది ఓ క్షణం. గుమ్మం దగ్గర చప్పుడుకు వెనుదిరిగి చూశాడు ప్రభాకర్.

అతను చిరునవ్వుతో ఓక్షణం ఆమెవంక చూసి, చూపులు తిప్పుకుంటూ "రండి" అన్నాడు నింపాదిగా.

హారతి అతిమామూలుగా కనిపించేందుకు ప్రయత్నిస్తూ వెళ్ళి అతని పక్కనే ఉన్న మరో కుర్చీలో కూర్చుంది.

ఏం మాట్లాడాలో తెలీనట్టుగా ఇద్దరూ కొన్ని నిమిషాలు మౌనంగా ఉండిపోయారు పుస్తకాలు తిరిగేస్తూ.

"కాసేపు చెస్ ఆడుకుందామా...?" ఉన్నట్లుండి ప్రభాకర్ అడిగాడు. అతనికి ఆ నిశ్శబ్దం, ఆ మౌనం ఊపిరి ఆడనట్లుగా అనిపించింది.

"సరే.." నన్నట్లుగా తల ఊపి లేచి వెళ్ళి చెస్ బోర్డు తెచ్చి టేబుల్ మీద అమర్చింది.

రాజు, మంత్రి తమ తమ పరివారాలతో సహా తమ స్థానాలను అలంకరించారు యుద్ధానికి సిద్ధమై.

హారతి తన గుర్రాలను ఉరికించింది.

ప్రభాకర్ తన శకటాలతో విన్యాసం చేయిస్తున్నాడు.

ఇద్దరూ ఓపిగ్గా ఆడుతోన్నా ఇద్దరి మనస్సూ ఆటమీద లేదనే విషయం ఇద్దరికీ తెలిసిపోతూనే ఉంది.

హారతి రెండు గుర్రాలను శత్రువులు పడగొట్టారు.

ప్రభాకర్ శకటం కూలిపోయింది. ఏనుగు వెనకడుగులు వేసింది. పరధ్యాన్నంగా ఆడుతున్న హారతి తన బలగంతోనే తన మంత్రిని చంపుకోడం చూసి ప్రభాకర్, "అయ్య..." అంటూ ఆమె చేతికి చెయ్యి అడ్డుపెట్టాడు. కరెంట్‌షాక్ తిన్నట్లుగా అతని శరీరంలోని ప్రతినరమూ జలదరించింది. రక్తనాళాల్లో రక్తం వేగంగా.. అతివేగంగా ప్రవహించింది. ప్రప్రథమంగా యవ్వనం ఒళ్లు విరుచుకుని అనుభవం కోసం తహతహలాడింది. తమది అనుకున్న ఆ వంటరి రాత్రి ఆమె స్పర్శ అతనిలో అనూహ్యమైన సంచలనం కలిగించింది.

హారతి చేతిలో మంత్రి, ప్రభాకర్ గుప్పిటలో హారతి చెయ్యి.

జరిగిందేమిటో తెలుసుకునే సరికి హారతి చెయ్యి ప్రభాకర్ గుప్పిటలో మరింత బిగుసుకుపోయింది.

ఆమె నరాలు ఝల్లుమన్నాయి. గుండెలు వేగంగా స్పందించాయి. శరీరంలోని ప్రత్యణువూ చెప్పలేని పులకింతలతో పులకరించి పోయింది. బుగ్గల్లో సిగ్గు దొంతరలు గులాబి మొగ్గలు తొడిగాయి. మైకం ఆవరించిన కనురెప్పలు భారంగా వాలిపోయాయి. కాంక్షతో కూడిన పురుషుని ప్రథమ స్పర్శ అనుభవించిన ఆమె తనువులోని అణువణువూ కోరికతో చెలరేగిపోయింది.

ప్రభాకర్ పరిస్థితీ అలాగే ఉంది. అతని కళ్లు కోరికతో, తమకంతో వెలిగిపోతున్నాయి. ప్రభాకర్ ఆమెచేతిని అలాగే గుప్పిటిలో బంధించి నెమ్మదిగా లేచి వెళ్ళి ఆమె తలను గుండెలకు హత్తుకున్నాడు.

హారతి పారవశ్యంగా అతని గుండెల మీద వాలిపోయింది. ప్రభాకర్ వంగి ఆమె మెడవంపులో ముద్దుపెట్టుకున్నాడు.

హారతి తన రెండు చేతులా అతనిమెడను పెన వైచింది తమకంగా. అవధులు దాటిన ఆవేశంతోహారతి పెదవులూ,కనురెప్పలూ, కపోలాలూ, నుదురూ పదేపదే చుంబించాడు ప్రభాకర్. ఆమె శరీరంలోని ప్రతి అణువూ పులకించి లతలా అతన్ని అల్లుకుపోయింది. ఆమె నడుము చుట్టూ చెయ్యివేసి నెమ్మదిగా కుర్చీలో నుండి పడక దగ్గరకు నడిపించుకు వెళ్లాడు.

ఇద్దరిశ్వాసలూ ఒక్కటై వేగంగా శ్వాసించాయి.

ఇద్దరూ ఒకరిలోకి ఒకరు హత్తుకుపోయారు.

ఆ కౌగిలిలో శాంతి ఉంది... తపన ఉంది...తృప్తిఉంది..కోరికల వేగం ఉంది.

కోరికల మత్తులో సోలిపోతున్న హారతి తన వయస్సూ, తన హోదా, మిగిలిన సర్వ ప్రపంచాన్నీ మరిచిపోయి అతనిలో లీనం అయిపోయింది.

అలసిన శరీరాలు విశ్రాంతిని కోరాయి.

కోరిక తీరినప్పటి సంతృప్తి చిరుమందహాసంగా కనులను, మనస్సును, పెదవులను వెలిగిస్తుండగా తన్మయంగా ఒకరి చేతుల్లో ఒకరు విశ్రాంతి తీసుకుంటున్నారు.

"నేను చాలా అదృష్టవంతుణ్ని" తనలో తాను అనుకుంటున్నట్లుగా పైకే అన్నాడు ప్రభాకర్.

ప్రభాకర్ దండ చేతిని తలగడగా చేసుకుని పడుకున్న హారతి, కొంచెంగా తల పైకి ఎత్తి "ఎందుకూ... ?" అంది మెల్లగా, మత్తుగా.

ప్రభాకర్ అందించిన మధురానుభూతి నుండి ఇంకా ఆమె తేరుకోలేదు. మధురోహల మత్తుతో ఆమె కళ్లు అర్ధనిమీలితాలయ్యాయి. అర్ధనిమీలితాలయిన ఆ కనురెప్పలను, వంచిన విల్లులా ఉన్న ఆ కనుబొమల సౌందర్యాన్ని చూస్తూ, "ఇందుకూ" అంటూ చటుక్కున ఆమె కనురెప్పల మీద సున్నితంగా ముద్దుపెట్టుకున్నాడు.

తనువెల్లా మోహపుఅలలు కమ్ముకోగా హారతి నిలువెల్లా చలించింది.

"నావికాకుండాపోతాయేమోననుకున్న ఈ అందాల కళ్లు నావి అయినందుకు"

తన సౌందర్య ప్రశంసకు హారతి చిరునవ్వు నవ్వింది.

"నువ్వు కావాలనుకుంటే ఇంతకంటే అందమైన అమ్మాయే నీస్వంతమయ్యేది" అంది అతని క్రాపులోకి వేళ్ళుపోనిస్తూ.

"ఇంతవయస్సున్నా మీరు నా కళ్ళకు అమ్మాయిలా అందంగానే కనిపిస్తారు"

హారతి మనసు చివుక్కుమంది. ఈ సమయంలో అతడు 'వయసు' ప్రసక్తి తేకుండా ఉంటే బాగుండేది అనిపించింది.

"అవునూ ఇంకా నన్ను మీరు, అండీ, మేడం అనే పిలుస్తావా?" అంది మాట మారుస్తూ.

ప్రభాకర్ ఏమనాలో తోచనట్లు "ఊఁ" అన్నాడు ఆలోచిస్తూ.

"అలాపిలిస్తే అందరూ నవ్వుతారు" అంది నవ్వుతూ అతని ముక్కు పట్టుకుని ఊపుతూ.

పెదవులను వేలితో రాస్తూ "ఏమని పిలవాలి?"అన్నాడు ఆమెవంక తదేకంగా చూస్తూ.

"నీ యిష్టంవచ్చినట్లు పిలువు"

"నాకిలాగే ఇష్టం"

"కానీ అలా పిలిస్తే అందరూ నవ్వుతారు. 'హారతీ' అనిగానీ, లేకపోతే 'హారీ' అనిగానీ పిలువు"

"పోనీ, 'దేవీ' అని పిలవనా?"

"దేవీ ఏమిటి నాటకంలో పిలిచినట్లు" హారతి నవ్వింది.

"ఇంత వయస్సు ఉన్నా మీరు చిన్న పిల్లలా, అమాయకంగా, దేవతామూర్తిలా, అందంగా ఉంటారు. అందుకే 'దేవీ' అనే పిలుస్తాను. సరేనా..?"

హారతి మనస్సు మరోసారి కలుక్కుమంది.

టాపిక్ అటూ ఇటూ తిరిగి చివరికి ఈ వయస్సు అనే విషయం దగ్గరకే వచ్చి ఆగుతోంది.

ఇంతకు ముందు ప్రభాకర్, తనూ వయస్సు విషయంలో అనేక సార్లు



మాట్లాడుకున్నా అప్పుడేమీ అనిపించేది కాదు. కానీ ఇప్పుడు ఈ వయస్సు అనే సమస్య పెనుభూతమై తన మనస్సును వేధిస్తోంది.

చూసేందుకు అతిస్వల్ప విషయంలా కనిపించే ఈ వయస్సు అనే సమస్య నిత్య జీవితంలో పెనుభూతంలా అడుగడుగునా సాక్షాత్కరిస్తూ భయపెడుతోంది.

"ఏమిటి... ఆలోచిస్తున్నారు..?"

"అబ్బే.. ఏం లేదు..."

"పెద్దవాళ్ళను అలా పేరు పెట్టిపిలిస్తే ఏం బాగుంటుంది. దేవీ అనే పిలుస్తాను. సరేనా...?"

"నీ ఇష్టం"

పక్కకు తిరిగి పడుకుంది హారతి.

ఆమె కంటి చివరి నుండి ఓ కన్నీటి బిందువు జారి దిండులో ఇంకిపోయింది.

* * *

"మేడంగారూ....! ఇంకా బయటికి వస్తారా లేదా..?"

"అబ్బబ్బ... ఉండు ప్రభా. ఒక్క నిమిషం.." డ్రస్సింగ్ టేబిల్ వద్దనుండి హారతి తిరుగు కేక పెట్టింది.

"ఆ.. ఒక్క నిమిషం అంటూ నువ్విలాగే లేట్ చెయ్యి, అవతల బుక్కింగ్ క్లోజ్ అవుతుంది" క్రీమ్ రాసుకుని అణిచి పెట్టి దువ్విన ఒత్తయిన నొక్కుల జుట్టును చేతితో సవరించు కుంటూ కేక పెట్టాడు ప్రభాకర్.

క్రీం కలర్ టీ షర్టులో ప్రభాకర్ నాజూగ్గా, అందంగా కనిపిస్తున్నాడు.

"ఇదో... వన్ మినిట్"

జడవేసుకుని పట్టెడు కనకాంబరాలు తురుము కోవాలా... లేకపోతే ముడి వేసుకుని ఒకగులాబీని ముడుచు కోవాలా...?

ఇదే ప్రస్తుతం హారతి ముందున్న తేలని సమస్య.

జడకు చాలీచాలని జుట్టు మరీ పీచులా ఉండి భుజాలు దాటకుండా రోతగా అని పిస్తుందేమో!

ముడి వేసుకుంటే హుందాగా బాగానే కనిపిస్తుంది కాని, మరీ పెద్దదానిలా ఉంటుందేమో!!

చివరకు ఇప్పటి ఫ్యాషన్ ఇదేనని సరిపెట్టుకుంటూ త్వరత్వరగా ముడి వేసుకొని పిన్నుకు ఓ పువ్వుగుచ్చి చెవి పక్కగా పెట్టుకుని అద్దంలో చూసుకుంటే పాపిటలో తెల్లవెంట్రుకలు కాలులో ముల్లులా కలుక్కుమంటూ దర్శన మిచ్చాయి. హారతి దువ్వెన తీసుకుని శత విధాలుగా ప్రయత్నించి వాటిని మరుగు పర్చలేకపోయింది.

చీర సెలెక్ట్ చేసుకునేందుకు కూడా హారతికి తిరిగి సమస్య ఎదురయ్యింది.

చివరికి ఓ నెమలి కంఠం రంగు పట్టు చీరతో ముస్తాబు పూర్తిచేసుకుంది.

ప్రభాకర్ ఆమె వైపుఎగాదిగాచూస్తూ.

"ఛ....ఇదేం చీర అమ్మమ్మలా.... చక్కగా ఏ జార్జెట్ చీరయినా కట్టుకో"

తన శరీరానికి జార్జెట్స్ నప్పవు. చక్కగా, నాజూగ్గా ఉన్న అమ్మాయిలు కట్టుకుంటే బాగుంటుంది. కానీ,ఆ విషయం ప్రభాకర్‌కు చెప్పలేకపోయింది.

మొదటిసారిగా ప్రభాకర్‌తో కలిసి బయటికి వెడుతోంది. అతనికి ఇష్టమైనట్లే ఉంటే బాగుంటుంది.వెంటనే లోపలికి వెళ్ళి సిమెంటు కలర్ మీద తెల్ల చుక్కలున్న అమెరికన్ జార్జెట్ చీరా, మాచింగ్ జాకెట్ వేసుకుని బయటికి వచ్చింది.

ఇద్దరూ పక్కపక్కగా నడుస్తుంటే హారతికి ఏదో ఒక రకంగా అనిపించింది.

సన్నగా, నాజూగ్గా, చలాకీగా నవ్వుతూ కబుర్లు చెబుతున్న ప్రభాకర్‌కు ఉండటానికి ఇరవైరెండు ఇరవైమూడే ళ్లున్నా ఇంకా ఐదేళ్ళు చిన్నవాడిలా, అందంగా, పుణికి పుచ్చుకున్న యవ్వనంలా కనిపిస్తాడు.

అతని పక్కనే నడిచేందుకు బిడియ పడింది హారతి.

"ఇలా ఎంతదూరం నడుస్తాం, రిక్షా ఎక్కుదాం" అంది హారతి.

"ఈ మాత్రం దూరానికే రిక్షా ఎందుకూ, హాయిగా కబుర్లు చెప్పుకొంటూ నడిస్తే సరదాగా ఉండదూ"

హారతి మరి మాట్లాడలేకపోయింది.

ఇద్దరూ నడిచివెళ్ళి హాలుకు చేరుకున్నారు.

ఇంకా టికెట్స్ ఇవ్వడంలేదు.

హారతి, ప్రభాకర్ బుక్కింగ్‌కి కాస్త దూరంలో నిలబడ్డారు.

"హాయ్... ప్రభా"

"హాయ్...మోహన్.,.కృష్ణా..." వరుసగా నలుగురి ఫ్రెండ్స్‌తో చేతులు కలిపాడు ప్రభాకర్ నవ్వుతూ.

వాళ్ళతోపాటు రెండడుగులేసి కాస్త దూరం వెళ్ళాడు.

"ఏంరా... ఎక్కడా కనిపించడం లేదు..."

"నిరుద్యోగపర్వం కదూ! ఏదీ-ఉద్యోగాల వేటతోనే సరిపోయింది"

"ప్రభా! ఈమధ్య నీవు పెళ్ళి చేసుకున్నట్లు తెలిసింది. మమ్మల్ని పిలవకుండానే చేసేసుకున్నావన్న మాట" నిష్ఠూరంగా అన్నారు అందులో ఒకరు.

"ఎవరినీ పిలిచే అవకాశం లేకపోయిందిరా...అంతా అర్జంటు అర్జంటుగా జరిగిపోయింది" ప్రభాకర్ నవ్వుతూ సమాధానం చెప్పాడు.

వాళ్ళకు కొంచెం దూరంలో నిలుచున్నప్పటికీ హారతికి వాళ్ళ మాటలన్నీ స్పష్టంగా వినిపిస్తూనే వున్నాయి.

ఇంతలో టికెట్స్ ఇచ్చే బెల్ మోగింది.

"ఏంరా! నీకూ టికెట్ తియ్యమంటావా?" అని కొంచెందూరంలో నిలబడ్డ హారతిని చూస్తూ "ఆవిడెవరు? మీ సిస్టరా?" అనడిగారు.

హారతి ముఖం తెల్లగా పాలిపోయింది. క్షణంలో శరీరంలో ఉన్న శక్తంతా హరించుకుపోయి కళ్ళు తిరుగుతున్నట్లుగా అయి భూమిమీద కాళ్లు గట్టిగా నొక్కిపట్టి కళ్లు మూసుకుంది.

ప్రభాకర్ ఏదోచెప్పాడు వాళ్ళకు.. కానీ అది ఆమె చెవులవరకూ చేరలేదు.

ఆ తరువాత ప్రభాకర్ టికెట్స్ తెచ్చి "పద" అనేవరకూ అలాగే నిలబడిపోయింది.

సినిమా చూస్తూ హారతి చేతిని తన చేతిలోకి తీసుకొన్నాడు ప్రభాకర్.

ఆమె చెయ్యి చల్లగా, ముఖం పేలవంగా ఉంది.

"వాళ్ళమాటలు మనస్సులో పెట్టుకోకు..." ప్రభాకర్ నెమ్మదిగా చెబుతూ ఆమెచేతిని అనునయంగా నొక్కాడు.

హారతి ఏంచూసిందో కూడా తెలీకుండానే ఇంటర్‌వెల్ అయింది.

తమముందు వరుసలో కూర్చున్న నలుగురు యువకులూ వెనక్కు తిరిగి ప్రభాకర్‌వంక చూస్తూ నవ్వారు!

"ఆంధ్రదేశంలో అమ్మాయిల కరువు ఇంతగాఉందని నాకింతవరకూ తెలీదురా"

"మనవాడిది పెద్దప్లానులేరా"

"మనవాడికా ఎలాగూ ఉద్యోగంలేదు. ఆవిణ్ని చేసుకుంటే ఉద్యోగంలేదే అన్న

బాధా ఉండదు. పైగా కావలసినంత ఫ్రీగా ఎంజాయ్ చెయ్యొచ్చు"

స్పష్టంగా వినిపిస్తున్న మాటలను తాను అసలు వినలేదన్నట్లుగా తలతిప్పి తదేకంగా ఎటో చూస్తుండిపోయాడు ప్రభాకర్.

అతని ముఖంలో ఉద్వేగం, అవమాన భారం దాచుకోవాలన్నా దాగడంలేదు

హాల్లో లైట్స్ ఆఫ్ అయ్యాయి.

ముందువరుసలోని నలుగురి చర్చ ఇంకా కొనసాగుతూనే ఉంది.

"ప్రభా! ఇంటికి వెళ్ళిపోదాం. నాకు తలనొప్పిగా ఉంది!"



హారతి లేచినుంచుంది.

అనుసరించాడు ప్రభాకర్.

* * *

ఆఫీసులో పని చూసుకుంటుండగా పక్కనే ఉన్న లేడీస్ వెయిటింగ్ రూంలో నుండి తన పేరు వినిపించడంతో హారతి చెవులు నిక్కబొడుచుకున్నాయి.

"ఇదివరకు మేడంగారు చక్కగా నిండుగా ఉండే పట్టుచీరలూ, నేతచీరలూ కట్టేవారు. ఈమధ్య అన్నీ ఫారెన్ నైలెక్సులూ, అమెరికన్ జార్జెట్స్ కడుతున్నారు..."

"చాలా మార్పే వచ్చింది. ఇదివరకు బొత్తిగా పిచ్చి మొద్దులా ఉండేది కదా.. ఇప్పుడు బొమ్మలా తయారవుతోంది..."

"కుర్రాడిని చేసుకుంది కదూ...తను ముసిలిదానిలా కనిపిస్తే ఎలా? అందుకే ఈ షోకులు..."

"అవునండీ... నాకు తెలీక అడుగుతాను, ఆ అబ్బాయి మరీ కుర్రాడిలా ఉన్నాడు. ఈమెను ఎలా ఇష్టపడ్డాడంటారు...?"

"ఏముందీ...మోజు. వెనకటికి ఎవడో అన్నాడట- నా కళ్ళు పెట్టుకుని చూడు అని. అలా ఉంటుంది. ఈమధ్య ఎక్కడో పేపర్లో చదివాను. అమెరికాలో అనుకుంటాను. ముక్కుపచ్చలారని కుర్రాళ్లు ముసలమ్మల వెంటబడి రేప్ చేస్తున్నారట... పిదపకాలాలూ, పిదప బుద్ధులూ"

"అయినా ఈవిడకు ఈ వయస్సులో పెళ్ళేమిటండీ... విడ్డూరం కాకపోతేనూ"

నవ్వులు.

"ఏ వయస్సుకా ముచ్చట అంటారు. కానీ ఈడుబోయిన ఈ ముచ్చట విడ్డూరంగానే ఉంది. మొన్న మీకు చూపించానుగా..ఆకుర్రాడు ఈవిడకు తమ్ముడో, మరిదో లేకపోతే అక్కకొడుకేమో అనిపిస్తాడే తప్ప భార్యాభర్తలని కళ్ళున్నవాళ్ళెవరూ అనరు. రేపీవిడకు పిల్లాపీచూ పుడితే వాళ్ళను ఎత్తుకు తిరిగితే మనవళ్ళనూ, మనవరాళ్ళనూ చూసినట్లే ఉంటుంది కానీ సొంత పిల్లల్లా ఉంటారటండీ"

చివరి మాటలు సూటిగా వచ్చి హారతి గుండెలకు తాకాయి.

గుండెలోతుల్లో అయిన గాయంనుండి రక్తం చిమ్మిన బాధతో కళ్ళల్లో నీళ్ల చిమ్మాయి.

లోపలి సంభాషణ అయిపోయేలా లేదు.

చిన్నగా దగ్గుతూ తన ఉనికిని తెలియచేస్తూ లోపలికి నడిచింది.

హారతిని చూస్తూనే గతుక్కుమన్నారు లోపలివాళ్ళు.

"మేడంగారూ! మీకు నూరేళ్ల ఆయుష్షుసుమండీ...మీ గురించేమాట్లాడుకుంటున్నాం" నవ్వుతూ అంది సరస్వతమ్మ.

"మేడంగారు ఏ చీర కట్టినా చీరకే అందం వస్తుంది సుమా" అంది విమల.

ఎందుకీ మనుషులు ప్రతిక్షణం ఇలా నటిస్తుంటారు...?

డబ్బుకోసం వృత్తిపరంగా నటించే నటీమణులను మించిపోయారు వీళ్ళు. దీని వల్ల వీళ్ళకు లభించే సంతృప్తి ఏపాటిది? ఇంటా, బయటా తన నెందుకింతలా వేధించుకు తింటున్నారు...?

తాను చేసిన నేరమేమిటి?

కావాలని తన వయస్సునూ, లోపాలనూ దాచి ఈ పెళ్ళి చేసుకుని ఎవరినీ మోసగించలేదే?

మరెందుకు తన జీవితం మీద వీళ్ళకి

అనవసర కుతూహలం?

హారతికి తెలీదు. బావిగట్టున అమ్మ లక్కలే కాదు సభ్యసమాజపు విద్యా వంతులైన స్త్రీలుసహితం అన్నీ లక్షణంగా ఉన్న వాళ్ళనైనా ఆడిపోసుకుంటారనీ... ఒకరు లేనప్పుడు వారి గురించీ, వాళ్ళు ఉన్నప్పుడు మరొకళ్ళను గురించీ చెప్పు కోవడం మానవ సమాజపు సహజమైన బలహీనత.

"మేడంగారూ, మీ వారికి ఉద్యోగం దొరికిందట కదూ..."

"ఆఁ..." ముక్తసరిగా చెప్పింది హారతి.

"మేడంగారు మనకు చెప్పారే కాదు. పార్టీ అడుగుతామని భయం"

హారతికి మాట్లాడాలనిపించలేదు.

"పోనీలెండి...మీకు శ్రమ తప్పింది"

ఆ వ్యంగ్యం హారతి గుండెలను సూటిగా తాకింది.

సమానత్వం, సమానత్వం అంటూ గొంతు చించుకునే ఈ స్త్రీలు మగవాడి అధికారం కింద, అతని ఏలుబడిలో, అతని పెంపకంలో ఆక్షేపణ లేకుండా ఒదిగిపోగలరే తప్ప మరో మార్పును సహించలేరు...హర్షించలేరు.

"అన్నట్లు మీఆడపడుచుకు సంబంధం సెటిల్ అయ్యిందిట కదండీ"

హారతికి చాలావిసుగ్గా ఉంది.

'నాగొడవ మీకెందుకు...? మీ ఏడుపేదో మీరేడవండి' అనేందుకు సంస్కారం అడ్డువస్తోంది.

"అన్నట్లు ఏవూరు మేడం"

చెప్పింది హారతి.

"కట్నం చాలానే అడిగారటగా...?"

ఆవిడ మాటలు ఇంకా పూర్తి కాకముందే సరస్వతమ్మ అందుకుంది.

"మేడంగారి హబ్బీకి పెళ్ళికాలేదను కుని మా అమ్మాయిని మీ అబ్బాయికి చేసుకుని, మీ అమ్మాయిని మావాడి కివ్వండి అన్నారుట. తీరా విషయం తెలిసి 'మీ కోడలు ఆఫీసరు కదా! ఏం ఆమాత్రం ఇవ్వలేరా?' అంటూ ఎక్కువ డిమాండ్ చేశారుట.''

'ఈ విషయాలన్నీ వీళ్ళకెలా తెలుస్తాయి!' అన్నట్లుగా ఆశ్చర్యంగా చూస్తూండిపోయింది హారతి మాటాపలుకూ లేకుండా.

ఆమె ఆశ్చర్యాన్ని గమనించినట్లుగా సరస్వతమ్మ నవ్వుతూ "మీ అత్తారు ఉంటున్న వీధిలోనే మా చుట్టాలు ఉన్నారు లెండి. ఆవిడ నిన్న మా ఇంటికివచ్చి ఫలానా హారతిగారు మీ ఆఫీసరుకదూ అని అడిగి, నిన్న మీ ఆడపడుచుకు సంబంధం వచ్చినట్లుగా చెప్పిందిలెండి. లేకపోతే నాకేం తెలుసూ...?"

గుండెల్లో నుండి నెట్టుకువస్తున్న నిట్టూర్పును బలవంతంగా ఆపుకుంది హారతి.

తనకంటే వయస్సులో పెద్దవాళ్ళు కదా అని వాళ్ళు తన సబార్డినేట్సు అయినా వాళ్ళతో చనువుగా, స్నేహంగా మసలుకునేది హారతి.

తమ పై ఆఫీసర్ అన్న గౌరవమైనా లేకుండా వాళ్ళలా మాట్లాడుతూంటే, సబార్డినేట్సుతో చనువుగా వ్యవహరించడం ఎంత తప్పో హారతికి తెలిసి వచ్చింది.

ఉద్యోగాలు చేసినా, ఊళ్ళేలినా సహజమైన స్వభావం ఎక్కడికి పోతుంది?

"మేడం...మీకొరకు ఎవరో వచ్చారు"

"ఎవరు?" అప్రయత్నంగా అడిగింది హారతి.

"బహుశా మీ తమ్ముడు అయి ఉంటారు" నవ్వుతూఅన్నది అటెండర్ గా పనిచేసే అమ్మాయి నీల. ఆమె ఆఫీసులో కొత్తగా జాయిన్ అయింది.యస్.యస్.సి. పాసయింది.

హారతిముఖం క్షణంలో పాలిపోయింది.

ఆమెకు ఆ వచ్చిందెవరో అర్థం అయింది.

వెంటనే లేచి నాలుగడుగులు వేసింది.

"అతను మేడం తమ్ముడు కాదు. ఆమె భర్త"

"రియల్లీ" నీల స్వరంలో అంతులేని ఆశ్చర్యం.

"సరస్వతమ్మగారూ! అతను మేడమ్ గారి భర్త అయిఉండరు అతను చాలా చాలా కుర్రాడిలా ఉన్నారు"

"అవును అది అంతే.అతను మేడంగారి హజ్బెండ్. అయామ్ ష్యూర్" తనకూ ఇంగ్లీషు వచ్చని తెలియాలని సరస్వతమ్మ గారు అప్పుడప్పుడూ ఇంగ్లీషు మాట్లాడుతూ ఉంటుంది.

"మీకెలా తెలుసు...?"

"బాగుంది. నాకు తెలీకపోతే నిన్నగాక మొన్న వచ్చిన నీకు తెలుస్తుందా?" పెడసరంగా అంది సరస్వతమ్మ.

"నేను నమ్మలేకపోతున్నాను" నీల స్వరంలో ఇంకా తేరుకోని ఆశ్చర్యం.

వెనకనుండి లీలగా వినిపిస్తున్న మాటలు హారతిహృదయాన్ని ముక్కలుగా చేశాయి.

ఆఫీసు ముందు చెట్టునీడలో హారతి కొరకు నిరీక్షిస్తున్నాడు ప్రభాకర్. గంభీరంగా, ఉదాసీనంగా ఉన్న హారతి ముఖం చూస్తూ సన్నగా ఈలవేస్తున్న వాడల్లా తక్కున ఆగిపోయాడు.

"దేవీ...ఏవిటలా ఉన్నావు?"

హారతి పేలవంగా నవ్వింది. "ఎలా ఉన్నాను...?"

"ఏం జరిగింది...?"

"ఏమీ జరగలేదు కానీ అసలు నువ్వెందుకిక్కడికి వచ్చావు...?''

ప్రభాకర్ ముఖం మ్లానమైంది.

ఆమెను కలుసుకోవాలని తానెంతో ఉత్సాహంతో వచ్చాడు. హారతి ఎందుకొచ్చావంటూ నిగ్గదీసినట్లు పొడిగా అడగడంతో అతని ఉత్సాహం మీద నీళ్ళు చిలకరించినట్లయింది.

"అబ్బే ఊరికే అలా వెడుతూ..."

హారతి ముఖం చిట్లించింది.

"ఎలాగూ ఓ గంటయితే నేను ఇంటికే వస్తున్నాగా! ఈలోపుగా నువ్వు రాకపోతే నేం..?''

''అయాం..సారీ"

ప్రభాకర్ గిరుక్కున వెనక్కుతిరిగి చకచకా వెళ్ళిపోయాడు. అలాగే చూస్తూ నిలబడిపోయిన హారతి కళ్ళల్లో నీళ్ళు చిమ్మాయి.




సాయంత్రం ఇంటికి వెళ్ళేసరికి వీధి గదిలో కిటికీలోనుండి ఎటో చూస్తూ దీర్ఘాలోచనలో మునిగిఉన్న ప్రభాకర్‌ను చూస్తే జాలివేసింది హారతికి.

'తాను అలా అనకుండాఉండాల్సింది.

ప్రభా ఎంత బాధపడ్డాడో’

తన అలసట అంతా మరిచిపోయి గబగబా ఇంట్లోకి వెళ్ళి ముఖం కడుక్కుని చీర మార్చుకుని, నీట్‌గా తయారయి కాఫీకప్పు తీసుకుని చిరునవ్వుతో వీధిగదిలోకి వచ్చింది.

"ప్రభా కోపంవచ్చిందా?" లాలనగా అడుగుతూ భుజంమీద చెయ్యి వేసింది.

ప్రభాకర్ తదేక దృష్టితో వీధివంక చూస్తున్నాడేతప్ప ఇటు తిరగలేదు.

"ప్రభా, నిజంగా నామీద బాగా కోపం వచ్చింది కదూ?"

ప్రభాకర్ భుజంమీద చెయ్యివేసి బలవంతంగా తనవంక తిప్పుకుంటూ అడిగింది హారతి.

ప్రభాకర్ తలతిప్పి సూటిగా ఆమె వంక చూశాడు. తళతళలాడే ఆమె సోగకళ్ళల్లో తడీ, తప్పుచేసినట్లుగా తలవంచుకున్న ఆ తీరూ చూసిన అతనికి కోపం క్షణంలోమాయమయ్యింది. ఆప్యాయంగా ఆమె చేతులు పట్టుకుని దగ్గరగా తీసుకున్నాడు. వంచుకున్న ఆమె తలను మునివేళ్ళతో పైకి ఎత్తాడు.

హారతి ఆర్తిగా అతని గుండెలమీద తలవాల్చింది. ఆమెకళ్ళు జలజలా వర్షించాయి.

ప్రభాకర్ ఆమె తలను ఎత్తి పట్టుకుంటూ, "ఎందుకు..?" అన్నాడు ఆప్యాయంగా.

హారతి నీళ్ళునిండిన కళ్ళతో చిరునవ్వు నవ్వుతూ, 'ఏమీలేదు' అన్నట్లుగా తల ఊపుతూ చిరునవ్వు నవ్వింది.

ఆ తరువాత అతనినుండి విడివడుతూ "ప్రభా, కాఫీతాగు" అంది.

"ఫిఫ్టీ...ఫిఫ్టీ..."

హారతి సగం కాఫీ సాసర్‌లోకి వంచి అతని పెదవులకు అందించింది. చల్లారిన ఆ కాఫీనే ఇద్దరూ పంచుకున్నారు.

అవీ, ఇవీ కబుర్లు చెప్పుకుంటూ వంటా, స్నానం, భోజనం ముగించుకుని పడకగదికి చేరుకున్నారు.

అప్పుడే ఆమెకు విశ్రాంతి.

ఈమధ్య వంట్లోబాగుండక రంగమ్మ పని మానేయడంతో హారతికి వంట తప్పడం లేదు.

మంచంమీద పడుకుని ఏదో పుస్తకం తిరగేస్తోంది హారతి. మంచంమీద వెల్లెకిలా పడుకుని తదేకంగా ఆమె వంక చూస్తున్నాడు. పుస్తకం చదువుతూనే ఉన్నా విశాలంగాఉన్న ఆమె సోగకళ్ళు పూర్తిగా మూసుకున్నట్లున్నాయి. పచ్చటి ముఖంమీద అర్ధచంద్రాకారంగా నల్లటి గీతలు గీసినట్లుంది. హారతి పుస్తకం చదువుతూ కళ్ళుఎత్తి అతనివంక చూసి చిరునవ్వు నవ్వింది.

"ఏమిటి అలా చూస్తున్నావు..?"

"నన్ను మోసంచేసిన ఆ సోగకళ్లను"

హారతి చిన్నగానవ్వింది. అందమైన ఆమె కనుపాపలు తళతళ లాడాయి.

"నిన్ను మోసం చెయ్యలేదు. నిన్ను నా స్వంతంచేశాయి..." అంది పూర్తిగా అతనివైపు తిరుగుతూ.

"ఇవ్వాళ నీకెంత మంచివార్త చెబుదామని వచ్చానో తెలుసా?"

ఆమె అరచేతిని తన చేతిలోకి తీసుకుని గుండెలమీద ఉంచుకున్నాడు.

"ఏం వార్త?" అతనికి పూర్తిగా హత్తుకుపోతూ అడిగింది హారతి.

"ఊహుఁ... చెప్పను... నన్ను కోప్పడ్డావు"గారాలుపోయాడు ప్రభాకర్.

"సారీ చెప్పానుగా... ఇంకెప్పుడూ కోప్పడను. సరేనా?"

"అయినాసరే చెప్పను. నాకు కోపం పూర్తిగాపోలేదు."

"చెప్పకపోతే నీ జత పచ్చి" హారతి నవ్వుతూ అతనినుండి విడిపించుకుని లేచి కూర్చుంది.

ప్రభాకర్ చటుక్కున లేచి ఆమె ఒళ్ళో తల పెట్టుకుని కదలకుండా నడుంచుట్టూ చేతులువేశాడు.

హారతి ఒత్తుగావున్న అతని క్రాఫ్ లోకి వేళ్ళుపోనిస్తూ, "ఊఁ...చెప్పు" అంది లాలనగా!

"చెప్పానుగా నాకు కోపం పూర్తిగా పోలేదని..."

"మరి ఏంచేస్తే పోతుంది నీ కోపం"



అతని ముక్కుపట్టుకు ఊపుతూ అడిగింది హారతి.

"ఈ చెంపకు పది, ఈ చెంపకు పది.. ఇక్కడో పదిచొప్పున ముద్దులు ఇస్తే పోతుంది" అన్నాడు పెదవులు చూపిస్తూ.

హారతి నవ్వింది.

"చాలా...? మరో పది ఈ కంటికీ, మరోపది ఆ కంటికీ కూడా వేసుకుంటే ఎంచక్కా లెక్కకు యాభై సరిపోతాయి"

"దేవి అనుగ్రహిస్తే వద్దంటానా...?" ప్రభాకర్ ఆమె అరచేతిని పెదవులకు ఆనించుకొని పెద్దచప్పుడుతో ముద్దుపెట్టుకున్నాడు.

హారతి కరిగిపోయింది.

వంగి అతని ముఖమంతా తన పెదవులతో స్పృశిస్తూ, పెదవులమీద గాఢంగా చుంబించింది.

తన్మయంగా కళ్ళు మూసుకున్నాడు ప్రభాకర్.

"ఇప్పటికి దీంతోసరిపెట్టుకుని ఇక చెప్పు ?"

"నాకు ఉద్యోగం వచ్చింది. ఈ విషయం చెబుదామనే నేను వచ్చింది"

"రియల్లీ..."

"రియల్లీ! జాజిమొగ్గలా ఉన్న అందమైన నీ ముక్కుతోడు"

"ప్రభా...ఎక్కడ? వాట్ ఎ గుడ్‌న్యూస్ ప్రభా! ఇంతవరకూ నాకు చెప్పకుండా ఎలా దాచుకున్నావ్ ?" పట్టలేని ఆనందంతో అతని తలను గుండెలకు అదుముకుంటూ ఆనందంగా అడిగింది.

"బాంక్‌లో... ఒక వారంలో జాయిన్ కావాలి"

"ఈ ఊళ్ళోనేనా... ?"

"ఆఁ..."

"ప్రభా! నిజంగా మనం అదృష్టవంతులం కదూ" అతని మెడచుట్టూ రెండు చేతులూ పెనవేసింది.

హారతికి పట్టలేనంత సంతోషంగా వుంది. ఆ సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అవుతూ అతన్ని ఏదో చేసేయాలనే ఆవేశపడిపోతూనే ఒకవంక సంకోచ పడుతోంది.

ప్రభాకర్ ఆవేశంగా ఆమెను ఆక్రమించుకుంటూ ఆమె ముఖాన్నీ, కళ్ళనూ, పెదవులనూ ముద్దులతో ముంచేశాడు...!

* * *

లలితకు సంబంధం కుదిరింది.

కట్నం కాస్త ఎక్కువే అనిపించినా ఈడూ – జోడూతో పాటు పిల్లవాడి ఆర్థిక స్థితిగతులు బాగుండటంతో ఇంట్లో ఎవరికీ ఈ సంబంధాన్ని ఒదులుకోవాలనిపించలేదు. అన్నింటినీ మించి లలితకి సంబంధం నచ్చింది.

కట్నం విషయంలో తాము వాళ్ళతో తూగగలమా– అని భవాని తటపటాయించింది.

హారతి తన పేర బాంకులో ఉన్న డబ్బు ఇవ్వచ్చు సంబంధం ఖాయం చేసుకోమని నచ్చచెప్పింది.

భవానీకి హారతి డబ్బు తీసుకోడం మనస్సుకు నచ్చకపోయినా అవసరం ఆమెను 'ఒద్దు' అననివ్వలేదు.

ఆమె మనస్సు ఇంకా హారతిని కోడలిగా స్వీకరించలేకపోతోంది. ఓ అయిదు–పదేళ్ళ తేడాతో తనంత ఉన్న ఆవిడ తన కోడలు అనుకునేందుకు భవానీకి ఎబ్బెట్టుగా ఉంది.

ప్రభాకర్‌కు ఈ డబ్బు గొడవలు పట్టవు. లావాదేవీలూ, వ్యవహారలూ తెలీవు. జీతంలో కొంత తల్లికి ఇస్తాడు. కొంత హారతికిస్తాడు. అదే అతనికి

తెలిసింది.

పెళ్ళి జరిగిన వారం రోజులూ ఆమె అత్తగారి ఇంట్లోనే ఉంది. ఆ వారం రోజులూ ఆమె ప్రాణం అరచేతిలో పెట్టుకుని ఉన్నట్లే ఉంది.

'మీ ప్రభాకర్‌కు పెళ్ళిఅయిందటగా? కోడలు ఏదీ?' అంటూ ఆమె ఏమూల ఉన్నా వెదుక్కుంటూ వచ్చి పలకరించే వారు బంధువులు, స్నేహితులు, పరిచయస్తులు.

వాళ్ల ముఖాలలో కనిపించే ఆశ్చర్యం, వ్యంగ్యం, హేళన భరించేందుకు హారతికి శక్తి సరిపోయేది కాదు.

పెళ్లి రెండు రోజులుందనగా భవానీ అన్న కేశవరావు, కూతురు సుజాతతో సహా వచ్చాడు.

వస్తూనే సుజా కళ్లు తనను కాదని బావ చేసుకున్న తన ప్రత్యర్థి కోసం వెదికాయి.

ఆమె తనకంటే ఎంత అందగత్తో చూడాలని మనస్సు వేగిరపడింది. మిలమిలలాడే హారతి కళ్లు ఆమెకు ఆశ్చర్యం కలిగించినా, 'బావకు పిచ్చి పట్టలేదుకదా' అనుకుంది హారతిని చూస్తూ.

నూత్న యవ్వనంతో, యవ్వనం తెచ్చిన ఒంపుసొంపులతో, లావణ్య సౌకుమార్య సౌందర్యాలతో, చుక్కల్లో చందమామలా మెరిసిపోతున్న సుజాతను చూసి హారతి ముచ్చటపడింది. 'తనకు సకాలంలో పెళ్లి అయిఉంటే కొద్దో గొప్పో తేడాతో ఇంత కూతురుండేది కదూ...' అనుకుంది.

ఆ భావం ఆమె అంతరాంతరాలలో ఎక్కడో వున్న మాతృత్వపు వాంఛను సున్నితంగా తాకింది.

సుజాత ప్రభాకర్‌కు చిన్నతనంనుండే పేరు పెట్టిన 'భార్య' అని తెలిసినప్పుడు గాఢంగా నిట్టూర్చింది.

సుజాత ప్రభాకర్‌ను పసితనం నుండే ఎంత గాఢంగా ప్రేమించి ఉంటుందో ననుకుని దిగులుపడింది.

ప్రభాకర్‌ను పలకరించేందుకూ, మాట్లాడేందుకూ సిగ్గుపడుతున్నా, ఆ అమ్మాయి కళ్లు ప్రతిక్షణం అతన్ని అల్లుకుపోయి ఉండటం గమనించింది.

చలాకీగా నవ్వుతూ, తుళ్లుతూ, తనున్నంత మేరా కాంతిని చిమ్ముతూ, యవ్వన స్రవంతిలా తిరుగుతున్న సుజాతను చూస్తూ 'ప్రభాకర్‌కు తగిన జోడీ అయి ఉండేది' అనుకుని నిట్టూర్పు విడిచింది దిగులుగా.

ఆ వారంరోజులూ శిలువ మోస్తున్నంత భారంగా, బాధామయంగా గడిపి పెళ్లి పూర్తి అవుతూనే ఇంటికి వచ్చి కరువుతీరా ఏడ్చింది హారతి.

* * *

ఆదివారం ప్రభాకర్, హారతి సరదాగా పేక ముందు వేసుకుని ఆడుకుంటున్నారు. ప్రభాకర్‌కు పేక ఆట అంటే చాలా సరదా! హారతికి సరిగ్గా ఆట రాకపోయినా అతని కోసం ఆడుతుంది... ఓడుతుంది. నిజానికి ఆ సమయంలో ఆమెకు ఏదైనా చదుకోడం ఇష్టం.

ప్రతి ఆటలోనూ ఓడిపోతూ ఉడుక్కుంటున్న హారతిని చూస్తుంటే అతనికి ముచ్చట.

హారతి తన వయస్సును మరచిపోయి పసిపిల్లలా అతని దగ్గర మారాం చేస్తుంది. అది అతనికి చెప్పలేనంత ఇష్టం.

"ఏయ్...! ప్రభా నువ్వు దొంగాట ఆడుతున్నావు" కెవ్వుమంది హారతి, అతను ముక్కను దొంగతనంగా దాచే

యడం చూసి.

"నీ అందమైన కళ్ళతోడు... నాకు దొంగాట ఆడటం అసలు రాదు" అల్లరిగా అన్నాడు ప్రభాకర్.

"ఈ కొంటె మాటలతో నన్ను మాయచేస్తున్నావు. అదిగో ఆ ముక్క ఇలా ఇచ్చేయ్"

ప్రభాకర్ బిక్కముఖం వేసుకుని ముక్కతీసి ఇచ్చాడు.

"చూడూ, నువ్విలా దొంగాటలు ఆడితే నేనసలు ఆడనే ఆడను" పేకముక్కలు కింద పడేస్తూ బుంగమూతి పెట్టింది హారతి.



"పోస్నీ ఈ ఆట వద్దులే. మరో ఆట ఆడుకుందామా?" ప్రభాకర్ పెదవుల మధ్య చిరునవ్వును అదిమిపడుతూ

అడిగాడు.

"ఏం ఆట?" కోపం మరిచిపోయి తలెత్తి అతనివంక చూసిన హారతి అతని పెదవుల మధ్య నలుగుతూన్న కొంటె చిరునవ్వూ, కళ్లల్లో అల్లరికోరికా చూసి ఆ ఆట ఏమిటో తెలుసుకొంది.

సిగ్గుపడుతూ తల దించుకుని, ''ఛీ... ఫో... నీ కెప్పుడూ ఆ ఆటే..." అంది సిగ్గుసిగ్గుగా.

ఆమె ముఖం సిగ్గుతో కందిపోయింది.

తలుపు చప్పుడవడంతో సర్దుకుంది హారతి.

"అబ్బ! ఇప్పుడెవరూ... పాసకంలో పుడకలా" విసుక్కున్నాడు.

"సుజా..." అంది హారతి.

లేచి వెళ్ళి తలుపు తీశాడు ప్రభాకర్.

"హాయ్...సుజా...రారా..." అంటూ సంతోషంతో కేక పెట్టాడు.

సుజా చిరునవ్వు నవ్వుతూ లోపలికి వచ్చింది.

"రా...సుజా...కూర్చో" చిరునవ్వుతో ఆహ్వానించింది హారతి.

"అక్కా, బావకిష్టం అని అత్తయ్య పెరుగు వడలు పంపింది" అంది చేతిలోని టిఫిన్ బాక్సు టేబిల్ మీద పెడుతూ.

"మీ బా వ కే నా... మనకు కూడానా...?" నవ్వింది హారతి.

"మనం తిన్నాకే. బావకు" ప్రభాకర్ వంక చూస్తూ చిలిపిగా నవ్వింది సుజాత.

ప్రభాకర్ ఆమె చిరునవ్వు అందు కుంటూ. "ఏంచేస్తాను.? ఒంటరిగాడిని. ఇప్పుడు మీరిద్దరూ. మీ ఇ ష్ట ం మ రి" అన్నాడు నిస్సహాయత నటిస్తూ.

ముగ్గురూ కూర్చుని కబుర్లు చెప్పు కుంటుండగానే సుజా వంటింట్లోకి వెళ్ళి తను తెచ్చిన ఫలహారం మూడు ప్లేట్ల లోనూ సర్ది తెచ్చింది.

కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుతూ ఫల హారం పూర్తి చేశారు.

హారతీ, సుజా ఒక జట్టుగా ఉండి మాటలతో ప్రభాకర్‌ను వీలయినంత వరకూ ఏడిపిస్తుంటారు.

"సుజా, ఆ చేత్తోనే ఓ మంచి టీ ఇచ్చా వంటే నీపేరు చెప్పుకుంటూ తాగుతాము"

హారతి మ న స్సు చివుక్కుమంది. తనను అడగకూడదూ?

బావ తనను అడిగిందే చాలన్నట్లుగా చెంగున గెంతుతూ లోపలికి వెళ్ళింది సుజా.

హారతికి ఏదో ఆ సమయానికి ఇంత వండిపెట్టడం తప్ప ప్రభాకర్‌కు కావలసి నప్పుడల్లా, కావలసిందల్లా ఓపిగ్గా చేసి పెట్టే ఓపికా, తీరికాలేవు.

ఆ విషయం తెలిసిన ప్రభాకర్ ఆమెను ఏదీ అడగడు.

తరచూ తల్లి అదీ ఇదీ చేసి పంపు తూంటుంది.

సుజా ఐదు నిముషాల్లో మూడు కప్పులు టీ కలుపుకు వచ్చింది. ముగ్గురూ తాగారు.

"బావా! రేపుఎంప్లాయిమెంట్ఆఫీసుకు వెళ్ళాలి. ఒక్కదాన్నీ వె ళ్ళ ం దు కు భయంగా ఉంది. కాస్త తోడురావూ?"

"అలాగే. రేపు సరిగ్గా పదిగంటలకు రెడీగా ఉండు. నేనొచ్చి తీసుకువెడతాను"

లలిత అత్తగారింటికి వెళ్ళిపోడంతో ఒంటరిగా అయిన భవాని సుజాను తన దగ్గర ఉంచుకుంటానని అన్నగారిని అడి గింది.

అందుకు సంతోషంగానే అంగీక రించారు కేశవరావుగారు. సుజాత ఇంటర్ పాసయింది. చిన్నతనం నుండీ అనుకున్న

సంబంధం ప్రభాకర్‌తో పెళ్ళి తప్పి పోవడం, ఆర్థిక స్తోమత సరిలేని కారణంగా తగిన సంబంధం కుదరక పోవడంతో కూతురికి ఉద్యోగప్రయత్నమైనా చెయ్యాలని అతని ఉద్దేశం.

అదేవిషయాన్ని చెల్లెలికి చెప్పి "సుజాకు ఏదైనా ఉద్యోగ ప్రయత్నం చెయ్యమని ప్రభాకర్‌కు చెప్పమ్మా" అన్నాడు.

సుజా కూడా మేనత్త దగ్గరే ఉండి పోయేందుకు సంతోషంగా అంగీకరించింది. 'ఇక్కడే ఉంటే బావను అప్పుడప్పుడూ చూస్తూండ వచ్చు' ఇదీ ఆ పిల్ల అంతరాంతరాలలోని కోరిక.

సుజా సాయంత్రం వరకూ ప్రభాకర్ ఇంట్లోనే గడిపి, సాయంత్రం ఇంటికి బయలుదేరబోతూ, "బావా! అత్తయ్య ఒక్కసారి నిన్ను వచ్చివెళ్ళమంది" అంది.

"పద. ఇప్పుడే వస్తాను" షర్టువేసుకుని సుజా వెంట బయలుదేరాడు ప్రభాకర్.

ఇద్దరూ ఒకరి పక్కగా ఒకరు నడుస్తూ వెడుతున్న వారి వంక తదేకంగా చూసింది హారతి.

సుజాత ఏదో చెబుతోంది. ప్రభాకర్ నవ్వుతూ ఏదో అంటున్నాడు. సుజా అందంగా సిగ్గుపడింది. వాళ్ళు కనుచూపు దాటిపోయేవరకూ అలాగే చూస్తూండి పోయిన హారతి అప్రయత్నంగా నిట్టూర్చింది.

* * *

"ప్రభా...లే...లే. ఎనిమిది అయిపోయింది" హడావిడి పడుతూ లేపింది హారతి.

ప్రభాకర్ మేలుకునే ఉన్నా బద్ధకంగా అటు తిరిగి పడుకున్నాడు.

"ఆఫీసుకు టైం కావడంలా...లే. లెమ్మంటూంటే" మరొకసారి కదుపుతూ పిలిచింది హారతి.

"ఇవ్వాళ అయ్యగారు బాంకుకు వెళ్ళరు" బద్ధకంగా ఆవలిస్తూ అన్నాడు.

"అదేం పాపం. బ్యాంకువారు మీకు సెలవిచ్చారా ? లేక మీరే బ్యాంకువారికి సెలవు ఇచ్చారా?"

"అదేం కాదు. సెలవు పెడుతున్నాను"

"ఎందుకూ?" ఆశ్చర్యంగా అడిగింది.

"ఇవ్వాళ సుజాను ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసుకి తీసుకెళ్ళాలి"

హారతి ఆశ్చర్యపోయింది. ఎంత జ్ఞాపకం?

"ఆఫీసుకు సెలవు పెట్టి మరీవెళ్ళాలా?"

"మరెలా?"

హారతి లేచి వెళ్ళి తను తయారు కాసాగింది. చేతులు తమ పని తాము చేసుకుపోతున్నా, మనస్సు అన్యమనస్కంగా ఆలోచిస్తోంది. ప్రభాకర్-సుజా కలిసి వెళ్ళే అపురూపమైన దృశ్యాన్ని ఊహిస్తోంది. ఇద్దరూ అలా జంటగా కలిసి వెడుతోంటే కన్నుల పండుగగానే ఉంది. కానీ, హారతి హృదయంలో ఇదీ అని తెలియని గుబులు.

వివాహమైన తొలిదినాలలో భార్యాభర్తలు ఎక్కడా తామే అయి జంటగా కలలు పండించుకుంటారు.

తనకలాంటి అదృష్టంలేదు. ప్రభతో కలిసి బయటికి వెళ్ళడమే అరుదు. వెళ్ళినా గుండెల నిండుగా వ్యధను, దుఃఖాన్ని మోస్తూ తిరిగి వస్తారే తప్ప సంతోషం ఉండదు.

హు... ఈ జన్మకింతే...!

హారతి కళ్ళు చెమరించాయి.



విజయవాడ ప్లాట్‌ఫాం కోలాహలంగా ఉంది.

ఎవరికి వారికే హడావిడీ, కంగారూ.

తాము ఎక్కవలసిన ట్రైన్ తప్పిపోతుందేమో.

అథవా ఎక్కినా సుఖంగా కూర్చునేందుకు సీటు దొరుకుతుందో లేదో! పెళ్ళిళ్ల సీజన్ కావడాన ప్లాట్‌ఫాం పెళ్ళి బృందాలతో కిక్కిరిసి ఉంది.

హారతి సూట్‌కేసూ, ఎయిర్ బ్యాగూ దగ్గరగా పెట్టుకుని ప్లాట్‌ఫాం మీది సందడిని గమనిస్తూంది.

ప్రభాకర్‌కు జీవితం మరీ యాంత్రికంగా అనిపించడం ప్రారంభించింది. అతడు హారతితో తన వైవాహిక జీవితాన్ని గురించి ఎన్నెన్నో సుందర స్వప్నాలను ఊహించాడు.

సినిమా నాయకీనాయకుల్లా తమ జీవితం ప్రతిక్షణం ఉత్సాహభరితంగా, పంచరంగుల చిత్రంలా ఉంటుందని ఊహించుకున్నాడు.

ఉదయం లేస్తూనే ఎవరి పనులు వాళ్లు చూసుకుని హారతి ఆఫీసుకూ, తాను బ్యాంకుకూ వెళ్లడం, సాయంత్రం అలిసి ఇల్లు చేరిన హారతి ఇక తప్పదన్నట్లుగా ఆ పనీ ఈ పనీ చక్కబెడుతుంది. ప్రభాకర్ సినిమాకు వెళదామన్నా, షికారుకు వెళదామన్నా, కనీసం ఫ్రెండ్స్ ఇంటికి వెళ్ళడానికి కూడా ఆమె ఉత్సాహం చూపదు. ప్రభాకర్ మరీ మరీ అడిగితే "సారీ ప్రభా! నువ్వు వెళ్ళిరా. నాకు రావాలని లేదు" అంటూ మెత్తగా చెబుతుంది.

ఎన్నోసార్లు ప్రభాకర్ నిస్సహాయమైన కోపాన్ని అనుభవించాడు. "లైఫ్ మరీ రొటీన్‌గా ఉంది కదూ" అనేవాడు.

"నిజమే..." అనేది హారతి.

ప్రభాకర్ హారతిని ఇప్పటికీ 'నువ్వు' అనేందుకు సంకోచంగా ఫీలవుతాడు. అందుకే నువ్వూ, మీరూ కాకుండా సందిగ్ధంగా మాట్లాడుతాడు

"పోనీ ఓవారం సెలవు పెట్టి ఎక్కడికయినా వెళ్దామా?"

హారతి వెంటనే ఒప్పుకొంది.

ప్రభాకర్ ఏనుగెక్కినంతగా సంబరపడిపోయాడు. 'నేను రాను ప్రభా! నువ్వెళ్ళిరా' అంటుందనుకున్న హారతి అడిగిందే తడవుగా ఒప్పుకోవడంతో అతను ఉత్సాహంగా పొంగిపోయాడు. నిమిషాల మీద ప్రయాణపు ఏర్పాట్లు జరిగిపోయాయి.

హారతి తనకూ, ప్రభాకర్‌కూ కావలసిన బట్టలు సూట్‌కేస్‌లో సర్దింది.

"బావా, తొందరగా వచ్చేయండి" అంది సుజా.

ఆమె కళ్ళల్లో కొండంత దిగులు, బెంగ.

ఒకప్పుడు తాను గిరి దగ్గరకు వెడతానంటే గుండెల్లో కొండంత దిగులు దాచుకుంటూ, "త్వరగా వచ్చేయండి మేడం" అంటూ ప్రాధేయపడ్డ ప్రభాకర్ కనిపించాడు సుజా కళ్ళల్లో.

"సుజా, మరిచిపోకుండా ఆ ఇంటర్వ్యూకు అటెండ్ అవ్వు. అమ్మను

జాగ్రత్తగా చూసుకో" అప్పగింతలు పెట్టాడు ప్రభాకర్.

ట్రైన్ ప్లాట్‌ఫాం చేరుకుని 'బోయ్' మంటూ పెద్ద నిట్టూర్పు విడుస్తూ ఆగింది.

పుస్తకాల కోసం వెళ్ళిన ప్రభాకర్ కొరకు కళ్ళతోనే వెదుక్కుంది హారతి. ప్రభాకర్ ట్రైన్ పొడవునా చురుకుగా అడుగులు వేస్తూ రమ్మన్నట్లుగా హారతికి చెయ్యి ఊపాడు.

రద్దీగా ఉన్న జనసమూహాన్ని అతి లాఘవంగా తప్పుకుంటూ, నెట్టుకుంటూ పద్మవ్యూహంలోకి ఒంటిగా జొరబడ్డ అభిమన్యు కుమారునిలా కంపార్ట్‌మెంట్‌లోకి జొరబడ్డాడు.

హారతి చేతిలోని సూట్‌కేస్, ఎయిర్ బాగ్ అందుకుని ఆమె ఎక్కేందుకు సహాయం చేశాడు.

హారతి ఆ జనాన్ని చీల్చుకుని కంపార్ట్‌మెంట్ ఎక్కేందుకు చాలా శ్రమపడింది. సీట్లు వెదుక్కుని కూర్చునేసరికి అయిదు నిముషాలు పట్టింది. సందడి కాస్త తగ్గింది.

సీట్లు దొరికినవాళ్ళు కిటికీ దగ్గర సీటు తమకు దొరకనందుకు ఒకింత విచార పడుతూంటే, అసలు సీటు లేనివాళ్ళు గొణుక్కుంటూ దిక్కులుచూస్తున్నారు- ఎక్కడైనా కాస్త ఖాళీ దొరక్కపోతుందా అని. ట్రైనులో హారతి పక్కసీట్లో ఒక నడివయస్సు స్త్రీ ఆమె పక్కన ఆమె కూతురుకాబోలు ఓ పదహారేళ్ళ అమ్మాయి రన లేడి కళ్ళతో దిక్కులు చూస్తూ కూర్చుంది.

హారతి ఎదుటి సీట్లో ప్రభాకర్.

కనీసం ఇక్కడైనా జతగా ప్రయాణం చేసేందుకు లేకపోయింది.

ప్రభాకర్ కోడెమనస్సు ఉసూరుమంది.

ట్రైన్ కదిలింది.

ప్రభాకర్ హారతి దగ్గర్నించి మొదలు పెట్టి కంపార్ట్‌మెంటంతా ఒక్కసారి కలియజూశాడు. ఎదుటి సీటులోని అత్తయ్యగారి పదహారేళ్ళ చిన్నది ప్రభాకర్ వంక క్రీగంట చూస్తూ ఓ చిన్న నవ్వు విసిరింది.

తనను చూసికాదు అనుకున్న ప్రభాకర్ చుట్టూ దిక్కులు చూశాడు ఆ శాల్తీ ఎవరా- అని. మరి కాసేపటికి ఆ చిన్నది కొసరి కొసరి, తరచి తరచి తనను చూస్తూ చిరునవ్వుల పువ్వులు రువ్వుతూ, పమిట సవరింపుల హొయలు కురిపించడంతో తననే అని నిర్ధారించుకుని, మరి బాగుండదని ఓ పుస్తకం తీసి ముఖానికి అడ్డుగా పెట్టుకుని అలాగే మతులోకి జారిపోయి, పక్కమనిషి భుజంమీద తలవాల్చి 'ఆనందం'లో మునిగిపోయాడు.

'పట్టి నిద్రముఖం. పసికుర్రాడిలా ఎంత హాయిగా నిద్రపోతున్నాడు' మనస్సులోనే ముద్దుగా విసుక్కుంటూ నవ్వుకుంది హారతి.

పరుగులు పెడుతున్నట్లున్న చెట్లూ, చేమలూ పచ్చని నేలనూ, నీలి నీలి ఆకాశాన్నీ చూస్తూ కూర్చుంది హారతి.

"ఎందాకా?" పక్కావిడ మాటల్లోకి దించింది.

"హైదరాబాదు"

"బ్రాహ్మలా?"

"కాదు"

అడిగేవాడికి చెప్పేవాడులోకువ అనే సామెతను నిజం చేస్తూ పక్కావిడ ప్రశ్న మీద ప్రశ్న వేస్తోంది.

హారతికి విసుగ్గా ఉంది. కానీ పెద్దావిడ అడిగినప్పుడు చెప్పకపోతే బాగుండదని లేని ఓర్పు తెచ్చుకుంది.

"ఏం కులం?"

‘ఇంకా ఈరోజుల్లో కూడా ఈ కులాల పట్టింపు ఛాదస్తం ఏమిటి?’ అన్నట్లుగా మౌనంగా ఉండిపోయింది ఎటో చూస్తూ.

“ఏవిటూ?” ఆమె జవాబు చెప్పకుండా ఒదిలేలా లేదు.

చెప్పింది హారతి.

“మేమూ అదే” ఆమె చాటంత ముఖం చేసుకుని సంతోషంగా చెప్పింది.

అందులో అంత సంతోషించాల్సిన విషయం ఏముందో అర్థంకాలేదు హారతికి.

“ఫలానా వాసగుంటల రామనాథం గారు తెలుసా?”



"అరెరే! వానగుంటల రామనాధమే తెలీదా?"

ఎవడో, ఏమిటో, ఎందుకో ఈ వివరాలన్నీ ఈవిడకు కసిగా తిట్టుకుంది హారతి.

"పోనీ, వేవిళ్ళ గురునాథం తెలుసా?"

హారతిలో సహనం చచ్చిపోతోంది క్రమంగా.

'మహాతల్లీ నాకెనరూ తెలీదు. నీమీద ఒట్టు. ఇకనైనా నన్ను ఒదులుతావా? లేకపోతే ఈ ప్రయాణమంతా ఇలాగే పీడించుకు తింటావా!' హారతి మనస్సు కసిగా అరిచింది.

కానీ పైకి అలా అరిచేందుకు సభ్యత అడ్డువచ్చిన హారతి, "తెలీదు" అంది కాస్త కటువుగా.

కనీసం పుస్తకం చదువుకుంటూ కూర్చుంటేనైనా ఈ "నస" తగ్గుతుంది అనుకున్న హారతి వెంటనే పుస్తకం తెరిచి సీరియస్‌గా అందులోకే చూస్తూ కూర్చుంది.

"అవునులే ఎలా తెలుస్తుందీ? బస్తీలో కాపరాలు ఇరుగూ పొరుగే తెలీదు" సర్ది చెప్పుకుంది పక్కసీటు సాధ్వీమణి.

"అబ్బాయి ఏం చదువుకున్నాడూ?" ఆరాగా అడిగింది.

హారతి తెల్లబోయింది.

'అబ్బాయెవరూ?' అన్నట్లు ఆశ్చర్యంగా చూసింది.

ఆవిడ ప్రభాకర్ వైపు నింపాదిగా చూస్తూ తిరిగి అదే ప్రశ్న వేయడంతో, ఆ ప్రశ్న ప్రభాకర్ గురించే అని తెలుసుకుంది.

"అబ్బాయి ఏం చదువుకున్నాడూ?"

తను జవాబు చెప్పకపోతే ఆవిడెలాగూ ఊరుకోదు. అది ష్యూర్. మరలాంటప్పుడు చెప్పక తప్పేదేం ఉంది?

"బి.కాం చదివాడు" అంది హారతి చప్పున.

"ఏమైనా ఉద్యోగం చేస్తున్నాడా?"

తాను గబుక్కున ఈ కిటికీలోనుండి కిందికి దూకేస్తే ఎక్కడపడుతుంది అన్నట్లుగా కిందికి చూసింది హారతి.

"అబ్బాయి ఉద్యోగం చేస్తున్నాడా" ఆవిడ హారతి భుజంతడుతూ మరీ పిలిచి అడిగింది.

"అఁ... అఁ..."

"ఏం ఉద్యోగం చేస్తున్నాడూ?"

"బ్యాంకులో"

"ఎంతిస్తారేఁవిటీ...?"

"భగవంతుడా..." హారతి తలగట్టిగా పట్టుకు కూర్చుంది.

చెవిలో జోరీగలా "ఆవిడ ఎంతిస్తారేమిటీ?" అంది మళ్ళీ.

"ఎంతిస్తా..." ఆవిడ అడిగిందిమళ్ళీ.

"ఏడొందలు" నీరసం ముంచుకు వస్తోంది హారతికి.

"ఇంకా పెరుగుతుంది కదూ?"

"అఁ..." అంది నీరసంగా హారతి ఆవిడ మళ్ళీ అదే ప్రశ్న వెయ్యకముందే.

హారతికి నీరసంతో సోషవచ్చినట్లుగా ఉంది.

"ఎందుకు పెరగదూ? పెరుగుతుంది బ్యాంకులో ఉద్యోగమాయె"

"అమ్మాయ్ మా అమ్మాయిని చూశావుగా?

"ఎవరూ?" అంది అప్రయత్నంగా హారతి.

"ఇదిగో...ఇదే మా చిన్నముండ"

హారతి అప్రయత్నంగా ఆ పిల్లవైపు చూసింది.

చిన్నముండ తనలేడి కళ్ళతో ప్రభాకర్

నిద్రా సౌందర్యాన్ని కళ్ళతో తాగే స్తోంది.

"చూశావుగా? చిదిమి దీపం పెట్టుకో వచ్చు. అబ్బాయికోరిన కట్నం ఇస్తాను. వెండి కంచం,వెండి మరచెంబు. ఆడపడుచు కట్నాలూ, స్కూటరూ, ఫ్రిజ్జూలాంఛనా లన్నీ మామూలుగా ఉండేవేగా..."

"ఏమిటీ మీరనేదీ?" అర్థంకాక హారతి అసహనంగా ప్రశ్నించింది.

"అదేనమ్మా! అబ్బాయికి చెప్పి ఈ సంబంధం ఖాయం చేశావంటే నీ కష్టం ఉంచుకోను. పట్టుచీరా, ఒంటిరాయి ఉంగరం..."

"అబ్బా యెవరూ?" అంది అయోమ యంగా హారతి.

ఈసారి తెల్లబోవడం ఆ మహాసాధ్వి వంతయింది. తానింతగా చెబితే ఏమీ ఎరగనట్టు "అబ్బాయెవరూ?" అంటుం దేమిటీ నంగనాచిలా.

"అదేనమ్మా మీ మరిదికి చెప్పి ఈ సంబంధం..."

"మరిదా...?"

"ఈ అబ్బాయి మీ మరిది కాడూ? పోనీ మీ తమ్ముడేమో కాస్త చెప్పి ఈసంబంధం ఖాయం చేశావంటే పట్టుచీరా, ఒంటిరాయ ఉంగరం..."

ఆవిడ ఏమిటేవిటో చెప్పుకుపోతోంది. కళ్లు తిరిగినట్లయిన హారతి సీటుకు చేరగిల బడి కళ్ళుమూసుకుందినిస్త్రాణంగా. పక్క సీటు మహాతల్లి పట్టుచీర, ఒంటిరాయి, ఉంగరపు భజనతో పాటుగా రైలు సాగి పోతోంది — గమ్యం చేరే తొందరలో. చిన్న ముంద ప్రభాకర్ నిద్రాసౌందర్యాన్ని చూసి చూసి అటునుండి రెస్పాన్సు లేని కారణంగావిసుగు పుట్టి మరో అందమైన ముఖం వెదుక్కునేందుకు చూపులు తిప్పుకుంది.

* * *

కౌంటర్‌లోకూర్చున్న మేనేజర్ దగ్గరకు నడిచిన ప్రభాకర్, "రూం ఉందా?" అని అడిగాడు.

"సింగిల్ రూమా ? డబుల్ రూమా సార్ ?"

"సింగిల్ రూం"

హోటల్ మేనేజర్ రిజిస్టర్ తిరగేసి "రూం నెంబర్ ట్వెల్వ్ ఖాళీగా ఉంది సార్" అన్నాడు

ప్రభాకర్ అడ్వాన్సు చెల్లించాడు.

మేనేజర్ రిజిస్టరు ప్రభాకర్ ముందు పెట్టి డబ్బు డ్రాయర్‌లో వేసుకున్నాడు.

ప్రభాకర్ వివరాలు రాసి సంతకం చేశాడు.

"మిస్టర్ అండ్ మిసెస్ ప్రభాకర్" మేనేజర్ పెద్దగా చదువుతూ కొంచెం దూరంలో నిలబడ్డ హారతి వంక ఎగాదిగా చూశాడు.

"సార్! మీరు హోటల్ 'సిట్వీ'కి వెళ్ళండి. మీకు అనుకూలంగా ఉంటుంది."

అతని భావమేమిటో అర్థంకాని ప్రభాకర్ "అంటే?" అన్నాడు అయోమయంగా.

"అంటే ఏముందిసార్! మా హోటల్ అలాంటిదికాదని చెబుతున్నాను. అంతే" మేనేజర్ చాలా సీరియస్‌గా చెప్పాడు మళ్ళీ అదే విషయాన్ని.

"కాస్త అర్థమయ్యేలా చెప్పండి" ప్రభాకర్ స్వరం తీవ్రంగా ఉంది. కాస్త దూరంలో నిలబడ్డ హారతికి అసలు విషయమేమిటో అర్థంకాలేదు. ప్రభాకర్ రెచ్చిపోవడం చూసి భయపడిపోయింది.

"ఇది మర్యాదస్తులు ఉండే హోటల్ సార్! మీరు ఆడవాళ్ళనెవర్నో తెచ్చి

రూంలో ఉంచడానికి మా మేనేజ్ మెంట్ ఒప్పుకోదు"

"షి ఈజ్ మై వైఫ్. అండర్‌స్టాండ్" ప్రభాకర్ గట్టిగా అరిచాడు. ఆవేశంతో అతని పిడికిళ్లు బిగుసుకున్నాయి.

"మీరు అలాగే రాశారు. నిజమే కానీ ఈ రోజుల్లో ఎవరంత గుడ్డిగా ఉన్నారు చెప్పండి" మేనేజర్ చిరునవ్వులో వ్యంగ్యం చూసిన ప్రభాకర్‌కు మనస్సు స్వాధీనం తప్పిపోయింది.

"యూ...రాస్కెల్. వాట్ రబ్బిష్ యూఆర్ టాకింగ్. షి ఈజ్ మై వైఫ్.



మైండ్ ఇట్" ప్రభాకర్ చేతులు పైకి మడిచాడు మీది మీదికి వెడుతూ.

"కాస్త మరియాదగా మాట్లాడండి. హోటల్లో తాగివచ్చి గొడవచేస్తున్నాడని పోలీసులను పిలిపించి న్యూసెన్సు కేసు పెట్టించగలను జాగ్రత్త"

ఇద్దరి రంకెలకూ నలుగురూ పోగ య్యారు-ఏమిటంటే ఏమిటని.

"చూడండీ! ఆవిణ్నెవరో నా భార్యంటూ తెచ్చి గదిలో పెడితే పోలీస్ రైడ్ జరిగితే మేమేంకావాలి? మా హోటల్ పరువేం కావాలి? ఇలాంటి న్యూసెన్సు మా హోటల్లో సరిపడదు. ఇంకో హోటల్‌కు పోవయ్యాబాబూ అంటూ అడ్రసు కూడా చెప్పాను. కాదూ కూడదూ ఇక్కడే కావా లంటూ తగాదాకు వస్తున్నాడు"

నలుగురూ ప్రభాకర్‌నూ, హారతినీ మార్చిమార్చి చూశారు. సిగ్గుతో చితికి పోతున్న హారతి తల భూమిలోకి కూరుకు పోయింది.

"మళ్ళీ అదేమాట. ఆమె నా భార్య అంటే కాదనడానికి నువ్వెవడివి ? మర్యా దస్తులను ఇలా అల్లరిపెడుతున్నందుకు నీమీదా, నీ హోటల్ మీదా ఇప్పుడే పోలీస్ కంప్లైంట్ ఇస్తాను" రెచ్చిపోయిన ప్రభాకర్ రంకెలు వేస్తున్నాడు.

నలుగురూ కలిసి ఇద్దరికీ నచ్చజెప్ప డంతో ఇద్దరూ బుసలుకొడుతూనే రాజీకి వచ్చారు.

హారతి, ప్రభాకర్ రూంలోకి ప్రవే శించారు.

రూంలోకి వస్తూనే మంచానికి అడ్డం పడి వెక్కివెక్కి ఏడుస్తున్న హారతిని ఎలా ఓదార్చాలో అర్థంకాని ప్రభాకర్ స్థాణువులా కుర్చీలో కూర్చుండిపోయాడు.

రాస్కెల్ నలుగురిలో ఎంత అవమానం చేశాడు?

ఆవేశంతో ప్రభాకర్ దౌడ కండరాలు బిగుసుకున్నాయి.

'అప్పటికప్పుడు వెళ్లి నాలుగు తగి లించి వద్దామా'-అన్న ఆలోచన బల వంతాన ఆపుకుని హారతివైపు చూశాడు.

దిండులో తల దూర్చి వెక్కివెక్కి ఏడుస్తోంది హారతి.

హారతితో కలిసి 'హనీమూన్' అను భూతి పొందుతూ తనివితీరా ఆనందిద్దామని వచ్చిన ప్రభాకర్ ఈ సంఘటనతో గాలి తీసిన తిత్తిలా ఉసూరుమన్నాడు.

అడుగులోనే హంసపాదన్నట్లు వచ్చి రాకుండానే ఈ గొడవ ఏమిటి? ఉన్న ఊళ్ళో హారతి తనతో బయటికి రాదు. ఇక్కడైతే స్వేచ్ఛగా, జంట పక్షుల్లా తిరగొచ్చనుకుంటే... ఎక్కడైనా ఇంతే! తనకింతే ప్రాప్తమేమో.

ఈ పెళ్ళి చేసుకుని తను తొందర పడ్డాడా?

మొదటిసారిగా ఆలోచనలో పడి పోయాడు ప్రభాకర్.

* * *

ఐస్ పార్లర్‌లో పక్కపక్కనే కూర్చుని డ్రింక్ తీసుకుంటున్నారు హారతి, ప్రభాకర్.

ఊరంతాతిరిగి అన్నీ చూసిరావడంతో అలసటగావుంది హారతికి.

చూసిన స్థలాల్లో తాను గమనించిన అంశాలను గురించి ఉత్సాహంగా చెబు తున్నాడు ప్రభాకర్.

వెయ్యి స్థంభాల గుడి ఎంతగానో నచ్చింది హారతికి.

నల్లరాతితో తళుకులీనుతున్న ఆ శిల్పసౌందర్యాన్ని ముగ్ధురాలై చూసింది. ఇతర యాత్రాస్థలాలూ, దేవాలయాల్లా

కాకుండా అక్కడ ఉన్న ప్రశాంతత, నిర్మలత్వమూ, పరిశుభ్రతా ఆమెకు మరీ మరీ నచ్చాయి. మనస్సుకు ప్రశాంతి నిచ్చింది.

ఆ ఆలయ పరిసరాలూ, ప్రశాంతతా వదిలి రావాలనిపించక చాలా సమయాన్ని అక్కడే గడిపింది.

"దేవీ: ఆలయంలో శిల్పి ప్రియురాలి శిల్పం ఎక్కడో ఉంది అని చెబుతారు. నువ్వేమయినా చూశావా?"

"ఏమో: అన్ని శిల్పాలలో ఏది అతని ప్రియురాలి శిల్పమని గుర్తుపడతాం?"

"ప్రతిశిల్పికీ విధిగా ఒక ప్రియురాలు ఉంటుందన్నమాట" డ్రింక్ సిప్ చేస్తూ నవ్వుతూ అన్నాడు ప్రభాకర్.

నవ్వేసింది హారతి.

నిజమే. ప్రతి రసహృదయానికీ పరిపూర్ణతఇచ్చే ఒక స్ఫూర్తి కావాలి. ఆ స్ఫూర్తి నుండే కళారాధన, కళోపాసన జరుగుతుంది. స్ఫూర్తి లేని ఏ కళాకారుడూ రాణించలేడు. కళాకారుడుగా చిరకాలం జీవించలేడు. మహాకవి జక్కనాచార్యుల విశ్వకళాసృష్టికి స్ఫూర్తిని కలిగించింది- అపురూప సౌందర్యరాశి,లావణ్యరూపిణి, సజీవ శిల్పసుందరి 'సౌపర్ణీ దేవి'. భువన మోహనమైన ఆమె రూప లావణ్యాలే జక్కనాచార్యుల అజరామరమైన శిల్ప సృష్టికి ఆధారం.

అప్రయత్నంగా తలఎత్తి చూసింది హారతి.

గోడలనిండుగా అంగుళం ఖాళీ లేకుండా నిలువెత్తుఅద్దాలు... అనేక ప్రతిబింబాలు. ఆ ప్రతిబింబాలకు తిరిగి ప్రతిబింబాలు. హారతి చూడకూడదనుకుంటూనే తన ప్రతిబింబాన్ని నిశితంగా చూసుకుంది. తలలో ఎక్కువగానే కనిపిస్తున్న తెల్లవెంట్రుకలను పలుచబడిన జుట్టు దాచలేకపోతోంది. కళ్లు విశాలంగానే ఉన్నా ఆ కళ్ల కింద కొట్టొచ్చినట్లు కనిపిస్తున్న నల్లని వలయాలు... జారిన బిగువులూ... పాలిపోయి అరుణిమను కోల్పోయిన చెంపలూ... పెదవులూ తను... తను రంగువెలసిన బొమ్మ!

రాబోయిన నిట్టూర్పును బలవంతంగా ఆపుకుంటూ తనపక్కనే ఉన్న ప్రభాకర్ ప్రతిబింబం వైపు చూసింది. కొంచెం సన్నగా అనిపించే చాకులాంటి శరీరపు తీరు, నల్లగా, వత్తుగాఉన్న జుట్టూ; ఉత్సాహాన్ని నింపుకున్న కనుదోయీ, నవ్వే పెదవులూ..అందం, ఆరోగ్యం,యవ్వనం కలబోసిన పురుష విగ్రహంలా ఉన్న ప్రభాకర్ ప్రతిబింబాన్ని చూస్తూ వస్తున్న నిట్టూర్పును బలవంతంగా కూడా ఆపలేక పోయింది హారతి. అతని పక్కన తాను నిజంగా రంగువెలసిన బొమ్మలాగే ఉంటుందేతప్ప మరోలా వుండదు.

'ఇలా జరగకుండా ఉండాల్సింది...' తలవంచుకుని ఓరగా అతనివైపుచూసింది.

ప్రభాకర్ చూపులు అద్దంలోని ప్రతిబింబాలను నిశితంగా పరిశీలిస్తున్నాయి.

ఎంట్రెన్సువైపు చూపుతిప్పిన హారతి అప్పుడే హాల్లోకిప్రవేశిస్తున్న ఒక నడికారు వ్యక్తినిచూసి ఆశ్చర్యంతో రెప్పవాల్చడం కూడా మరిచిపోయింది. "వేణూ"అంటూ అస్పష్టంగా గొణిగాయి ఆమె పెదవులు. ఆమెకళ్లలో క్షణకాలం ఆనందం మెరిసి మాయమయ్యింది.

తనముఖం కనిపించకుండా పూర్తిగా తలవంచుకొని ఓరగాగమనిస్తోంది. వేణుకు చెంపలదగ్గర జుట్టు అప్పుడే కొంచెం కొంచెం తెల్లదనాన్ని ఆహ్వానిస్తూ అతని వయస్సును బాహాటం చేస్తోంది.

కళ్లకువెలసిన చత్వారపు జోడూ.... కొంచెంగా పెరిగిన శరీరమూ, దానికితగ్గ పొట్టా...!

ఒకప్పుడు వేణురూపం ఇలా వుండేది కాదు. ప్రథమ వీక్షణంలోనే అతనిరూపం తనను ఆకట్టుకుని అతనివైపు ఆకర్షించింది. అందం.. అందాన్ని మించి కన్నె హృదయాలను గిలిగింతలు పెట్టగల ఆకర్షణ... అన్నింటినీమించి మృదువైన స్వభావం తనను వేణుకు దగ్గర చేశాయి. ఆనాడు తాను పడిన తొందరపాటుకూ, చూపించిన వెర్రివ్యామోహానికీ ఆ స్థానంలో ఏ మగవాడు ఉన్నా తనను పిచ్చిదానిలా వెంట తిప్పుకుని తన అవసరాలను తీర్చుకుని మరీ వదిలేసేవాడు. అంత పవిత్రంగా తనను మిగిల్చేవాడు గాదు. తన సమస్యలను సూటిగా, నిక్కచ్చిగా చెప్పి తన జీవితం నుండి తొలగిపోయాడు. మళ్ళీ ఇన్నాళ్ళకు... ఇన్నేళ్ళకు.

వేణు లోపలికి వచ్చేశాడు. అతని వెంట ఇద్దరు పిల్లలతో పాటుగా ఒక స్త్రీ కూడా ఉండటంతో, వాళ్లు అతని భార్యాబిడ్డలుగా ఊహించుకుంది హారతి. పాపా, బాబూ అందంగా, ఆరోగ్యంగా, ముద్దుగా ఉన్నారు. ఆ స్త్రీ కూడా సామాన్యమైన అందంతోనే ఉన్నా గృహిణికి కావలసిన నిండుదనంతో హుందాగా ఉంది.

పెద్ద బోర్డర్ ఉన్న పట్టు చీర కొంగు భుజం నిండుగా కప్పుకొంది. పట్టు కుచ్చులా ఉన్న వెంట్రుకలు అందంగా ముడిచిన ముడిలో తురిమిన ఒకే ఒక గులాబీ తన అదృష్టాన్ని చాటుతోంది గర్వంగా. ఆమెను చూస్తూనే గౌరవం ఉట్టిపడేలా ఉంది.

'వేణు అదృష్టవంతుడే! చక్కని భార్య దొరికింది' అనుకుంటూ తనవేపు చూసుకుంది.

తను వయస్సును దాచుకునేందుకు చేస్తున్న ప్రయత్నం ప్రతివిషయంలోనూ బయటపడుతూనే ఉంది. అతి పలుచగా ఉన్న రోజ్ కలర్ ప్రింటెడ్ అమెరికన్ జార్జెట్ చీరా, లోపల బ్రా కనిపించేలా పలుచగా ఉన్న జాకెట్, సవరం పెట్టి వదులుగా అల్లిన జడలో బుట్టెడు పువ్వులూ, గోళ్ళకు రంగూ,ముఖాన రోజ్ కలర్ బొట్టూ, చెవులకు ఆధునికంగా కనిపించే పోగులూ... తన అవతారం తనకే చీదరగా, ఎబ్బెట్టుగాఅనిపించిందిహారతికి. ఇంత వేషం వేసినా తనకున్న వయస్సు దాగకపోగా, ఈడుకు మించిన షోకులు... చూసే వారికి ఎబ్బెట్టుగా కనిపిస్తూ రోత కలిగేలా ఉంది. 'ఇలా ఉంటే చిన్నదానిలా కనిపిస్తావు' అంటాడు ప్రభాకర్. ఈ విషయంలో తను ఎలాంటి ఆర్గ్యూ చెయ్యదు.

అతనికిష్టం అయినట్లుగానే అలంకరించుకుంటుంది - తనకు ఇష్టం లేకపోయినా.

ఇప్పుడు వేణు భార్యను చూస్తోంటే తన వేషం ఎంత అసహజంగా, జుగుప్సాకరంగా ఉందో అద్దంలో చూపినట్లయింది హారతికి.

"పాపా, హరీ! ఇలారా.. ఇలా వచ్చి కూర్చో" వేణు పాపను పిలుస్తున్నాడు.

హారతి ఉలిక్కిపడింది. 'హరి హరి' ఆమె పెదవులు అస్పష్టంగా కదిలాయి. వేణు కుటుంబంతో సహా వచ్చి హారతికి ఎడమ వైపుగా ఉన్న సీట్లలో కూర్చున్నాడు. అతనికి తన ముఖం కనిపించకుండా పక్కకు తిరిగి కూర్చుంది హారతి.

"సరూ! నువ్వేంతీసుకుంటావు? పాపా హరీ..నీకేం కావాలిరా! అరే చిన్నా మనం ఐస్‌క్రీం తిందాం"

వేణు పేరు పేరునా అడుగుతూ ఉత్సాహంగా కబుర్లు చెబుతున్నాడు. 'వయస్సు తెచ్చిన చిన్న చిన్న మార్పులు తప్ప వేణులో అప్పటికి, ఇప్పటికి మార్పు లేదు అనుకుంది' హారతి.

అదే ఉత్సాహం...అదే చురుకుదనం. మనస్సు మెత్తన, మాట మెత్తన-కుటుంబాన్ని ఎంత అపురూపంగా చూసుకుంటున్నాడు!

అంతా సవ్యంగా జరిగి ఉంటే...

జీవితాన్ని ఒక పద్ధతి ప్రకారం ప్రిన్సిపుల్డ్‌గా నడుపుకునేవాళ్ళకు మాత్రమే అలాంటి సుఖసంతోషాలు అందుతాయి.

ఎలాంటి ప్రలోభాలకూ లొంగని మన స్థయిర్యమే వాళ్ళకలాంటి సుఖసంతోషాలనూ, శాంతిభద్రతలనూ అందిస్తుంది.

ప్రతి గాలి అలకూ చిగురుటాకులా కంపించిపోయే తనకు ఎప్పటికీ సుఖం ఉండదు, శాంతి ఉండదు.

"మమ్మీ, నాకు మరో ఐస్ క్రీం ఇప్పించవూ?"

"మమ్మీ, మమ్మీ! నాకుకూడా" పాప గారం.

తండ్రి అంత అపురూపంగా చూస్తున్నా పిల్లలు తల్లి ఒడిలోనే తల దాచుకుంటారు.

అన్నీ సవ్యంగా జరిగే ఉంటే...

రత్నాల వంటి ఈ బిడ్డలకు తాను...!

హారతిలో మును పెన్నడూ లేనిమాతృత్వపు వాంఛ అలలా ఎగిసిపడి గుండెలను ముంచెత్తింది.

"సరూ! ఇటునుండి ఇటే సినిమాకు వెడదాం. ఆ తరువాత ఝామ్మంటూ హోటల్లో భోంచేసి ఇంటికి చెక్కేద్దాం. ఆ తరువాత... ఆ తరువాత పిల్లలు చూడకుండా..."

అతడు ఆమెకు కన్ను గీటడం అటు సరోజ దృష్టినే కాకుండా, ఇటు హారతి దృష్టిని కూడా ఆకర్షించింది.

'హుష్...పిల్లలున్నారు' అన్నట్లుగా సరోజ అతన్ని కనుసైగలతోనే వారించింది.

"ఏమిటీ, ఈవేళ క్లినిక్‌కు వెళ్ళరా?"

"పోనిద్దూ వెధవ క్లినిక్. ఈరోజు నాకు చాలా ముఖ్యమయినరోజు"

"ఏవిటో అంతముఖ్యం?అయినా మీరు వెళ్ళకిపోతే పాపం మీ ఆడపేషంట్స్ బెంగపెట్టుకుంటారేమో" నవ్వుతూ, కవ్విస్తూ అంది సరోజ. కొంటెతనానికి భర్తను కవ్విస్తున్నట్లుగా ఉంది ఆమె వాలకం.

భార్య కొంటెతనానికి వేణు మనసారా నవ్వుకున్నాడు.

"సరూ! ఇది నీకు ఎన్నో పుట్టినరోజు?"

"యాభయిమూడును తిరగేస్తే ఎంతో అంత.సరేనా? అయినా ఆడవాళ్ళవయసు, మగవాళ్ళజీతం అడిగినవాళ్లను ఉరి తీస్తారట తెలుసా?" నవ్వుతూ అంది సరోజ.

"కాదులేవోయ్! ముప్ఫై అయిదేళ్లు వచ్చినా ఇంకా నీలో పదహారేళ్ళ చిలిపితనం, ఉత్సాహం, చురుకుతనం పోకపోతేనూ...అనుమానం వచ్చిందిలే".

పరిసరాలను కూడా మరిచిపోయేలా చేస్తున్న అన్యోన్య దాంపత్యం ... ముచ్చటైన సంసారం!

ఈడూ, జోడూ కుదిరిన ప్రతి దాంపత్యం ఇంత అన్యోన్యంగా కాకపోయినా దగ్గరదగ్గర అలాగే ఉంటాయి ఆనందప్రవాహంలా.



ఆలోచనల్లో మునిగిపోయిన హారతి, "దేవీః ఇక వెడదాంపద" అన్న ప్రభాకర్ గొంతు విని తృళ్ళి పడింది.

అదేక్షణంలో ఇటుతిరిగి చూసిన వేణు కళ్లు హారతి కళ్ళతో కలుసుకున్నాయి క్షణకాలం.

వేణు చటుక్కున లేచి నుంచున్నాడు.

హారతి చూపులు తిప్పుకొని రెండడుగులు వేసింది వెళ్ళేందుకు.

"మీరు...మీరు హారతిగారు కదూ?"

రెండడుగులు ముందుకువేసి ఆమెకు అడ్డుగా నిలబడి అడిగాడు.

"కాదు.." అంటూ చకచకా ముందుకు నడిచింది హారతి. ఆమెకు వేణుతో మాట్లాడి తన జీవితంలో అప్పటినుండి ఇప్పటివరకు వెంటాడుతున్న అపశృతిని తెలియజెయ్యాలని లేదు. అందుకే మరో మాటకుకూడా అవకాశం ఇవ్వకుండా వీధి లోకి వచ్చేసింది.

హారతినీ, వేణునీ మార్చిమార్చిచూస్తూ అయోమయంగా నిలబడ్డ ప్రభాకర్ హారతి రోడ్డుమీదికి వెళ్ళడం చూసి గబగబా బిల్లు చెల్లించి వెళ్ళి ఆమెను కలుసుకున్నాడు.

"అతను నీకు తెలుసా?" రిక్షాలో వెడుతూండగా ప్రభాకర్ ప్రశ్నించాడు.

"ఊఁ....."

"మీ క్లాస్‌మేటా?"

"ఉహుఁ"

"ఎవరు....?"

"మా ఫామిలీ డాక్టర్"

"మరి అతను గుర్తుపడితే కాదన్నా వేం?"

"ఊఁ..ఉహుఁ...ఏం లేదు. ఊరకనే" అన్యమనస్కంగా జవాబులు ఇస్తున్న హారతిని మరి పలకరించలేదు ప్రభాకర్.

సినిమాహాల్లో బాల్కనీ మెట్లు ఎక్కుతున్న హారతి, 'హారతీ' అంటూ ఎవరో పిలవడంతో అప్రయత్నంగా తలతిప్పి చూసింది. వెనుకగా కుటుంబంతో సహా వస్తూన్న వేణు.

పట్టుబడిన దొంగలా భిన్నురాలయి నిలబడిపోయింది.

వేణు రెండడుగుల్లో ఆమెను చేరు కున్నాడు.

అతనికళ్ళు ఆనందంతోనూ, ఆశ్చర్యం తోనూ వింతగా మెరుస్తున్నాయి.

"హారతిగారూ – ఇందాక అలా అన్నారే! ఏమిటి? నాకళ్ళు నన్ను మోసం చేస్తున్నాయా అని ఎంత గింజుకు పోయానో తెలుసా. భలే జోక్ చేశారు. ఇంతకూ ఎందుకలా అన్నారు?"

హారతిముఖం రక్తంఅంతా ఆవిరిగా మారినట్లు పేలవంగా ఉంది.

సరోజా, పిల్లలూ వచ్చేశారు.

"ఇంతకూ హారతిగారూ! నన్ను గుర్తుపట్టారా? నేను వేణును. మీ వాలకం చూస్తే నన్ను గుర్తుపట్టనట్లో, లేక మరిచి పోయినట్లో ఉంది. అన్నట్లు మరిచే పోయాను. ఈమె నా బెటర్ హాఫ్ సరోజ. మా బంగారుతల్లి 'హరిత', వీడు మా చిచ్చింద్రీ వినయ్"

సరోజ నమస్కరించింది. "నమస్తే ఆంటీ" అన్నారు పిల్లలిద్దరూ ముద్దు ముద్దుగా.

"అన్నట్లు ఇప్పుడెక్కడుంటున్నారు? కృష్ణ మూర్తి గారు బాగున్నారా? పిల్లలెంతమంది? మూర్తిగారు రాలేదా? ఈ అబ్బాయి మీ తమ్ముడు గిరి అనుకుంటాను. ఎప్పుడో చిన్నతనంలో చూశాను! అన్నట్లు మేం ఇక్కడే సెటిల్ అయ్యాం. మీరూ, కృష్ణమూర్తిగారూ ఒకసారి మా ఇంటికి రావాలి" వేణు గల గలామాట్లాడేస్తున్నాడుఅతిసంతోషంతో.

హారతి ఊఁ, ఆఁ తప్ప ఎక్కువగా మాట్లాడలేక పోతోంది.

"అన్నట్లు పిల్లలెంత మందీ? ఏం చదువుతున్నారూ?"

"లేరు" ముభావంగా సమాధానం చెప్పింది హారతి.

"అరెరే, మీరిలా డల్‌గా ఉండడానికి కారణం అదన్నమాట. ఒక్కసారి కృష్ణమూర్తిగారిని తీసుకుని హాస్పటల్‌కు రండి. ఇద్దరినీ ఒక్కసారి చెక్ చేస్తాను. ఏమైనా కాంప్లికేషన్సు ఉంటే సరిచేయొచ్చు

నేను రమ్మన్నానని చెప్పండి. తప్పకుండా వస్తారు''

హారతి సిగ్గుతో చితికిపోయింది.

సినిమా మొదలయ్యీ కాకముందే, ''తల నొప్పిగా ఉంది. వెళ్ళిపోదాం'' అంటూ ప్రభాకర్‌ను లేవదీసింది హారతి.

''వెళ్ళొస్తామండీ'' అంటూ ముక్తసరిగా చెప్పి బయటికి వెళ్ళిపోతున్న హారతిని ఆశ్చర్యంగా చూస్తుండిపోయాడు వేణు.

''ఎంతగా మారిపోయింది.?'' రాబోతున్న నిట్టూర్పును బలవంతంగా ఆపుకున్నాడు వేణు.

ఆ తరువాత అతడు సినిమా ఎంజాయ్ చెయ్యలేనంతగా అప్‌సెట్ అయ్యాడు. ఆమె కనిపించిన క్షణంలో తనభర్తలో కలిగిన ఉత్సాహాన్ని చూసి ఈవిడెవరో ఆయనకు బాగా తెలుసు అనుకుంది.

ఆమె ముభావం, ముక్తసరితనం అతన్ని గాయపరచిన వైనం సరోజ గమనిస్తూనే ఉంది. అందుకే ''ఎవరండీ ఆవిడా?'' అంటూ ప్రశ్నించింది.

''హారతి''

''ఆ విషయం డ్రింక్ షాపులోనే తెలిసింది. ఆవిడ మీకెలా తెలుసూ?''

''కృష్ణమూర్తి నాకు ఫ్రెండ్. ఈమె ఇదివరలో ఇలా ఉండేది కాదు. పసితనపు అమాయకత్వంతో చాలా నిర్మలంగా ఉండేది.వయస్సుతో పాటు గర్వం కూడా పెరిగి ఉంటుంది''

''ఆవిడకు గర్వం అని ఎందుకనుకుంటున్నారు?''

''చూస్తుంటే తెలవడంలా? గుర్తుపట్టినా పట్టనట్లు వెళ్ళిపోవడం, ఇంతకాలానికి కలుసుకున్నామా - అంటీముట్టనట్లు ఆ సమాధానాలు. ఇంటికి రమ్మని పిలిచానే కనీసం మాట వరసకైనా వస్తామని అందేమో చూడు. మనతో మాట్లాడేందుకు ఇష్టం లేకనే సినిమా మొదటిలోనే వెళ్ళిపోయింది. ఇంతకంటే ఏం కావాలి గర్వం అనుకునేందుకు?'' గాయపడిన హృదయం తాలూకు అవ్యక్తమైన బాధ అతనిలో నిండిఉంది. వయస్సులో ఉన్న మానసిక స్థయిర్యం,గాంభీర్యం వయస్సు పైబడుతున్న కొద్దీ సన్నగిల్లుతాయి. అదే వేణులో వచ్చిన, వయస్సు తెచ్చిన పెద్ద మార్పు. ఇదే హారతి వయస్సులో ఉండగా ఇలా ప్రవర్తించి ఉంటే ''ఆఫ్టరాల్'' అనుకునేవాడు నిర్లక్ష్యంగా.

కానీ మనస్సు మూలల్లో అతిభద్రంగా దాచుకున్న మధురమైన మమతల మీద దెబ్బతీసినట్లుగా బాధపడుతున్నాడు.

తనహృదయంలో దాచుకున్న రహస్య చిత్రాలను వెలికిలాగి రంగులన్నీ చిందర వందరగా వెదజల్లినట్లుగా గింజుకుంటున్నాడు.

ఆ ఉక్రోషం మాటల్లో వెళ్ళగక్కే వరకూ అతనికి శాంతి లేకపోయింది.

''ఆమె మీతో మాట్లాడకపోవడానికి కారణం గర్వం కాదు. బిడియం... సంకోచం''

''అబ్బ.. ఈ ఆడవాళ్ళు వాళ్ళకిష్టం అయితేచాలు ఎంతగా సమర్థిస్తారో.బిడియపడేందుకు నేనేమీ ఎన్నడూ చూడని మనిషినా, కొత్తవాడినా?''

''మీదెప్పుడూ ఒకే దృష్టి. బిడియం అంటే నా దృష్టిలో కన్నెపిల్లలకుండే సిగ్గుకాదు.ఆవిడ జీవితంలో ఏదో అపశృతి ఉంది. మీతో మాట్లాడి అది బయట పెట్టుకోడం ఇష్టం లేక సంకోచపడింది''

వేణు మౌనంగా వింటున్నాడు.

''కృష్ణమూర్తి ఎవరూ?''

"ఆమె భర్త అయిఉండాల్సినవాడు''

''మరి ఆమె పక్కనున్న ఆ అబ్బాయి ఎవరూ?"

''ఆమె తమ్ముడనుకుంటాను. ఎప్పుడో చిన్నతనంలో చూశాను. పోలికలు సరిగ్గా గుర్తులేవు''

''ఆ అబ్బాయి ఆమె తమ్ముడుకాదు''

''నీకెలా తెలుసూ? ఆమెను ఇంతకు ముందు ఎరుగుదువా?" ఆశ్చర్యంగా అడిగాడు వేణు.

''ఊహుఁ ఆ అబ్బాయి ఇంతక్రితం ఐస్‌పార్లర్‌లో ఆమె కాలు తొక్కుతూంటే



చూశాను. భార్యాభర్తలూ, ప్రేమికులూ తప్ప అలా ఎవరుంటారు?"

"అంటే...అంటే" వేణు ఆలోచనల్లో పడిపోయాడు.

"ఆ అబ్బాయి ఆమెకు ప్రేమికుడో లేక భర్తో అయిఉంటాడు. అంటే హారతికి కృష్ణమూర్తితో పెళ్లికాలేదా?"

తనలోతాను అనుకుంటున్నట్లుగానే పైకి అనేశాడు వేణు.

"అయితే ఆమెకు కృష్ణమూర్తితో పెళ్లి అయిన విషయం మీకు ఖచ్చితంగా తెలీదా?"

"అయిన విషయం తెలీదు కానీ హారతికి ఖచ్చితంగా కృష్ణమూర్తితోనే పెళ్ళవుతుందనుకున్నాను''

"మీ ఊహలూ మీరూ. ఇందాక మీరు ఆవిడముందు మాటిమాటికీ కృష్ణమూర్తి కృష్ణమూర్తి అంటుంటే అవుననీ-కాదనీ చెప్పలేక ఆవిడెంతగా ఇబ్బంది పడ్డారో మీరు గమనిస్తేగా? మీ ధోరణే మీది"

ఆ తరువాత భార్యాభర్తలిద్దరూ అస్వాభావికమైన హారతి ప్రవర్తనా, ఆమె అలంకరణా, అందుకుగల కారణాల గురించీ చాలాసేపు చర్చించుకున్నారు.

మాట్లాడుతూ మాట్లాడుతూనే నిద్ర పోయింది సరోజ.

'పూర్ హారీ ఐపిటీయూ. నీ జీవితంలోని అపశ్రుతికి నేను కారణం అయితే, తెలిసో తెలియకో నీకేమయినా ద్రోహం చేసిఉంటే నన్ను క్షమించు.

నిన్ను గుండెల్లో దాచుకునేందుకూ నీకు ఓదార్పు, రక్షణ ఇచ్చేందుకూ అప్పుడూ ఇప్పుడూ అశక్తుణ్ణే'

వేణు కంటినుండి ఓ కన్నీటిబిందువు జారి దిండులోకి ఇంకిపోయింది. హారతితో తనకున్న అనుబంధం లీలగా మనసులో మెదిలింది.

* * *

"హలో"

"హలో నేను డాక్టర్ వేణును మాట్లాడుతున్నాను. మీరెవరు?"

"చెప్పుకోండి చూద్దాం'' చిన్నగా నవ్వు వినిపించింది ఫోన్‌లో.

వేణు పెదవుల మీద చిరునవ్వు మెరిసింది. అతని గుండెల్లో ఓ ఉత్సాహపు పొంగు తొంగిచూసింది.

"అబ్బే మీరెవరో తెలీడంలేదండీ! కాకపోతే స్వరం మాత్రం..." ఆగిపోయాడు వేణు.

"చెప్పండీ...స్వరంమాత్రం?''

"కోపం తెచ్చుకోరుగా" భయపడుతూన్నట్లుగా అడిగాడు వేణు.

''లేదులే చెప్పండి''

"స్వరం మాత్రం శూర్పణఖలా ఉంది. మరి మీరెవరో?" అన్నాడు అల్లరిగా.

"ఏమిటీ? నేను...నేను శూర్పణఖనా?'' అవతలిగొంతు ఖయ్‌మంది.

''పొరపాటు పొరపాటు. ఆండాళమ్మగారి అమ్మమ్మ గొంతులా ఉంది"

"అసలు మీ ఉద్దేశం ఏమిటీ? ఒకసారి శూర్పణఖ అంటారు. మరోసారి మరొకటంటారు"

''సారీ సారీ. మీ గొంతు సత్యభామదేవి మధుర స్వరంలా మధురంగా ఉంది"

''మీరెప్పుడు విన్నారు సత్యభామ మధురస్వరం" చిన్నగా నవ్వుచప్పుడు.

"మొన్న ఓ ఫంక్షన్‌లో విన్నానులెండి. ఇంతకూ మీరు అచ్చు సత్యభామదేవి గారేనా"

"ఊహుఁ...నేను ఆండాళమ్మగారి

బొమ్మగారిని" ఉడుక్కుంటూన్నట్లుంది అపతలిగొంతు.

"ఇంతకూ హారతిగారూ...ఏమిటీ విశేషాలు? కృష్ణమూర్తిగారు బాగున్నారా? అమ్మగారు, గిరి..."

"మహానుభావా! మూర్తీ, వాళ్ళమ్మగారూ, మా అమ్మగారూ, నాన్నగారూ, గిరీ, వాడి కుక్కపిల్లా అందరూ క్షేమమే. సరేనా? మీ డాక్టర్లబుద్ధి పోనిచ్చుకున్నారుకాదు''

"ఏమిటీ పొద్దుటే ఇలా డాక్టర్లమీద దండయాత్ర సాగిస్తున్నారూ? దేశసేవ కోసమే పుట్టినవాళ్ళం మేము. మమ్మల్ని తిడితే కళ్ళుపోతాయి జాగ్రత్త''

"లేకపోతే ఫోన్‌లో కుశల ప్రశ్నలేమిటీ నా తలకాయ"

"పోనీ మీరు చెప్పండి ఏం మాట్లాడాలో" వేణు చిన్నగా నవ్వాడు. హారతి గుండెల్లో గిలగింతలు పెట్టినట్లయింది. వేణు తన ఎదురుగా ఉండి నవ్వినట్లుగా సిగ్గుగా కనురెప్పలు వాల్చుకుంది.

మౌత్ పీస్‌ను నిశ్శబ్దంగా పెదవులకు తాకించింది ముద్దు పెట్టుకుంటున్నట్లుగా రహస్యంగా.

"అయ్యబాబోయ్! ఈ నిశ్శబ్ద సంభాషణ నాకు చాతకాదు సుమండీ" భయం నటించాడు వేణు.

"డాక్టర్ గారూ, ఈ రోజు నా పుట్టిన రోజండీ" అంది కొంచెం సిగ్గు పడుతున్నట్లుగా.

"హాయ్...హేపీ బర్త్‌డే టూ యూ" సంతోషంగా ఫోనులో అరిచాడు వేణు.

"థాంక్స్"

"అవునూ, థాంక్స్‌తోనే సరిపెడతారా? లేకపోతే పార్టీ ఏమైనా ఉందా?"

"మీరు కావాలంటే అలాగే ఇస్తాను''

"పొద్దుటే పిలిచి మరీ పార్టీ ఇస్తానంటే కాదంటానా? ఏమిటీ ఇంటికి రమ్మన్నారా?"

"వద్దు...వద్దు. సాయంత్రం నాలుగింటికి గాంధీ పార్క్‌కు రండి"

"పార్కులో పార్టీ ఏమిటండీ నా తలకాయ. కొంపతీసి పచ్చగడ్డి పార్టీ కాదుకదా?" నవ్వుతూ అన్నాడు వేణు.

"పార్టీ కావాలనుకున్నవాళ్లు ఎక్కడికి పిలిస్తే అక్కడికి రావాలి"

"ఓ కే... ఓ కే! ఎన్నిగంటలకన్నారూ"

"సాయంత్రం నాలుగింటికి"

"కృష్ణమూర్తిగారు..." అతని మాట పూర్తి కాకుండానే ఫోన్ డిస్కనెక్ట్ అయింది.

హారతి ఇంకా కాసేపు మాట్లాడితే బాగుండును. ఆమె స్వరం ఎంత తియ్యగా మార్దవంగా ఉంది?

ఆ పిల్ల తనను సుడిగాలిలా చుట్టివేస్తోంది. తనను తాను నిగ్రహించుకోవాలనే ప్రయత్నం ప్రయత్నంగానే ఉండిపోతూ ఉత్సాహపు పొంగు ముంచెత్తుతోంది.

బలమైన ఈ ఆకర్షణ నుండి నిగ్రహించుకోగలగడం ఎంత కష్టం?

అసలు ఆయనగారి ముందు నోరు విప్పలేను. ఇన్ని మాటలు ఎలా మాట్లాడానూ అనుకుంది ఆశ్చర్యంగా.

ఇంతకూ ఏం మాట్లాడానూ?

'స్వీట్ నథింగ్స్ మాత్రమే' చిన్నగా నవ్వుకుంది హారతి.

* * *

పగడపు రంగు చీర, మాచింగ్ బ్లౌజ్‌లో సాయం సంధ్యాకిరణంలా, అపరంజి బొమ్మలా నడిచి వచ్చింది హారతి.

రెండు చేతుల నిండుగా ఎర్రటి మట్టి గాజులూ, మెడలో ఒంటిపేట గొలుసూ, తలంటుకున్న జడలో పట్టెడు పువ్వులూ, కళ్ళకు కాటుక, నుదుట చిన్న కుంకుమ బొట్టూ.

'ఏ ఆడంబరమూ లేని ఈ పిల్లలో ఇంత ఆకర్షణ ఎలా వచ్చిందీ' అన్నట్లుగా రెప్పవాల్చకుండా చూస్తూండిపోయాడు వేణు.

"నమస్తే" హారతి చిరునవ్వుతో రెండు చేతులూ జోడించింది.

"శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు అంటూ దీవించమన్నారా?" కొంటెగా అడిగాడు వేణు.

సిగ్గుపడుతూ తల వంచుకుంది హారతి.

ఆమెను అలా చూస్తున్న క్షణంలో తన మనస్సు వశం తప్పుతూన్నట్లుగా గ్రహించాడు వేణు. హారతి సమక్షంలో తాను సర్వం మరచిపోతాడు. చల్లని సుగంధ భరితమైన పిల్లతెమ్మెరలా ఆమె తనను చుట్టివేస్తుంది. ఆ పరిమళం నుండీ, ఆ మత్తు నుండీ బయట పడటం శక్తికి మించిన పనే. "హారతిగారూ! పార్టీకి మూర్తిగారు రాలేదా?" అన్నాడు వాస్తవంలోకి వస్తూ.

'అబ్బ... ఈయనకు మూర్తి అంటే ఎంత అభిమానం? మూర్తీ మూర్తీ అంటూ ఎప్పుడూ మూర్తి గొడవే' మనస్సులోనే చిరాకుపడింది.

"మీరొక్కరే నా గెస్ట్" అంది తల వంచుకుని.

వేణు కళ్ళు తళుక్కుమన్నాయి. రక్తం అంతా పొంగి ముఖంలోకివచ్చింది. ఓ క్షణంలో తిరిగి మామూలుగా అవుతూ "అదేం పాపం. మూర్తికి మీ పార్టీ అజీర్ణం చేస్తుందా?" అన్నాడు నవ్వుతూ.

"మూర్తి అమ్మ గెస్ట్, మీరు నా గెస్ట్. పదండి ఏదయినా హోటల్‌కు వెడదాం"

"హారతిగారూ! మీరు ఏమీ అనుకోనంటే ఓ చిన్న రిక్వెస్ట్. ఈ చల్లగాలి తింటూ మీతో కబుర్లు చెప్పుకుంటూ ఈ అందమైన సాయంత్రం కాసేపు ఇలాగే గడపాలని ఉంది.
మీ పార్టీ మరొకసారి తీసుకుంటాను సరేనా? ఊహు కాదూ కూడదూ ఇప్పుడే తినాలీ అంటే మీ ఇష్టం పోదాం పదండి" అన్నాడు బద్ధకంగా పచ్చికలోనుండి లేవబోతూ.

"మీ ఇష్టం... లేవద్దులే కూర్చోండి" అంటూ తానూ అక్కడే కూర్చుంది గడ్డి మీద.

"పార్టీ ఇస్తాననిచెప్పి ఇవ్వలేదని నన్ను వెక్కిరించకూడదు" అంది చిన్నపిల్లలా.

"మీ పార్టీ నేను వదులుకుంటే కదా ఆ ప్రశ్న. ఇప్పుడు కాదు మరోసారి అన్నాను అంతే"

చల్లనిగాలీ, ప్రశాంతమైన ఆ పరిసరాలూ, అన్నింటినీ మించి వేణుతో ఈ ఏకాంతం వదులుకుని తిండికోసం ఆ రద్దీ అయిన హోటల్స్‌కు వెళ్ళాలని హారతికి కూడాలేదు.

వేణుతో ఇక్కడ... ఇలా... ఓహ్ ఎంత హాయిగా ఉందీ సంధ్యా సమయం.

ఆఫీసునుండి ఇంటికి వెడుతూ కాసేపు పార్క్‌లో కూర్చుని వెడదాం అని స్నేహితుడితో కలిసవచ్చిన కృష్ణమూర్తి దూరంనుండే హారతిని, డాక్టర్ వేణుని గమనించాడు.

అతని భృకుటి ముడివడింది.

"పదరా వెడదాం" అన్నాడు స్నేహితుడితో.

"అదేంరా ఇప్పుడేగా వచ్చిందీ కాసేపు కూర్చుని వెడదాం! ఒరే మూర్తీ అటు చూడరా? వాళ్ళిద్దరూ మేడ్ ఫర్ ఈచ్ అదర్ అన్నట్లులేరూ" అన్నాడు ఆసక్తిగా వాళ్ళవంక చూస్తూ.

కృష్ణమూర్తి ముఖం పాలిపోయింది.

"పదరా పోదాం" అంటూ అడుగులు వేశాడు అసహనంగా.

* * *

"అరే మీరా...రండి రండి"సాదరంగా ఆహ్వానించాడు వేణు. నవ్వుతూ నమస్కారం చేసింది హారతి.

"నీరూ ! ఎవరొచ్చారో చూడవే" నవ్వుతూ చెల్లెలిని కేకపెట్టాడు వేణు. "కూర్చోండి కూర్చోండి" అన్నాడు ఆ తరువాత కంగారుగా.

ఎక్కడ కూర్చోవాలో తోచనట్లుగా చుట్టూ చూసింది హారతి.

వేణు చక్కగా బాసిపట్లు వేసుకు కూర్చుని చిన్నచెల్లెలు మున్నీకి లెక్కలు చెబుతున్నాడు.

మోకాళ్ల దగ్గరగా ముడుచుకునిమున్నీ పక్కగా కూర్చుంది చాపకు ఒకమూల. వేణు తనతప్పు గ్రహించినట్లు నాలుక కొరుక్కున్నాడు.

"అరేరే! కింద కూర్చుంటున్నారు ఆ కుర్చీలో కూర్చోండి" అన్నాడు మొహమాటంగా.

'ఫరవాలేదు' అన్నట్లుగా చిన్నగా నవ్వింది హారతి.

వేణు చిన్నచెల్లెలు 'మున్నీ' తెల్లగా, బొద్దుగా, ముద్దుగాఉంది. పదేళ్ళపిల్ల. ఆల్చిప్పలవంటి పెద్దపెద్ద కళ్ళతో హారతివంక ఆశ్చర్యంగా చూస్తోంది. "మీకు చెప్పానే.. ఇది మా చిన్నతల్లి మున్నీ. చదువులో పెద్ద శుంఠ వాగమంటే మాత్రం కామా, ఫుల్‌స్టాఫ్ లేకుండా పొద్దుగూకులూ వాగుతుంది. ఇదే దీని చరిత్ర"

"ఫో!అన్నయ్యా"ముద్దుముద్దుగాగుణిసింది. ఆఖరిపిల్ల కావడాన ఇంట్లో అందరికీ గారాబం.

"అరే హారతిగారూ మీరా? అన్నయ్య ఎప్పుడూ హారతీ హారతీ అంటుంటే ఎవరో అనుకున్నాను" నీరజ నవ్వుతూ ముందు గదిలోకి వచ్చింది.

తెల్లబోయింది హారతి.

"నీరూ... హారతిగారు నీకు ముందే తెలుసా ?"

"ఆఁ... లక్షణంగా నీకంటే ముందే తెలుసు"

"శూర్పణఖ. లోకమంతా దీనికే తెలుసు అన్నట్లు మాట్లాడుతుంది" గొణిగాడు వేణు.

నీరజ నవ్వింది. ''నేను శూర్పణఖ నయితే మరి మరి...'' అంటూ పెద్దగా నవ్వేసింది.

ఆమె శ్లేషను అర్థం చేసుకున్న హారతి ఫక్కున నవ్వింది.

''అన్నయ్యా! ఇంతకూ ఈవిడగారు నీకు ఎలా తెలుసు-అని అడగవేం?''

"తల్లీ...శూర్పణఖా! నీకు లోకంలో అందరూ తెలుస్తారు. సరేనా?''

"సోదరా!తప్పుతప్పు.తల్లీ శూర్పణఖా కాదు, చెల్లీ శూర్పణఖా అనాలి. మైండ్ ఇట్"

"కాలేజీ యానివర్సరీ డే"

హారతిముఖం పాలిపోయింది అవమానంతో. అయితే ఆ విషయం వీళ్ళకూ తెలుసా?

నీరజ చెప్పుకుపోతోంది. "ఉన్నట్లుండి ఓ అందమైన అమ్మాయికి విపరీతంగా కడుపులో నొప్పివచ్చింది. ఆ అమ్మాయి

ఎంత అందంగా ఉంటుందంటే బాపూ బొమ్మలా...కాదుకాదుద్వాపరయుగంలో సత్యభామకూడా అంత అందంగా ఉండి ఉండదు. అర్ధరాత్రి ...గాఢాంధ కారం. దేశంలో హాస్పటల్స్, నర్సింగ్ హోమ్స్ అన్నీ మూసేశారు. నేనొక్క దాన్నే తెరిచివుంచాను దేశసేవ కోసం. అప్పుడా అమ్మాయిని తీసుకొని వచ్చారు స్టాఫ్అంతా కలిసి. అంతే... ఉన్నపళాన ఆ అమ్మాయికి ఆపరేషన్‌చేసి నయం చేశాను. ఆ అమ్మాయే ఈ అమ్మాయి హారతి. అప్పటినుండే ఆమె నా ఫ్రెండ్"

ఆమె చెప్పినకథా, ఆ కథచెప్పిన తీరూ చూసి పకాపకా నవ్వేసింది హారతి.

నీరజకు వేణుపోలికలు చాలాఉన్నాయి.



చురుకైన కళ్లూ, నవ్వే పెదవులూ...అన్న గారి కాపీ. ఇంటర్ చదువుతోన్న నీరజ చాలా చలాకీఅయిన పిల్ల అని ఎవరూ చెప్పకుండానే తెలిసిపోతుంది.

తను కల్పించిచెప్పిన చిన్న విషయానికి అతిశయోక్తులు చేర్చి తనను దెబ్బ తీస్తున్న చెల్లెలి ఆగడాన్ని చూస్తోంటే అతనికి నవ్వువచ్చినా పళ్లబిగువున ఆపుకుని, ఉడుక్కుంటున్నట్లుగాముఖంపెట్టి–

"పోవే శూర్పణఖా" అంటూ నెత్తిన ఒక్క మొట్టు మొట్టాడు.

"ఇది మా రెండో చెల్లెలండీ వారిజ. ఇంట్లోవాళ్ళూ, చుట్టుపక్కల వాళ్ళూ అంతాకలిసి దీనికి నోట్లో నాలుకలేదని ఏకగ్రీవంగా తీర్మానించారు. ఎందుకంటే ఇది మాట్లాడగా – కనీసం నోరువిప్పగా ఎప్పుడూ, ఎవరూ చూసి ఉండలేదు. అయితే పెద్దడాక్టర్లందరూ కలిసికట్టుగా పరీక్షలుచేసి ఈ అమ్మాయికి నాలుకే కాదు పళ్లూఉన్నాయని సర్టిఫికెట్ ఇచ్చారనుకోండి''

వారిజ, 'ఫో అన్నయ్యా నువ్వు మరీను' అన్నట్లుగా సిగ్గుసిగ్గుగా నవ్వేసిందేతప్ప పెదవి విప్పలేదు. వారిజ స్కూల్ ఫైనల్లో ఉంది. ఇల్లు, స్కూలు తప్ప మరోవిషయం అక్కర్లేని అందమైన మాటలురాని బొమ్మ.

"నీరూ... మధూ ఏదిరా?"

"సినిమాకు వెళ్ళినట్లుందన్నయ్యా"

"అదండీ కథ. అది అంటే మా మధు సినిమా పిచ్చిది. చూసిన డాన్సు పోనివ్వకుండా వచ్చి ఇంట్లో డాన్సుచేస్తూ మా ప్రాణాలుతీస్తుంది"

హారతి అమ్మాయిల కథలూ, అన్నగారికి వారిపట్ల ఉన్న ఆప్యాయతనూ చూస్తూ సంతోషంగా నవ్వింది.

"రండి అమ్మను చూద్దురుగాని..." అంటూ వంటగదిలోకి దారితీశాడు వేణు.

"అమ్మా! ఎవరొచ్చారో చూడు"

వంటపనిలో మునిగివున్న కాంతమ్మగారు ఒక్కసారి తలఎత్తి చూసి–

"రామ్మా! ఇలావచ్చి కూర్చో" అని తిరిగి తనపనిలో మునిగిపోయింది–ఆపిల్ల కూర్చుందీ, లేనిదీకూడా పట్టకుండా.

హారతికి అక్కడ కూర్చోవాలో ఒద్దో కూడా అర్థంకాలేదు.

"హారతిగారూ! రండి. ముందుగదిలో కూర్చుందాం" ఆమెనా పరిస్థితి నుండి తప్పించేందుకు నీరజ పిలిచింది.

తన డాక్టరుకొడుకు ఏ ఆడపిల్లనయినా పలకరించినా, లేక ఏ ఆడపిల్ల అయినా తన కొడుకును పలకరించినా కాంతమ్మకు గొప్ప భయం. ప్రతిక్షణం ఆమెనా భయం పీడిస్తూనే వుంటుంది. అందులోనూ ఈ అమ్మాయి కళ్లు చెదిరిపోయేంత అందంగా కూడా వుంది. ఏ మాయమాటలయినా చెప్పి తన డాక్టరు కొడుకును వల్లోవేసుకుంటే...? ఆ తరువాత ఈ ఆడపిల్లలూ, తానూకట్టకట్టుకుని గంగలో దూకాలి. ఇదీ ఆమెభయం. ఆమె భయాన్నీ, ఆ భయంవెనుక వున్న పరిస్థితులన్నీ అర్థంచేసుకున్న వేణు మరిచిపోయికూడా పరాయి ఆడపిల్ల ప్రసక్తి తల్లిముందు తీసుకురాడు.

వేణు, నీరజ, హారతి ముందుగదిలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

వారిజ కాఫీ, టిఫిన్‌తెచ్చి హారతి ముందుంచింది మౌనంగా.

"మీరూ తీసుకోండి"

"మేం ఇప్పుడే తీసుకున్నామండీ! మరి ఖాళీలేదు" నవ్వింది నీరూ.

హారతి మొహమాట పడుతూ కొంచెం టిఫిన్ తీసుకొని కాఫీ తాగింది.

"నీరజా! మా ఇంటికి ఒకసారి రాకూడదూ''

"ఆఁ దానికెక్కడ కుదురుతుందమ్మా! పొరుగిళ్ళచుట్టూతిరగడానికి..." అప్పుడే బయటికి వచ్చిన కాంతమ్మ అందుకుంది.

అక్కడున్న ముగ్గురి ముఖాలూ అవమానంతో పాలిపోయాయి.

"ఇక వెడతానండీ" అందరికీ చెప్పి నట్లుగా ఒకేసారి చెప్పి బయలుదేరింది హారతి.

"పదండి. మిమ్మల్ని అక్కడివరకూ పంపించి వస్తాను"

"నువ్వెక్కడికిరా?" వెనక నుండి అరిచింది కాంతమ్మ.

"ఒక్కర్తే వచ్చేందుకు లేని భయం వెళ్ళేప్పుడు వచ్చిందా?" వెనక నుండి కాంతమ్మ సణుగుడు వినిపిస్తూనే ఉన్నా హారతితోసహా మెట్లుదిగాడు వేణు.

ఇద్దరూ పక్కపక్కనే నడుస్తోంటే చూపుఆనే వరకూ చూస్తూ తనలో తనే గొణుక్కొంది కాంతమ్మ.

"సారీ హారతిగారూ" మౌనాన్ని భగ్నంచేస్తూ మెల్లగా అన్నాడు వేణు.

"ఎందుకూ?" పేలవంగా నవ్వింది హారతి.

''అమ్మమాటలుపట్టించుకోకండి. ఆమె స్వభావమే అంత''

"ఫరవాలేదు. మీరు బాధపడకండి. నాకు తెలుసు ఈ పెద్దవాళ్ళు ఇలాగే ఉంటారు."

"అందరూ ఎందుకుంటారండీ?" బాధగా అన్నాడు వేణు.

"మీకు తెలీదు. అందరూ కాకపోయినా చాలామంది ఇలాగే ఉంటారు"

"అలా అనకండి. మీ అమ్మగారు ఎంత మర్యాదగా మాట్లాడుతారో?"

నవ్వింది హారతి.

''మీరు డాక్టరుగా మా ఇంటికి వచ్చారు. మరొక నాలుగుసార్లు పని లేకుండా మా ఇంటికి రండి. మా అమ్మ ఎలా మాట్లాడుతుందో మీకేతెలుస్తుంది"

అట్లాగా అన్నట్టు చూశాడు వేణు.

"అసలు మీరుఇంటికి వస్తారనుకోలేదు"

"అనుకోకుండా వచ్చేశాను. మీ క్లినిక్‌కు వెళ్ళాను. మూడురోజుల నుండీ రావడంలేదని చెప్పారు. మీకు బాగుండ లేదేమోనని అనుకున్నాను. ఇల్లు దగ్గరే కదా వెళ్ళి చూసివద్దాం అనిపించింది. వచ్చేశాను"

'మంచిపని చేశారు' అనలేదు వేణు.

"అవునూ హాస్పిటల్‌కు రావడంలేదట మూడు రోజులుగా?"

"మా నీరూకు సంబంధమేదో ఉందని మా మామయ్య రాస్తే వాళ్ళ ఊరికి వెళ్ళాను"

"కుదిరిందా?''

"అబ్బే అంత అర్జెంటుగా సెటిల్ అయ్యేందుకు అది ఆడపిల్ల పెళ్ళి సంబంధమా... లేక మరొకటా?" నవ్వుతూ అన్నాడు వేణు.

''మీ నాన్నగారు పట్టించుకోరా?"

''ఆయనకు పేకాట తప్ప ఈ ప్రపంచంలో మరో విషయం పట్టదు''

పేలవంగా నవ్వుతూ చెప్పాడు వేణు.

"ఆ కిళ్ళీకొట్టు పక్కన నించుంది మూర్తిగారు కాదూ?" రోడ్డు పక్కన కిళ్ళీకొట్టువైపు చూస్తూ అన్నాడు వేణు.

''అవును మూర్తే"

వేణు గట్టిగా కేకవేసి పిలిచాడు.

షాపులో వక్కపొడి కొనుక్కుంటున్న

మూర్తి వేణును చూసి చిరునవ్వు నవ్వాడు. అతని పక్కనే ఉన్న హారతిని చూసిన మూర్తి ముఖం ఒక్కక్షణం పాలిపోయింది. తిరిగి మామూలుగా అవుతూ, "హల్లో డాక్టర్ః గుడీవినింగ్" అన్నాడు వేణు చేతిలోచెయ్యి కలుపుతూ.

"నమస్తేః ఏమిటీ ఎక్కడా దర్శనా ల్లేవు?"

మూర్తి హారతిని చూడనట్లూ, పట్టించు కోనట్టూ ఏదో మాట్లాడుతున్నాడు. వేణుతో తనను చూసిన మూర్తి ఏమను కుని ఉంటాడూ? తన ఉనికిని పట్టించుకో నట్లు వాళ్ళిద్దరూ అలా స్నేహంగా మాట్లాడుకుంటోంటే 'గిల్టీ'గా ఫీల



య్యింది హారతి.

పక్కనే వెడుతోన్న ఆటోను ఆపి చెప్పకుండానే ఎక్కి పోనిమ్మని చెప్పింది డ్రైవర్‌తో.

ఆటో వెళ్ళినవైపే చూస్తూండిపోయాడు మూర్తి.

హారతి తనకు దూరమవుతోందా?

వేణు మూర్తి భుజంమీద స్నేహంగా చెయ్యివేశాడు.

"అన్నట్లు మీ ప్రాక్టీస్ ఎలా ఉంది?" అన్నాడు ఏదో ఒకటి మాట్లాడకపోతే బాగుండదు అన్నట్లుగా.

"ప్రాక్టీసుకేమండీ బాబూ! దివ్యంగా ఉంది. ఈరోజుల్లోమనుషులకేంతక్కువ..? వాళ్ళకొచ్చే రోగాలకేంతక్కువ" నవ్వుతూ అన్నాడు వేణు.

"పదండి. అలా హోటల్లో కూర్చుని మాట్లాడుకుందాం"

కృష్ణమూర్తి ఎదురుగావున్న హోటల్లోకి దారితీశాడు.

ఇద్దరూ ఎదురెదురుగా కుర్చీల్లో కూర్చున్నారు.

'హారతి విషయం తనతో మాట్లాడేందుకేతనను పిలిచాడు' అని గ్రహించిన వేణు అందుకు సిద్ధంగా ఉన్నట్లు మౌనంగా కూర్చున్నాడు.

"డాక్టర్ !మీరు హారతిని ప్రేమిస్తున్నారా?"

"ఏం? మీరు ప్రేమించడంలేదా?" నవ్వుతూ ప్రశ్నించాడు వేణు.

"చూడండి డాక్టర్! మీరీ విషయాన్ని సీరియస్‌గా తీసుకోవాలి. ఇది జీవితాలకు సంబంధించిన విషయం కనుక.."

కృష్ణమూర్తి ముఖం గంభీరంగా ఉండటంతో మాడిపోయినట్లు మరింత నల్లగా ఉంది.

పాలరాయిలా మెరుస్తూన్న డెకొలమ్ టేబిల్ మీద అతని నల్లని చేతులు కాలిన కొరకంచుల్లా ఉన్నాయి.

"అయాం సారీ. అడగండి"

"మీరు హారతిని ప్రేమిస్తున్నారా?"

"అవును"

కృష్ణమూర్తి ఒక్కసారిగా అదిరిపడ్డాడు. ఈ జవాబు అతను ఊహించనిది. అతని ముఖంలో రంగులు మారినా అవి అతని నల్లని ముఖంలో బయటపడలేదు. ఏభావమూ ప్రతిఫలించని అతని ముఖం చూపరులకు ఎప్పుడూ ఒక్కలాగే కనిపిస్తుంది.

కానీ, క్షణకాలం అతని హృదయంలో అగ్ని పర్వతాలు బద్దలయ్యాయి.

వేణు నుండి ఈ జవాబు అతను ఆశించలేదు.

వేణు తప్పు చేసినట్లుగా బాధపడతాడనీ, హారతికి దూరంగా ఉంటాడనీ మాత్రమే అతను ఊహించుకున్నాడు.

మరుక్షణంలోనే సర్దుకున్నాడు కృష్ణమూర్తి.

"మీరామెను పెళ్ళాడేందుకు సిద్ధంగా ఉన్నారా?"

"లేదు" నిశ్చలంగా చెప్పాడు వేణు.

ఈసారి కృష్ణమూర్తి పిడికిళ్ళు బిగుసుకున్నాయి. అతని చిన్ని కళ్లు కోపంతో ముడుచుకుని మరింత చిన్నవయ్యాయి. కనుబొమలు ముడివడ్డాయి.

"అంటే... పెళ్ళి చేసుకునే ఉద్దేశం లేకుండానే ఒక ఆడపిల్ల వెంట పడ్డారా? చదువు, సంస్కారం ఉన్నవాళ్లు చెయ్యవలసిన పనేనా ఇది?'' అతని గొంతు నెమ్మదిగానే అయినా తీక్షణంగా ఉంది.

"కృష్ణమూర్తిగారూ!మీరు మీ అభియోగాన్ని విత్‌డ్రా చేసుకోవల్సి ఉంటుంది.

ఒక ఆడపిల్ల వెంట నేను పడ్డానంటున్నారు. కానీ ఆమె స్వయంగా మా ఇంటికి వచ్చిందనే విషయం మీరు తెలుసుకోవాలి. ఇంటికి వచ్చిన వాళ్ళను ఆహ్వానించి, ఆదరించి పంపడం సభ్యత కల వాళ్లు చేసే పనే అనుకుంటున్నాను."

"ఆమెను పెళ్ళి చేసుకునే ఉద్దేశం లేనప్పుడు ఆమెను ప్రేమించడం, మీ చుట్టూ తిప్పుకోడం ఎంత వరకూ న్యాయం?"

వేణు చిన్నగా నవ్వాడు.

"నిజమే..నాకు పెళ్ళిచేసుకోవాలనే ఉద్దేశం లేని మాట నిజమే. పెళ్ళి చేసుకోనంత మాత్రాన ప్రేమించకూడదనే రూలేమీ లేదుగా! ఎవరి దొడ్లోనో అందమైన గులాబి పూచింది. దూరంగా ఉండి దాని అందాన్ని ఆరాధించడంలోనూ, ఆస్వాదించడంలోనూ తప్పేముంది. అందాన్ని చూసిన ప్రతిహృదయం స్పందిస్తుంది.అక్రమంగాదాన్ని అందుకోవాలనీ, అనుభవించాలనీఅనుకున్నప్పుడేమనిషికీ, పశువుకీతేడా లేకుండాపోతుంది"

కృష్ణమూర్తిలో ఇంతక్రితం ఉన్న ఆవేశం క్రమంగా తగ్గిపోయింది. 'నిజమే. వేణు చెప్పినదాంట్లో తప్పేముందీ.?' అనుకుంటున్నాడు.

"మీరు హారతిని అంతగా ఆరాధిస్తున్నప్పుడు ఆమెను ఎందుకు పెళ్ళి చేసుకోకూడదు?"

"మూర్తిగారూ! హారతిని నాకంటే ఎక్కువగా మీరు అభిమానిస్తున్నారు, ఆరాధిస్తున్నారు. మరి మీరెందుకు చేసుకోకూడదూ అంటే మీ పరిస్థితులు మీకున్నాయి. అలాగే నా పరిస్థితులు నాకు వున్నాయి"

"వేణుగారూ! హారతి మిమ్మల్ని ప్రేమిస్తోందా?"

ఈ ప్రశ్న అడుగుతూ కృష్ణమూర్తి తన ముఖాన్ని బాగా కిందకి దించుకున్నాడు అభిమానంతో.

ఏం వినాల్సి వస్తుందో అన్నట్లుగా అతని గుండె వేగంగా కొట్టుకుంది.

"బహుశా ప్రేమిస్తూనూ ఉండవచ్చు, లేకపోనూ వచ్చు"

కృష్ణమూర్తి బాధ,అభిమానం అతనికి అర్థం అయ్యింది. తన సూటి జవాబులతో అతన్ని ఇంకా బాధపెట్టాలనిపించలేదు.

"ఆమెను పెళ్ళి చేసుకోలేని మీ పరిస్థితి చెప్పి మీ మీద ఆశ పెట్టుకోవద్దని మీరు చెప్పవచ్చుగా? మీ మీద ఆశలు పెంచుకుంటున్న ఆ అమాయకురాలిని భగ్నహృదయకాకుండారక్షించవచ్చుగా"

వేణు బాధగా తల రుద్దుకున్నాడు. హారతిని తాను ప్రేమిస్తున్నాడు. ఆమె స్నేహాన్ని గాఢంగా వాంఛిస్తున్నాడు. అలాంటప్పుడు చేజేతులా ఆమెకు దూరం అయ్యేందుకు తన మనస్సెలా ఒప్పుతుంది? అయితే కృష్ణమూర్తి ముందు ఈ విషయం ఒప్పుకుని తప్పిదస్తుడు కాదలుచుకోలేదు.

"మూర్తిగారూ! ఒక్క విషయం ఆలోచించండి. ఒక ఆడపిల్ల మిమ్మల్ని ప్రేమిస్తుందో లేదో కూడా స్పష్టంగా తెలీకుండా 'నేను నిన్ను పెళ్ళిచేసుకోలేను. నువ్వు నా వెంటపడొద్దు' అని మీరైతే మాత్రం చెప్పగలరా చెప్పండి. అసలా అమ్మాయి మిమ్మల్ని ప్రేమించడం లేదనుకోండి. కేవలం మీ స్నేహం కోసే మీ వద్దకు వస్తుందనుకోండి. అప్పుడు మీరామాట చెబితే ఆమె ముందు మీ పొజిషన్ ఎలా ఉంటుంది? కొంచెం ఆలో

చించండి.నేనూ అదేపరిస్థితిలో ఉన్నాను"

కృష్ణమూర్తి మరి మాట్లాడలేదు.

ఈ లోపుగా ఇద్దరి కాఫీలు పూర్తయ్యాయి.

"కృష్ణమూర్తిగారూ! మీరు నాకు మంచి స్నేహితులు. మొదటి పరిచయంలోనే మీరంటే నాకు మంచి అభిప్రాయం కలిగింది. మీరు హారతిని మీ ప్రాణంకంటే ఎక్కువగా ప్రేమిస్తున్నారు. అభిమానిస్తున్నారు. ఆమె సుఖమే మీరు కోరుకుంటున్నారు. ఆ విషయం నాకు స్పష్టంగా తెలుసు. ప్రాణానికి ప్రాణంగా ప్రేమించే మీరు హారతికి భర్త అయితే ఆమె సుఖపడుతుంది. ఆ విషయం నేను నిశ్చయంగా చెప్పగలను. హారతి మీకు కావాలి, నాకు కావాలి. కానీ, నాకంటే ఎక్కువగా హారతిని మీరు సుఖపెట్టగలరు. అందుకే హారతిని మీకు ఒదిలేసి మీ స్నేహాన్ని నేను దక్కించుకుంటున్నాను. విష్‌యూ ఆల్ బెస్ట్" వేణు కృష్ణమూర్తి చేతిలో చెయ్యికలిపాడు. తాను అప్పుడలా ప్రవర్తించాడు. హారతిని మనస్ఫూర్తిగా మూర్తికి వదిలేశాడు. వారిద్దరూ దంపతులై చిలకా గోరింకల్లా ఉంటే చూసి తృప్తిపడదామనుకుని తనను అనునయించుకున్నాడు.

కాని...కాని అలా జరిగినట్లులేదే! కృష్ణమూర్తి ఏమయ్యాడు? హారతికి భర్తగా ఆమె పక్కనే మూర్తి ఎందువల్ల కనబడలేదీరోజు?

వేణు ఆలోచనల్తో అలిసి అలాగే నిద్రపోయాడు.

* * *

తలకింద రెండు అరచేతులూ ఉంచుకుని హారతి పక్కనే వెల్లకిలా పడుకుని సీలింగ్ ఫాన్ వంక చూస్తున్న ప్రభాకర్ మనస్సు ఒంటరిగా ఉంది. హోటల్ రూం కొత్తగాఅనిపిస్తోంది. ఏదో వెలితిగా ఉంది... బరువుగా ఉంది.

సుజాను ఇంటర్వ్యూకు వెళ్ళమన్నాడు. వెళ్ళి ఉంటుందా...ఏమయిందో?

ప్రభాకర్ ఊహలు సాగిపోతున్నాయి.

ప్రభాకర్ కళ్ళముందు ఎన్నో అందమైన కలలు. సువిశాలమైన సుందర మైదానం! సుదూరంగా పచ్చని పచ్చికతో నిండిన ఎత్తయిన కొండలు... కొండల పక్కగా గలగలమంటూ ప్రవహిస్తున్న సెలయేరూ...!

ప్రకృతి పచ్చని పట్టుచీరతో ముస్తాబై నీలాకాశపు మేలి ముసుగుతో ముగ్ధమనోహరంగా ఉంది.

అందమైన ప్రకృతి కంతకూ అందాన్ని పంచుతున్నట్లుగా ఉన్న హారతీ పక్కన తనూ.

ఇద్దరూ గాలిలో తేలుతున్నట్లుగా చెట్టాపట్టాలు వేసుకు పరిగెడుతున్నారు- దూరంగా దూరదూరంగా.

ఉన్నట్లుండి హారతి తన చెయ్యి విడిపించుకుని చలాకీగా పరుగులుతీస్తూ కొండలవైపు పరుగులు తీస్తోంది కన్నె లేడిలా.

అరే! దేవి ఇలాఉందేమిటి?

ఇంత చురుకుగా, అందంగా, సెలయేరులా, చలాకీగా పరుగులు తీయగా, కేరింతలు కొట్టగా తానెప్పుడూ చూడలేదే!

దేవి డ్రెస్సింగ్‌కూడా ఎంత అపురూపంగా ఉందీ!

బ్లాక్ చెక్స్ ఉన్న తెల్లటి షర్టు, షల్వార్ పైన ఉల్లిపొరకంటే పలుచగా ఉన్న తెల్లటి దుపట్టా — ఒంపులు తిరిగిన ఆమె ఒంటి ఒంపులను స్పష్టం చేస్తోంది.

దేవి ఎంత నాజూకుగా ఉందీ...!

హారతి రెండుచేతులూగాలిలోకిఊపుతూ కిలకిలా నవ్వుతూ పరుగెత్తీ పరుగెత్తీ అలసిపోయి రొప్పుతూ ఆగిపోయింది.

పచ్చని పచ్చికపైన పాలరాతిశిల్పంలా అతిమనోహరమైన భంగిమలో పాములా మెలికలు తిరిగిన ఒంపులను, పాము కుబుసంలా ఉన్న దుపట్టా దాచలేక తన అసమర్థతను ఒప్పుకుని తప్పుకుంది.

ప్రభాకర్ ఆమెను చేరుకున్నాడు. నల్లని ఒత్తయిన జుట్టు చెంపల నిండుగా పరచుకుని మబ్బుల్లో చందమామలా మెరిసిపోతున్న ఆమె ముఖాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు.

"అరే.. ఈమె దేవికాదు. ఈమె దేవి కాదు. మరి ఎవరు? ఎవరు?"

ఆమె నవ్వింది.

మబ్బులమధ్య మెరుపు మెరిసింది.

"సుజా?"

"యా" అంది సుజా కొంటెగా నవ్వుతూ "సుజా... నువ్వు... నువ్వు... దేవి... నా దేవి..."

"మహాశయా! నేను నీ దేవినే" సుజాత అతనిచెయ్యి సుతారంగా పట్టుకుని లాగింది.

ప్రభాకర్ తూలి ఆమె గుండెల మీద పడ్డాడు.

క్షణంలో సగంసేపు శరీరమంతా విద్యుద్ఘాతం తగిలిన అనుభూతి.

సుజా అతని చెంపకు తన చెంప చేర్చింది.

"ఇప్పుడు చెప్పు నేనెవరు?" అంది.

"నువ్వు నువ్వు... మబ్బుల్లో చంద మామవు"

"ఇంకా?"

"నువ్వు నా కలలరాణివి. నా దేవతవు.. నా ప్రాణానివి"

సుజా నవ్వింది.

వెయ్యి పున్నమలు వెలిగినకాంతి.

"ప్రభా... ఐ లవ్ యూ"

"సుజా ఐ టూ... సుజా... సుజా" ప్రభాకర్ ఆమెను పొదివిపట్టుకున్నాడు.

"సుజా... మై లవ్.. సుజా" రెండు శరీరాలూ తమకంగా అల్లుకుపోయాయి.

"ప్రభా....లే...ప్రభా" తట్టి పిలిచింది హారతి కలవరిస్తూ తనను అల్లుకుపోతున్న ప్రభాకర్‌ను.

ఉలిక్కిపడిన ప్రభాకర్ అయోమయముగా చూశాడు కళ్ళువిప్పి. ఏదీ ఆ సెలయేరు? ఏదీ ఆ పచ్చికబయలు? ఏదీ నా కలలరాణి? ఒక్కక్షణం తానెక్కడుందీ అర్థం కాలేదు.

"ప్రభా! మంచినీళ్ళు తాగుతావా?"

"ఊహుఁ...నేనేమైనా కలవరించానా?"

హారతి ఔననలేదు. అలాగని కాదనీ అనలేదు. వినిపించుకోనట్లుగా బెడ్‌లైట్ వంకచూస్తూ పడుకుంది.

ప్రభాకర్ అటుతిరిగి పడుకున్నాడు.

కల జ్ఞాపకం వచ్చినట్లుంది అతని అధరాలమీద చిరుమందహాసం లాస్యం చేసింది.

కలను మననం చేసుకుంటూ కళ్ళు మూసుకున్నాడు ప్రభాకర్.



వంటగదిలో ఏదో పనిచూసుకుంటున్న

హారతి తలుపుచప్పుడవడంతో, 'సుజా వచ్చినట్లుంది. అతనువెళ్ళి తలుపు తీస్తాడులే' అనుకుని ఊరుకొంది.

ముందుగదిలో పేపరు చదవడంలో మునిగిపోయిన ప్రభాకర్ ఆవిడగారు



తీస్తుందిలే అనుకుని ఊరుకోడంతో బయటి నుండి తలుపుచప్పుడు నిర్విరామంగా వినిపిస్తూనే వుంది.

ఇద్దరూ ఒకేసారి లేచారు తలుపు తీసేందుకు.

ఈమధ్య సుజా ప్రతి ఉదయం, సాయంత్రం తప్పనిసరిగా వస్తోంది. ఆమె వచ్చినప్పుడు మాత్రం కాస్త సరదాగా కాలక్షేపం జరుగుతోంది.

ఏ కారణం చేతనైనా ఆమె ఒక్కపూట రాకపోతే ప్రభాకర్ విధిగా వెళ్ళివస్తాడు.

ఈమధ్య కాలంలో భార్యాభర్తల మధ్య 'ఇదీ' అని చెప్పలేని భావమేదో చోటుచేసుకొని హృదయ పూర్వకంగా మాట్లాడుకోకుండా నిరోధిస్తోంది. కలిసి ఉంటున్నారు కలిసి తింటున్నారు మాట్లాడుకుంటున్నారు. కలిసి ఒకే పడక మీద పడుకొంటున్నారు. అయినా ఇద్దరి మధ్యా ఏదో తెర. మనస్సులు విప్పి మాట్లాడుకోవాలనిఉన్నా ఏం మాట్లాడాలో తెలీని స్థితి.

ఒక రకమైన న్యూనతాభావం ప్రభాకర్‌లో మెలిపెడుతూంటే, ప్రభాకర్ రోజురోజుకూ తనకు దూరమవుతూన్న విషయం గమనించిన హారతి తాను ఒంటరిగా ఫీలవడం మొదలుపెట్టింది.

తలుపుతీసిన హారతి వచ్చిన వ్యక్తి తాను అనుకున్నట్లుగానే సుజాకావడంతో పలకరింపుగా చిరునవ్వు నవ్వి లోపలికి రమ్మన్నట్లుగా పక్కకు తప్పుకుంది.

ఆమె వెనకేవున్న ప్రభాకర్ హారతి తలపైనుండి ముందుకు చూశాడు.

"ఓహ్..." అన్న ఆశ్చర్యకరమైన శబ్దం అప్రయత్నంగా అతని నోటినుండి బయటపడింది.

అర్థం చేసుకున్న సుజా అందంగా సిగ్గుపడుతూ లోపలికివచ్చింది. తలంటుకున్న జుట్టును జారుగా జడఅల్లి సగంలో వదిలిపెట్టింది. నడుంవంపునుస్పష్టంచేస్తూ నల్లగా, పొడవుగా బరువుగాసాగిన జడ మోకాళ్ళకు కాస్త పైభాగంలో ఆగిపోయింది.

రెమ్మలతో అమర్చిన ఒకేఒక అందమైన గులాబీ...లేత గులాబీరంగుచీర, మాచింగ్‌బ్లౌజ్‌తో సుకుమారమైన గులాబీ మొగ్గలా అందంగా, నాజూగ్గా వుంది. అపురూపమైన ఆమె సౌందర్యం ప్రభాను ఆశ్చర్యంలో ముంచిందనే విషయం అర్థం చేసుకున్న హారతి పెదవులపై ఓ పేలవమైన మందహాసం మెరిసి మాయమయింది.

'చురుకైన కాటుకకళ్ళూ, నవ్వే పెదవులూ సుజా అందానికి వన్నెలు' అనుకుంది హారతి.

సుజా చేతిలో బరువుగా ఉన్న టిఫిన్ క్యారియర్.

"ఏవిటి సుజా చాలా బరువుగానే వచ్చావు" అంది హారతి చిరునవ్వుతో.

"అక్కా! ఈరోజు నాబర్త్‌డే.అందుకే అత్తయ్య మీకి ఫలహారాలుఇచ్చిరమ్మంది" అంది క్యారియర్ హారతికి అందిస్తూ.

"హాయ్! అదాసంగతి. అందుకేనన్న మాట ఈ సింగారం. హాపీ బర్త్‌డే టు యూ" ప్రభాకర్ సంతోషంగా అన్నాడు ఆమెవంక కొంటెగా చూస్తూ.

సుజా బుగ్గలు సిగ్గుతో చిరునవ్వుల గులాబీలు పూయించాయి. ఆకుల మధ్య గులాబీ బాలలా ముడుచుకుపోయింది సిగ్గుతో.

"సుజా! నీ బర్త్‌డే అని నిన్న చెప్పలేదేం" అన్నాడు తదేకంగా ఆమె వంక చూస్తూ.

"సుజా నిన్న మీకెక్కడ కలిసింది?" అంది హారతి—మామూలుగా. సుజా నిన్న ఇంటికి రాలేదనేవిషయంగుర్తుచేసుకుంటూ.

"నేను వెళ్లానుగా.అప్పుడు చెప్పలేదు"

"నిన్న నువ్వు ఇంటికి వెళ్ళలేదన్నావుగా?"

"ఆఁ... అవును వెళ్ళలేదు...లేదు లేదువెళ్లేను...మరిచిపోయాను" ప్రభాకర్ తడబడ్డాడు.

"బావా! నిన్ను చెబితే ఏమిచ్చేవాడివి?" చిలిపిగా నవ్వుతూ అడిగింది సుజా.

"ఏమిచ్చేవాడివి అంటే ఇప్పుడెలా చెప్పను ? జీవితంలో ఎప్పటికీ మరిచిపోలేనిది ఇచ్చేవాడిని''

"ఏంటబ్బా అదీ" కళ్లు రెపరెపలాడించింది సుజా. హారతి వంటగదిలోకి వెళ్ళిపోయింది.

''బావా, మధ్యాహ్నం భోజనానికి అక్కడికే వచ్చేయ్. ఏం – తప్పకుండా వచ్చేస్తావు కదూ" గొంతు తగ్గించినా సుజాత గొంతు వంటగదిలోకి స్పష్టంగా వినిపిస్తోంది.

''ఇంత అందమైన మరదలు పిలుస్తుంటే కాదంటానా?" ప్రభాకర్ నవ్వాడు. అతని స్వరంలో, నవ్వులో కొంటెతనం, ఆనందం, ఉత్సాహం తుళ్ళి తుళ్ళి పడుతున్నాయి.

అతని కళ్ళు చిలిపిగా ఆమెను కవ్విస్తున్నాయి.

''కాదన్నావుగా?" సుజాత గొంతులో నిష్ఠూరం.

ఆమె అన్న మాటలోని భావం గ్రహించినట్లుగా, ''ప్చ్. ఏమిటో అప్పుడు అట్లా అయిపోయింది" అన్నాడు అలా జరిగినందుకు తను కూడా బాధపడుతున్నట్లు దిగులుగా.

"పోనీలే బావా! మధ్యాహన్నం భోజనానికి రావడం మాత్రం మరిచిపోకు. నీకోసం ఎదురు చూస్తుంటాను"

"ఓ.కె. తప్పకుండా. సరేనా?"

''ప్రామిస్'' సుజా అరచెయ్యి చాచింది.

"ప్రామిస్'' సుజా చేతిలో చెయ్యి వేస్తూ, ఆ అరచెయ్యిని సున్నితంగా నొక్కి విడిచిపెట్టాడు ప్రభాకర్.

సుజా గుండెలు ఝల్లుమన్నాయి. ఆమె శరీరమంతా విద్యుత్ పాకినట్లు సన్నగా మధుర భావంతో వణికింది.

ఒట్టు వేయించుకోకున్నా అతడు తప్పకుండా వస్తాడని ఆమెకు తెలుసు. యవ్వనారంభంలో అదో చిలిపికోరిక. ఆ చిన్ని చిన్ని స్పర్శలకే పులకింతలు... పులకరింతలు... మాధుర్యాలు... పూచిన మమతల మకరందాలు...

''ఇక వస్తాను బావా!''

"అప్పుడేనా? మరికాసేపు ఉండకూడదూ?"

''అత్తయ్య త్వరగా వచ్చేయమంది. అయినా ఇక్కడేం మాట్లాడుకుంటాం? మధ్యాహ్నం సెలవు పెట్టి వస్తావుగా కావలసినంత సేపు కబుర్లు చెప్పుకోవచ్చు"

అతనికి సుజా కోరిక అర్థం అయింది. 'అలాగే' అన్నట్లు నవ్వాడు. లోపల సుజా కొరకు కాఫీ కలుపుతున్న హారతి వస్తూన్న నిట్టూర్పును బలవంతంగా ఆపుకుంది.

''అక్కా! నేను వెడుతున్నాను'' వంటగదిలోకి తొంగిచూస్తూ కేకేసింది సుజా.

''కాస్త కాఫీతాగి వెళ్ళు సుజా" హారతి కాఫీకప్పు అందించింది. కాఫీ పూర్తి చేసిన సుజా, గుమ్మం దాటుతూ దాటుతూ ప్రభాకర్ వంక చూసింది. 'బావా! నీకోసం చూస్తుంటాను. త్వరగా వచ్చేయి' అదీ ఆ చూపుకు భావం.

'అలాగే' అన్నట్లుగా కళ్ళతోనే చెప్పాడు ప్రభాకర్.

ప్రభాకర్ బాంకుకు వెడుతూ, ''దేవీ! ఈరోజు మధ్యాహ్నం నేను భోజనానికి రాను'' అన్నాడు గోడవంక చూస్తూ.

హారతి మౌనంగా అతనివంక చూసింది.

ప్రభాకర్ చూపులు తిప్పుకుంటూ, "ఓ ఫ్రెండ్ మేరేజ్ పార్టీ ఉంది. తప్పకుండా అటెండ్‌కావాలి" అన్నాడు గుమ్మం దిగుతూ. ఈసారి గుండెల్లోనుండి తన్నుకు వస్తున్న నిట్టూర్పును ఆపుకోలేకపోయింది హారతి.

ఆరాత్రి, చాలారాత్రి గడిచిన తరువాత ఇల్లుచేరిన ప్రభాకర్‌ను అడిగింది హారతి–

"ప్రభా...ఇంత ఆలస్యం అయిందేం?"

"ఓ ఫ్రెండుతో సినిమాకు వెళ్ళాను" బట్టలు మార్చుకుంటూ చెప్పాడు ప్రభాకర్.

"భోంచేద్దాం రా" అంది అతను పడుకునేందుకు సిద్ధపడటంచూసి.

"అహఁ...నాకువద్దు. నువ్వుతినేయ్" అన్నాడు బద్ధకంగా ఆవులిస్తూ.

"అదేం?"

"ఫ్రెండ్ బలవంతంచేస్తే వాళ్ళింట్లోనే తిన్నాను"

ఆ ఫ్రెండ్ సుజా అని చెప్పలేదు ప్రభాకర్. ఆ ఫ్రెండ్ ఎవరూ అని అడగలేదు హారతి.

వంటింట్లోకి వెళ్ళి అన్నీ సర్దిపెట్టి వచ్చి మౌనంగా మంచంమీద వాలింది.

'నువ్వు భోంచెయ్యవే?' అని అడగలేదు ప్రభాకర్. అతను ఉత్సాహపూరితమైన తన ఆలోచనల్లో మునిగిపోయి హారతిని అసలు గమనించనేలేదు.

ఆరోజు హారతి పక్కమీదే ఉల్లాసంగా కళ్ళు తెరిచింది. ఆ రోజు ఆమెకు ఎంతో సంతోషంగా ఉంది. తాను సెలవు పెట్టడమే గాకుండా ప్రభాకర్‌తో కూడా సెలవు పెట్టించాలి–అనుకుంటూ పక్కమీద నుండే ఉత్సాహంగా లేచింది.

ఈ మధ్యకాలంలో హారతి – ప్రభాకర్‌ల మధ్య కొంతసఖ్యత కుదిరింది. ప్రతి చిన్న విషయాన్నీ మనస్సుకు పట్టించుకోకూడదు. కొన్ని విషయాలు విన్నా విననట్లే ఉండాలే తప్ప ప్రతి చిన్న విషయాన్ని గురించీ తీవ్రంగా ఆలోచించి మనస్సు పాడు చేసుకోకూడదనే నిర్ణయానికి వచ్చింది.

ప్రభాకర్ కూడా మునుపటి అంత ఉదాసీనత చూపించడం లేదు ఆమె పట్ల. ఇద్దరి మనస్సులూ సర్దుకున్నాయి.

కాలకృత్యాలు పూర్తి చేసుకుని వచ్చిన హారతి తడితలను తుడుచుకుంటూ ఇంకా పడక మీదే ఉన్న ప్రభాకర్‌ను చూస్తూ – "నిద్ర ఉంటేచాలు అబ్బాయి గారికి ఇంకేంవద్దు. ఏయ్ మొద్దూ! లే...లే ఎంత పొద్దెక్కిందో చూడు' అంది పక్కనే కూర్చుని కదుపుతూ–

"అబ్బ... ఉండు దేవీ! అప్పుడేఏం మునిగిపోయింది?" బద్ధకంగా రెండోవేపు తిరిగి పడుకున్నాడు ప్రభాకర్.

హారతి బలవంతంగా లాగి, గుంజి, లేపి అతన్ని కూర్చోబెట్టింది. ప్రభాకర్ కూర్చొనే సగం ఆమెకు ఆనుకుని నిద్ర పోతున్నాడు.

"ప్రభా! ఇవ్వాళ ఏం రోజో నీకు గుర్తుందా?"

"ఊహూ... నీ పుట్టినరోజా" మగతగా అన్నాడు ప్రభాకర్.

"ఊహూఁ కాదు"

"మరి నా పుట్టినరోజా?" అన్నాడు బద్ధకంగా ఆవులిస్తూ.

"ఊహు... కాదు"

"అబ్బ! చంపక చెబుదూ ఏంరోజు" ఇంకా వదలని నిద్రమత్తుతో బద్ధకంగా అన్నాడు ప్రభాకర్.

"ఈరోజు మన పెళ్ళిరోజు. అప్పుడే మన పెళ్ళై ఐదేళ్ళయింది తెలుసా? నిన్న మొన్న జరిగినట్లుగా ఉంది" అంది

ఉత్సాహంగా.

ప్రభాకర్ పూర్తిగా కళ్లు తెరిచి చూశాడు.

హారతి తలంటుకుంది. ఎప్పుడో తను ఇష్టపడి తెచ్చిన బ్లూ కలర్ జార్జెట్ చీర కట్టుకుని మాచింగ్ బ్లౌజ్ వేసుకుంది. ముఖాన చిన్న కుంకుమ బొట్టు.

హారతి శిథిలమైన సజీవ శిల్పంలా ఉంది. పచ్చని ఒంటి రంగు కాస్త పాలిపోయినట్లుగా ఉంది. కావడానికి విశాలమైన కళ్లే అయినా ఆ కంటి చుట్టూ ఏర్పడ్డ నల్లని వలయాలు ఆ కళ్ళ అందాలను దాచేశాయి. పెదవుల్లో, చెంపల్లో అరుణిమ తగ్గి పాలిపోయి ఏకుల్లా ఉన్నాయి. పాపిట నిండుగా పరుచుకుంటున్న తెల్లని జుట్టు.

ఈ చీరలో సుజా అయితే ఎలా ఉండేది?

ఆకాశంలో అల్లనల్లన కదలాడే మేఘ కన్యలా, సాగర గర్భంలో కేరింతలు కొట్టే సాగర కన్యలా...!

తనను ఎంతో ముద్దు చేస్తాడనుకున్న హారతి అతనలా నిర్లిప్తంగా చూస్తుండిపోవడంతో చిన్నబోయింది.

లేని ఉత్సాహం తెచ్చుకుంటూ "ప్రభా! ఈరోజు నువ్వు కూడా సెలవు పెట్టెయ్! నేనూ సెలవు పెడతాను'' అంది.

"ఎందుకు లెద్దూ సెలవు? ఇంట్లో బోర్ కొడుతుంది!"

హారతి మనస్సు చివుక్కుమంది.

"కాదులే! ఈ ఒక్కరోజుకూ సెలవు పెట్టేద్దూ. ఎంచక్కా కబుర్లుచెప్పుకుంటూ వంట చేసుకుందాం. పేక ఆడుకుందాం. సాయంత్రం పార్కుకూ, రాత్రి సినిమాకూ ఏం?" గారంగా అడిగింది హారతి.

ప్రభాకర్ రెండు క్షణాలు ఆలోచిస్తున్నట్లుగా ఉండిపోయాడు.

"సుజాను భోజనానికి పిలుద్దామా? ముగ్గురం అయితే సరదాగా గడిచిపోతుంది" అన్నాడు ఆమెవంక చూస్తూ.

హారతిలో ఉత్సాహం ఊదేసినట్లుగా ఆరిపోయింది.

సుజా సమక్షంలో తను రంగు వెలిసిన బొమ్మలా ఉంటుంది. ప్రభాకర్ ప్రతి చూపూ సుజాను చుట్టేస్తుంది. సుజా ప్రతి కదలికా అతన్ని ఆకర్షిస్తుంది. నవ్విస్తుంది...కవ్విస్తుంది. అతని చూపుల్లో ఆమెకరగిపోతుంటుంది. ఆమెచిరునవ్వుల్లో అతనుమునకలేస్తుంటాడు.అది తనుభరించలేదు. చూస్తూ నిర్లిప్తంగా ఉండిపోలేదు. తన హృదయం చిల్లులు పడుతుంది. ఆ రంధ్రాలనుండి కన్నీరుగా మారిన రక్తం స్రవిస్తూ ఉంటుంది.కనీసం...కనీసం ఈ ఒక్కరోజుకూ తనకా శిక్ష లేకపోతేనేం ఈ ఒక్కరోజూ ప్రభా నా స్వంతం కాకూడదూ? ఈ ఒక్కరోజూ నా ప్రభా నాకే చెందకూడదూ.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

ఉలిక్కిపడిన హారతి తలఎత్తి అతని వంక చూసింది.

ఆ కళ్ళు మాట్లాడే నిజాన్ని చదువుకోడం అతనికిష్టంలేదు. అందుకే చూపులు తిప్పుకుంటూ "సుజాను పిలుద్దామా?'' అన్నాడు ఉత్సాహం నటిస్తూ.

"ఊ...." అంది హారతి లేచి వంట గదిలోకి వెడుతూ.

ఉత్సాహంగా లేచి కాలకృత్యాలు తీర్చుకున్న ప్రభాకర్ కాఫీతాగి డ్రస్ చేసుకుని బయలుదేరాడు-సుజాను ఆహ్వానించేందుకు.

అతని పెదవులపై సన్నని ఈల

పాట.

అతను వెళ్లినవంకే చూస్తున్న హారతి 'ఈ సంబరం మా కోసమా లేక సుజా కోసమా?' అనుకుంది దిగులుగా.

ఆమె ఉత్సాహం చచ్చిపోయింది. సెలవు పెట్టకుండా ఉండవల్సింది అనుకుంది. తనకంటూ ఉత్సాహంలేకపోయినా ప్రభా బాధపడతాడు అనుకుని రెండు మూడు రకాలతో వంట పూర్తిచేసి వాళ్ళిద్దరికొరకూ ఎదురుచూస్తూకూర్చుంది.

ఒంటిగంట....రెండు....మూడయింది. చివరికి పొద్దు వాలిపోయింది.

రాత్రి పదిగంటలకు ఇల్లుచేరిన ప్రభాకర్ గుమ్మంలోనుండే-

"సారీ దేవీ! అయాం వెరీ వెరీ సారీ డియర్" అన్నాడు హారతి రెండు చేతులూ పట్టుకుని.

హారతి ముఖంలో ఏ భావమూ లేకుండా అతనివంక చూస్తుండిపోయింది.

"సుజాకు ఏదో కంపెనీలో ఇంటర్వ్యూ వచ్చింది. ఒక్కతీ వెళ్ళడానికి భయపడుతుంటే వెంట ఉండి



తీసుకెళ్ళాను. ఇంటర్వ్యూ పూర్తి కావ డమూ, పోస్టింగ్స్ ఇచ్చేయడమూ వెంటనే జరిగిపోయాయి. సుజా ఇంటర్వ్యూలో సెలక్టు అయింది. అందుకే ఇంత ఆలస్యం అయింది" అన్నాడు సంజా యిషీ చెప్పుకుంటున్నట్లుగా.

హారతి సుడులు తిరుగుతున్న కన్నీ టిని బలవంతంగా నిగ్రహించుకుంటోంది. 'ఆ తరువాత ఆర్డర్సు వచ్చిన ఆ సంతో షాన్ని సెలబ్రేట్ చేసుకుంటూ నిన్ను మరిచిపోయాము దేవీ' అని ప్రభాకర్ చెప్పకుంటానే తెలిసిపోయింది హారతికి.

ఉదయంనుండీ అభోజనంగా ఉండటం చేత నిస్సత్తువగా మంచంమీద వాలిపో యింది.

తన కంటినుండి కన్నీటి చుక్క జారకుంటాఉండేందుకుగాను శతవిధాలుగా ప్రయత్నిస్తోంది.

తన కన్నీటితో, ఏడుపు పెడబొబ్బ లతో అతన్ని బంధించి ఉంచాలనేది తన అభిమతంకాదు.

"దేవీ ఉదయంనుండీ నువ్వు భోజనం చెయ్యలేదుకదూ'' నొచ్చుకుంటూ అడి గాడు ప్రభాకర్.

హారతి నవ్వింది. 'ఫరవాలేదు ప్రభా' అన్నట్లుందా నవ్వు.

''దేవీ...లే భోజనం చేద్దువుగానీ" ఆమె భుజాలమీద చేతులువేసి లేవదీస్తూ అన్నాడు ప్రభాకర్.

"వద్దు ప్రభా! నాకు ఆకలిలేదు"

"నా మీద బాగా కోపం వచ్చింది కదూ" జాలిగా అడిగాడు.

"లేదు ప్రభా! నీ మీద నాకేం కోపం లేదు" ఈ మాటలంటుండగా ఆమె శత విధాలుగా ప్రయత్నించీ కన్నీటి బిందు వులు జారకుండా నిగ్రహించుకోలేక పోయింది.

తన మనస్సేమిటో తనకే తెలీని ఈ పరిస్థితి అతనికి బాధాకరంగా ఉంది. హారతిని బాధపెడుతున్నానని అతనికి తెలుసు. అలా బాధపెట్టడం న్యాయం కాదనీ తెలుసు. కానీ సుజా సమక్షంలో అతనివన్నీ మరిచిపోతాడు. ఉత్సాహంతో ఊగిపోతాడు.

ప్రభా ఆమెను వదిలి లేచి వంటగది లోకి వెళ్ళాడు. వండినవన్నీ వండినట్లు గానే మూతలుపెట్టి ఉన్నాయి. ఉదయం నుండీ హారతి తనకోసం ఎదురుచూస్తూ వచ్చి మంచినీళ్ళుకూడా ముట్టలేదనే విషయం ప్రత్యక్షంగా చూస్తున్న అతని కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

తను సుజాతో హోటల్లో విందు భోజనంచేసి హాయిగా సినిమాచూసి ఈ రోజంతా ఎంజాయ్ చేశాడు.

ఉదయం హారతి ఉత్సాహం, తనకోసం ఎదురుచూస్తూ వడలిన ముఖంతో, నీర సంగా కుర్చీలో ముడుచుకు కూర్చున్న ఆమె రూపం కన్నులముందు కదలి చలించిపోయాడు.

ఆ అమాయకురాలిని ఎంతగా క్షోభ పెడుతున్నాడు? తనను ఎంతగా ప్రేమి స్తోంది? ఆమెకు తనుతప్ప ఎవరున్నారు? తను సుజావైపు ఆకర్షితుడవుతున్నాడనీ, అందుకే తననింతగా బాధపెడుతున్నా డనీ తెలిసినా ఇదేమిటీ అని నోరు తెరిచి ఇంతవరకూ అడగలేదు. ఇది అన్యాయంకాదా అంటూ నిలదియ్యలేదు. పసిపాప వంటి మనస్సు. అంత అమా యకురాలిని క్షోభ పెడుతున్న తన పాపం ఊరికేపోదు.

ప్రభాకర్ హృదయం బాధతో మెలి తిరిగింది.

పళ్ళెంలో అన్నంకలిపి పట్టుకొచ్చాడు. హారతి అంత్రకితం పడుకున్నట్లుగానే కళ్ళుమూసుకుని ముడుచుకు పడుకుంది.

ఆమె కంటి నుండి ఒక్కొక్క కన్నీటి బిందువే జారి దిండులోకి ఇంకిపోతోంది.

ఆమెనలా చూస్తున్నకొద్దీ ప్రభాకర్ గుండెలు పిండినట్లయింది.

"దేవీ... అన్నంతిను" ఆమె తలమీద చెయ్యివేసి ఆప్యాయంగా పిలిచాడు. అతని కంఠం రుద్ధమైంది.

"నాకు ఆకలిగాలేదు ప్రభా" అంది హారతి కన్నీళ్ళు మింగుతూ కళ్ళు తెరవకుండానే.

రెండు క్షణాల తరువాత తన పాదాల వద్ద చల్లగా తగలడంతో ఉలిక్కిపడి కళ్ళువిప్పి చూసింది హారతి.

ప్రభాకర్ ఆమె పాదాల వద్ద కూర్చుని ఆమె పాదాలమీద చేతులుంచి తలవంచుకున్నాడు.

తను ఈవేళ చేసినతప్పుకు క్షమాపణ అడుగుతున్నట్లుగా కాక తను ఇంతకు ముందు చేసిన తప్పులకూ, ఇకముందు చేయబోయే తప్పులకు కూడా క్షమాభిక్ష ఇచ్చి అంతరాత్మవల్ల కలిగే మానసిక సంఘర్షణ నుండి తనను రక్షించమని వేడుకున్నట్లుగా ఉంది. ఆమె పాదాలు తాకేందుకు అతను సిగ్గుపడటం లేదు. ఆ దేవత పాదాలముందు తల వాల్చడమే తన పాపాలకూ, నేరాలకూ, వ్యామోహభరితమైన జీవితానికీ తగిన శిక్షగా భావిస్తున్నాడతను. హారతి కంగారుపడుతూ లేచి కూర్చుంది.

"ప్రభా! నీకేం పిచ్చి పట్టలేదుగా" కోపంగా కసురుకుంది హారతి.

"నువ్వు లేచి అన్నం తినేవరకూ నేను వదలను" ఆమె రెండు పాదాలనూలాగి ఒళ్ళోపెట్టుకుంటూ అన్నాడు మొండిగా.

"తింటాను తింటాను. సరేనా ఇంక వదులు" కోపంగా అరిచింది హారతి. అలా అంటున్నప్పుడు కూడా ఆమెకు కన్నీళ్ళు పొంగుకు వచ్చాయి.

ప్రభాకర్ సంతోషంగా లేచి పళ్ళెం తీసుకుని అన్నంకలిపి హారతి నోటికి ముద్ద అందించాడు.

ప్రభాకర్ అందించిన ముద్ద మింగుతున్న హారతికి కన్నీళ్ళు జలజలరాలాయి. ఇక ఆపుకోలేనట్లు వెక్కివెక్కి ఏడ్చేసింది.

ప్రభాకర్ ఆమె తలను గుండెలమీద చేర్చుకుని ఆప్యాయంగా నిమురుతూ ఉండిపోయాడు.

అతని కన్నీళ్ళతో ఆమె తల తడిసిపోతోంది.

ప్రభాకర్ ఆత్మీయతను అనుభవిస్తున్న హారతి మనస్సు 'నాకు ప్రభా ఉన్నాడు' అని ఊరట చెందడానికి బదులుగా, 'నాకు ఎవ్వరూలేరు..నాకు ఎవ్వరూలేరు' అంటూ ఆక్రోశించింది.

హృదయ భారం తీరేవరకూ అలా ఏడుస్తూ ఉండిపోయింది హారతి.

* * *

హారతికి సంతోషంగా ఉంది.

ఎన్నడూ ఎరుగనంత సంతోషంగా ఉంది. శరీరమంతా దూదిపింజలా తేలికయి గాలిలో తేలిపోతున్న ఆనందకరమైన అనుభూతి! ఈ అనంతమైన ప్రకృతిలో తానూ ఒక భాగమైపోతున్నప్పటి ఆనందం.

హారతికి సిగ్గుగా ఉంది. బిడియంగా ఉంది. సంకోచంగా ఉంది. హారతికి భయంగా ఉంది.

హారతి ఇంతకు ముందు నవ్వింది.

గడచిన జీవితంలో లెక్కలేనన్నిసార్లు

ఏడ్చింది. సిగ్గుపడింది. బిడియపడింది. భయపడింది.

కానీ సంతోషం, సిగ్గు, బిడియం, భయం-ఇలా అన్ని భావోద్రేకాలూ ఒకే సమయంలో కలిగే అపూర్వమైన అనుభూతిని ఇంతకు పూర్వం ఎరుగదు.

అపూర్వమైన ఈ అనుభూతి పట్టి చుట్టి ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే హారతి బలహీనమైన శరీరం తట్టుకోలేనట్లుగా సన్నగా కంపించింది. తానా వార్త ప్రభాకర్‌కుచెబుతుంటే ప్రభా మొహంఎలా ఉంటుందో...?ఆనందంతో తనను ఉక్కిరి బిక్కిరి చేసేస్తాడు. అసలే ఏదొచ్చినా పట్టలేడు.

అసలు తానా విషయం అతనికెలా చెబుతుంది?

ఆ నిమిషంలో..అప్పుడే తను అతనికా విషయం చెబుతున్నట్టుగా ఊహించుకుని సిగ్గుపడిపోయింది.

ఆవిషయం తనకు తాను అనుకోడానికే సిగ్గుపడిపోయింది.

ఈ సంతోషకరమైన వార్తను ప్రభాకు చేరవేయకుండా,అతనితో పంచుకోకుండా తానింక ఒక్కనిమిషం కూడా ఉండలేనని నిశ్చయించుకుని నర్సింగ్‌హోమ్ నుంచి తిరిగి ఆఫీసుకు వెళ్ళకుండా నేరుగా బాంక్ దగ్గరకు బయలుదేరింది.

హారతికీమధ్య తరచూ అనారోగ్యంగా ఉంటోంది.

ఆ రోజు ఉదయం కూడా అలాగే చాలాసేపు మంచంలో పడుకొని ఉంది. పైకిలేస్తే కళ్ళు తిరుగుతున్నట్లు, శరీరం గాలిలో తేలిపోతున్నట్లు ఉంది.

ప్రభాకర్ కాఫీకలిపి ఆమె చేత తాగించాడు. వచ్చీరానట్లు వంట చేశాననిపించి ఆఫీసుకు తయారయ్యాడు.

"లీవ్ అప్లై చేస్తావా?"అన్నాడు వంగి బూట్ లేస్ బిగించుకుంటూ.

"ఊహు...ఆఫీసుకివెళ్ళాలి. అర్జంట్ ఫైల్స్‌ఉన్నాయి"

హారతి లేని ఓపిక తెచ్చుకుని లేచి స్నానంచేసి వచ్చింది.

"ఈమధ్య మరీ నీరసంగా ఉంటున్నావు. డాక్టరు దగ్గరికివెళ్ళిరాకూడదూ"

"ఊ..."

"పోనీ నేనుకూడా రానా?"

"ఊహు ... నేను వెళతాలే"- అంది కళ్ళుతిరుగుతుంటే కుర్చీకి చేరగిలబడుతూ.

ఆఫీసుకివచ్చినతరువాతకూడా పరిస్థితి మరింత అధ్వాన్నంగా ఉండటంతో తప్పనిసరిగా డాక్టరుని చూసింది.

డాక్టరుచెప్పిన విషయం వింటూనే, మొదట ఏదో సంభవించకూడని విషయం సంభవించినట్లు ఇదేమిటి అనుకుంది అయోమయంగా.

క్రమేపీ అదేమీఅసంభవమైనవిషయం కాదనీ, అతి సహజమైనదేననీ అర్థం అయినకొద్దీ - ఆనందంతో శరీరంలోని రక్తమంతా ముఖంలోకి పొంగివచ్చింది.

తానెంత 'ఈడియట్' కాకపోతే డాక్టరు చెప్పేవరకూ ఈ విషయం తెలుసుకోకుండా ఎలావుంది?

సంతోషంతో అనారోగ్యం ఎక్కడిది అక్కడ ఎగిరిపోయి దాని స్థానంలో ఆనందం ముసురుకొంది.

బాంకుదగ్గరికి వచ్చిన హారతి ప్రభాకర్ కొరకు మనిషిని లోపలికి పంపి అతని కోసం ఎదురుచూస్తూ బయట బల్లమీద కూర్చుంది. మనిషి లోపలికివెళ్ళి బయటికి వచ్చే ఈ ఐదునిమిషాల కాలమే ఆమె ప్రాణానికి ఐదు యుగాల్లా గడిచాయి.

'ప్రభా ఇంకా బయటికిరాడేం?' అను

కుంటూ ఆతృతతో ఎదురుచూస్తోంది.

ఇంతలో లోపలికివెళ్ళిన మనిషి బయటికి వచ్చాడు.

"ప్రభాకరంబాబు మధ్యాహ్నం సెలవు పెట్టి వెళ్ళిపోయారంటమ్మా"

"సెలవు పెట్టివెళ్లారా?" నమ్మలేనట్లు ఆశ్చర్యంగా అన్నది హారతి.

"అవునమ్మా, ఇంతకుముందు వారి కోసం ఓ అమ్మాయి వచ్చింది. ఆ అమ్మాయి రాగానే బాబుగారు వెళ్లిపోయారు"

హారతి ఉసూరుమంది.

ఆమెకు అర్థం అయింది. సుజా వచ్చి వుంటుంది. సెలవు పెట్టి ఇద్దరూ సినిమాకు వెళ్లి వుంటారు.

భరించలేని నిరాశతో ఆమెహృదయం బరువెక్కింది.

'యథా హృదయం...తథాశరీరమ్' అన్న విషయం నిజం చేస్తూ ఇంతకు ముందు లేని అనారోగ్యమంతా ఒక్కసారిగా శరీరంలో చోటుచేసుకుని అడుగు వేసేందుకే శక్తిలేనట్లయింది.

మరి ఆఫీసుకుపోలేక రిక్షాలో ఇంటికి బయలుదేరింది. తలుపులు తెరిచేఉన్నాయి.

'అరే! ప్రభా ఇంట్లోనేవున్నాడా?' ఒక్కక్షణం ఆమెహృదయం సంతోషంతో నిండిపోయింది-తన ఊహలన్నీ అబద్ధం అయినందుకు.

వరండాదాటి హాల్లోకి అడుగుపెట్టింది. పడకగదిలో నుండి మాటలు వినిపిస్తుండటంతో కిటికీదగ్గరకువెళ్లి లోపలికి చూసింది. ప్రభాకర్ కిటికీవైపు వీపుపెట్టి మంచం మీద కూర్చున్నాడు. అతనిఒడిలో సుజా పడలిన ముఖంతో నలిగిన పువ్వులా పడి వుంది. అతని చేతులు ఆమెను చుట్టి ఉన్నాయి. వాళ్ళిద్దరినీ ఆ స్థితిలో చూసిన హారతి నిశ్చేష్టురాలై కాళ్లు నేలకుఅంటుకుపోయినట్లు అలా నిలబడిపోయింది. ఇద్దరూకలిసి తిరుగుతారు అనుకుందేతప్ప ఇద్దరిమధ్యా ఇంత సాన్నిహిత్యం వుందని ఊహించని హారతి ఆ సంఘటనను జీర్ణించుకోలేక స్థంభించిపోయింది.

సుజా ప్రభాకర్ గుండెలమీద తల వుంచి వెక్కివెక్కి ఏడుస్తోంది. ప్రభాకర్ ఓదారుస్తున్నట్లుగా ఆమె తలని నిమురుతున్నాడు. కానీ అతని కళ్లవెంట కూడా నీళ్లుకారుతున్నాయి.

"బావా! ఇప్పుడేంచేద్దాం?"వెక్కివెక్కి ఏడుస్తూ అడుగుతోంది సుజా.

ప్రభాకర్ జవాబుచెప్పలేని అశక్తుడిలా, మూఢునిలా ఆమెవంక చూస్తూ వుండిపోయాడు.

సుజా ఏడుస్తూ అతన్ని చుట్టుకుపోయింది.

"బావా నేను...నేను చచ్చిపోతాను. బావా...నేనుచచ్చిపోతాను" వెక్కిళ్ళమధ్య అంటోంది సుజా.

"వద్దు సుజా వద్దు. నువ్వొక్కదానివీ చచ్చిపోవద్దు. చేసిన పాపానికి ఇద్దరం కలిసే చచ్చిపోదాం" ఆమె కళ్ళనీళ్లు తుడుస్తూ గుండెలకు హత్తుకున్నాడు ప్రభాకర్.అతనికళ్లనీళ్లు నింపుకున్నాయి.

"సుజా! ఈ విషయం అమ్మకు తెలుసా?" హీనస్వరంతో అడిగాడు ప్రభాకర్!

"అత్తయ్యేచెప్పింది బావా. అత్తయ్య చెప్పేవరకు ఇదని నాకు తెలీదు. ఇవ్వాళ ఉదయం కళ్లు తిరిగి పడిపోతే అత్తయ్య నిలదీసి అడిగింది"

"సుజా! అమ్మ ఏమంది?" ఆపగలేక అడిగాడు.

"చిలక్కి చెప్పినట్లు చెప్పాను

ఆనాడు. విన్నాడుకాదు. అప్పుడలా ఏడ్చాడు. ఇప్పుడిలా...అన్నయ్యకు నా మొహం ఎలా చూపించను?' అంటూ ఏడుస్తు గదిలోకి వెళ్లి తలుపువేసుకుంం బావా! ఇక నాకు భయంవేసి నీదగ్గరకు వచ్చేశాను బావా! ఇప్పుడేంచేద్దాం?" ఆ పిల్లకు అంతులేని భయంగావుంది. అప్పటి కపుడు ఏదో జరిగిపోవాలనే ఆరాటంగా వుంది.

అది చావైనా సరే, బతుకైనా సరే వెంటనే జరిగిపోవాలి.

"ఏంచేద్దాంఅంటే నేనేంచెప్పను సుజా! ఇద్దరం కట్టకట్టుకుని చచ్చిపోదాం. అంత కంటే చేసేదేముంది?"

సుజా తిరిగి ఏడుపు మొదలుపెట్టింది. ఆమెను ఓదార్చడం అతనికి అసాధ్యంగా వుంది.

వింటూన్న హారతి వస్తున్న ఏడ్పును బలవంతంగా ఆపుకుంటూ నిశ్శబ్దంగా వెనక్కు తిరిగింది.

ఆమె భారంగా నడుస్తూ వెళ్లి పార్కులో ఒక సిమెంట్ బల్లమీద కూర్చుంది.

సుజా, ప్రభాకర్‌ల మాటలు ఒక్కొక్కటే చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. 'వద్దుసుజా వద్దు. నువ్వొక్కదానివే చచ్చిపోవద్దు... చేసిన పాపానికి ఇద్దరం చచ్చిపోదాం....' నిశ్చయంగావున్న ప్రభాకర్ స్వరం.

'ఇప్పుడేం చేద్దాం బావా?' బేలగా అడుగుతున్న సుజా.

'కట్టకట్టుకుని ఇద్దరం చచ్చిపోదాం'

సాయంత్రంవరకు బల్లకు ఆనుకుని శిలాప్రతిమలా కూర్చుండిపోయింది. ఆమె హృదయంలో ఏవేవో జ్ఞాపకాలు...!

ప్రభాకర్ పరిచయం తనకి పార్కులోనే జరిగింది. ఈ బల్లమీద కూర్చునే గంటలతరబడీ కబుర్లు చెప్పుకునేవారు!

హారతికి హఠాత్తుగా వెదురుపొదలు గుర్తుకువచ్చాయి. ఓ గంటక్రితం అంతు లేని ఆనందంతో పొంగిపోయింది తను. కానీ ఆ ఆనందం సరిగ్గా గంటగడవక ముందే ముగిసిపోయింది.

అంతులేని, అంతంలేని దుఃఖాన్ని గుండెలనిండుగా ఇముడ్చుకుని కూర్చుంది తానిప్పుడు.

వెదురు పొదవంటి తన జీవితం సజావుగా సాగుతోంది అనుకోడం ఎంత వెర్రితనం?

ఒక నిర్ణయానికి వచ్చినట్లుగా లేచి అడుగులు వేసింది హారతి. ఆ కాస్త దూరానికే అలసిపోయినట్లుగా రొప్పుతూ, భారంగా నడుస్తూ ఇల్లు చేరుకుంది.

శరీరమంతా చెమటలు కమ్ముతూ, నిస్సత్తువతో కళ్ళు మూతలు పడుతున్నాయి. ఇంటికి తాళం వేసి ఉంది.

నెమ్మదిగా తాళం తెరుచుకుని లోపలికి వెళ్ళింది.

తాను నిర్ణయించుకున్న నిర్ణయాన్ని అమలుపరచాలని తొందరపడింది. తాను ప్రభాకర్ ముఖం చూస్తూ చెప్పలేని తన నిర్ణయాన్ని కాగితం మీద ఉంచింది.

''ప్రభా,

నేను వెళ్ళిపోతున్నాను. మీదారికి అడ్డు లేకుండా శాశ్వతంగా దూరంగా వెళ్ళిపోతున్నాను. సుజా తల్లి కాబోతున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. ఆమె విచ్చీ విచ్చని లేతమొగ్గ. ముందు ముందు ఎంతో జీవితం ఉంది. సుజాను పెళ్ళి చేసుకో.

'దేవీ, ఎక్కడకు వెళ్ళిపోతున్నావు? నా మీద కోపం వచ్చింది కదూ!' అంటున్నావు కదూ.

లేదు ప్రభా...నీమీద కోపం లేదు. నా

మీద నీ ప్రేమ నాకు తెలుసు. ఏనాటికీ నీఅంతగానీవునన్ను ఒదులుకోలేవు.అలాగే సుజాకు అన్యాయం చెయ్యలేవు. ఈ సంఘర్షణలో నలిగిపోయి నిన్ను నీవు హింసించుకుంటావు. అందుకే నీకు ఆ పరిస్థితి రాకుండానే నాకు నేను తప్పుకుంటున్నాను.

ప్రభా... నీకు తెలుసు. నీ 'దేవి' చాలా పిరికిది. చివరికి ఆత్మహత్య చేసుకునే ధైర్యం కూడా లేని పిరికిది. కాబట్టి ఆత్మ హత్య చేసుకుంటాననే భయం వద్దు.

ప్రభా...జీవితంలో నాకు నావారంటూ ఎవరూ మిగలకపోయినా ఈ జీవితం మీద మమకారం పోవడం లేదు. కారణం- నా గర్భంలో పెరుగుతున్న నీ బిడ్డ. ప్రభా... ఈ రోజు హాస్పిటల్‌కు వెళ్ళాను. డాక్టర్ చెప్పింది- నీవు మరో బిడ్డకు తండ్రివి కాబోతున్నావు. ఈ విషయం నీకు సంతోషం కలిగిస్తుందో లేదో నాకు తెలీదు. నేను మాత్రం ఆ కొద్ది క్షణాలూ గుండెలు పగిలిపోయేంత సంతోషం భరించాను. మరి భరించలేక నీ కోసం, నీతో పంచుకునేందుకు నిన్ను వెదు క్కుంటూ వచ్చాను.

'నాకు ఎవరూ లేరు... నాకెవ్వరూ లేరంటూ' నా హృదయం ప్రతిక్షణం ఆక్రోశిస్తోంది.ఆవేదనతో కుంగిపోతోంది. కానీ ప్రభా...నా కడుపులో నీ ప్రతిరూపం ప్రాణం పోసుకుంటూండగా నేను వంటరి దాన్ని ఎలా అవుతాను?

ప్రభా! ప్రస్తుతం నేను హెడ్ ఆఫీసుకు వెడతాను. అక్కడినుండి ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటాను. ప్రభా నా కోసం రావద్దు. నేను ఇలా జీవచ్ఛవంలా బ్రతికీ- బతికీ రాలిపోతాను. నా కోసం బాధ పడకు. మన సమస్యకు ఇదే పరిష్కారం.

నా ప్రభా...నాకు నీ ప్రేమ కావాలి. నీ అనురాగం కావాలి. నీతో సహజీవనం కావాలి. కానీ...కానీ నేనేం చెయ్యను? నేను పొందలేని నీ అనురాగం కోసం తపిస్తూ మిగిలిన జీవితమంతా దుఃఖంతో, కన్నీళ్ళతో, అశాంతితో అలమటించి పోవ డమే నాకు మిగిలిన జీవితం. ప్రభా..నాకు దుఃఖం వస్తోంది. నన్ను నీ గుండెల్లో చేర్చుకోవూ? దేవి అంటూ నన్నల్లుకు పోవూ?

ప్రభా... నా ప్రభా. ..దుఃఖంతో నా గుండెలు పగిలిపోతున్నాయి. నన్ను నీ ఒడిలో చేర్చుకుని ఓదార్చవూ?

నీ దేవి"

లెటర్ టేబిల్ మీద ఉంచి పేపర్ వెయిట్ ఉంచింది.

ఆమె చెంపలు కన్నీటితో తడిసి పోతున్నాయి.

సూట్ కేస్ తెరచి నాలుగు చీరలు వేసు కుంది. బీరువా తెరిచి కొంత డబ్బు పర్సులో వుంచుకొంది.

ప్రతి గదీ కలియ తిరుగుతూ బెడ్ రూం దగ్గరకు వచ్చి ఆగింది.

ఈ గదిలోనే తన కన్యత్వానికి శాశ్వితంగా, సంతోషంగా వీడ్కోలిచ్చింది. ఈ గదిలోనే తన ఆశలు పండించు కుంది. ఈ గదిలోనే ప్రభతో స్వర్గ సుఖాలు పొందింది. ఆమె కళ్ళను కన్నీటి తెర కప్పివేసింది.

మనస్సును వ్యామోహం కబళిస్తే తన నిర్ణయాన్ని అమలుపర్చలేననే భయంతో గబగబా బయటికి వచ్చి ఇంటికి తాళం వేసింది. ఇంటిముందు ఆవరణలోని పూలమొక్కల వంక ఆప్యా యంగా చూసి వీడ్కోలు చెప్పింది.

★

లోతైన నీటిలో తేలుతూ అలవోకగా సాగిపోయే నౌకలు, మధ్యేమార్గాన కనిపించే అందమైన ద్వీపాలు, అపూర్వ ప్రకృతి సంపద, భిన్న మనస్తత్వాలతో విభిన్నరీతిలో జీవనంగడిపే ద్వీపవాసులు, నీటికి ఎదురీదే ఓడల్లో సైతం విజ్ఞానాన్ని విస్తృతపరుస్తూ, పరిధిని విశాలం చేసే మేధావుల విషయ పరిజ్ఞానం ఈనాటి జిజ్ఞాసువుల పాలిటి వరాల్లాంటివే.

నీటిమీద ప్రయాణం నిలకడైనది కాకపోయినా నీలాకాశపు పందిరి నీడలో సముద్ర జలాన్ని చీల్చుకుని ముందుకు సాగిపోతున్న ఓడలో ప్రయాణం తమాషాగా, సరదాగా వుంటుంది. అందుకనే సముద్రయాన ప్రియుడైన సి. వై. టుంగ్ విద్యాబోధనకు సముద్ర వాతావరణం ప్రశాంతంగా వుంటుందని భావించి నౌకలోనే ఓ విశ్వవిద్యాలయం ఏర్పాటు చేశాడు. 'సాగర విశ్వవిద్యాలయం'గా వ్యవహరించబడుతున్న ఆ ఎయిర్ కండిషన్డ్ ఓడలో కళలు, చరిత్ర,



వ్యాపారం, అర్థశాస్త్రం, నాటకం, భూగోళం, జర్నలిజం, సాహిత్యం, వేదాంతం, సామాన్యశాస్త్రాలను బోధిస్తారు. ఈ సాగర విశ్వవిద్యాలయ ప్రధానాధికారి 'లివెన్'.

ఈ సాగర విశ్వవిద్యాలయంలో వున్న 540 మంది విద్యార్థుల్లో 520 మంది అమెరికన్లు, 20 మంది ఇతర దేశాలకు చెందినవారు. ఒక్క విద్యార్థి ఏడాదికి నలభై వేలనుంచి యాభై వేల రూపాయల దాకా ఫీజు చెల్లించవల్సి వుంటుంది. పుస్తకాలు, పెన్సిళ్లు, వంటి వస్తువులూ, వినోద స్థలాలను దర్శించ డానికయ్యే ఖర్చులూ విద్యార్థులే అదనంగా భరించాలి.

ఈ విశ్వవిద్యాలయంలో మొత్తం 22 మంది అధ్యాపకులున్నారు. కుటుంబ సమేతంగా నివసించడానికి వారికి ఆ ఓడ లోనే వసతులు ఉన్నాయి. ఒక సెమిస్టర్లో పని చేసిన ఉపాధ్యాయుడు తరువాత సెమిస్టర్లో సెలవు తీసుకోవచ్చు. సెమిస్టరు మూడునెలలుంటుంది. ఆదివారాలు శలవే.

ఓడలోకి అనుక్షణం టెలెక్స్ ద్వారా నేల నుంచి వార్తలందుతుంటాయి. అత్యవసరంగా ఎవరైనా అమెరికా వెళ్ళా లనుకుంటే నౌక దగ్గర్లో వున్న ఏదైనా రేవును చేరుకుంటుంది. అక్కడినుంచి విమానంలో వెళ్ళాల్సిన చోటుకి ఆఘ మేఘాల మీద వెళ్ళచ్చు. రోగగ్రస్తులైన వారి చికిత్స కోసం ఓడలోనే నలభై మంచాలతో ఒక ఆస్పత్రి వుంది. వివిధ విషయాల మీద 15 వేల పుస్తకాలతో ఒక గ్రంథాలయం, ఒక ఫొటో స్టూడియో వున్నాయి.

విద్యార్థులు, అధ్యాపకులు కలిసి కట్టుగా విజయవంతం చేయాలని నిరం తరం శ్రమిస్తున్న ఈ సాగర విశ్వ విద్యాలయ కార్యక్రమం ఏడాదికి సరి పడా ముందే తయారవుతుంది. దాని ప్రకారం దాదావు 12 దేశాల పరిధిలో ఓడ ప్రయాణిస్తుంటుంది.

* * *

సాగర విశ్వవిద్యాలయం తర్వాత చెప్పుకోదగినది 'సాగర చికిత్సాలయం!' నీటిపై తేలియాడే ఆస్పత్రి ఓడల చరిత్ర అంత పురాతనమైనదేమీకాదు. రెండవ ప్రపంచయుద్ధ సమయంలో గాయపడిన సైనికులకు చికిత్సచేయడంలో ప్రధాన పాత్ర వహించిన 'హోప్' అనే ఆసు పత్రి ఓడ యుద్ధానంతరం నిరుపయోగమై పోయింది.

వియత్నాం యుద్ధంలో పశ్చిమ జర్మనీలో ఒక కోటి అరవై లక్షల డాలర్ల ఖరీదుతో ఒక ప్రపంచ ప్రఖ్యాత ఓడ నిర్మాణ సంస్థ రూపొందించిన పది వేల టన్నుల బరువుగల 'హెర్గో లాండ్' అనే ఆసుపత్రి ఓడ యుద్ధంలో గాయపడిన అమెరికా సైనికులకు విశిష్టమైన సేవ చేసింది. ఆ తర్వాత ఆ ఓడను విహార యాత్రలకు వినియోగించుకోసాగారు. ఫలితంగా ఆసుపత్రి ఓడలు కేవలం యుద్ధ కాలంలోనే ఉపయోగపడుతాయనే అభిప్రాయం ఏర్పడింది.

ఈ అభిప్రాయాన్ని వమ్ముచేస్తూ అదే హంసాలయ్ సంస్థ నిర్మించిన మరో ఓడ 'గుల్ ఎ సుర్క్'ను ఇరాన్ పాలకుల్లో ఒకడైన రజాపహ్లవీ 16 కోట్ల రూపా యలకు ఖరీదుచేసి ఇరాన్ తీరప్రాంతా నికి సుమారంగా పర్షియా అఖాతంలో వున్న ద్వీప వాసులకి అత్యున్నత వైద్య సౌకర్యం కల్పించే కేంద్రంగా



రూపొందించాడు.

ఈ ఆస్పత్రి ఓడలో ఆపరేషన్ థియేటర్‌తోసహా ఆధునిక ఉపకరణాలన్నీ వున్నాయి. ఒక్కో దాంట్లో 30 పడకల చొప్పున రెండు వార్డులున్నాయి. పిల్లలకుప్రత్యేక చికిత్సకోసం 5 పడకలు గల పిల్లల వార్డు కూడా వుంది. ఇవి గాక ప్రముఖులకు మరో రెండు పడకలు కేటాయించారు. ఎక్స్‌రే, ఎలక్ట్రో కార్డియోగ్రాఫ్ మొదలైన వివిధ విభాగాల్లోని సాంకేతిక నిపుణులు, నిపుణులైన వైద్యులు ఎల్ల వేళలా అప్రమత్తతతో



ఉంటారు. ఈ ఆస్పత్రిలో భారతదేశం, పాకిస్తాన్, జర్మనీ, ఫిలిఫ్ఫైన్, స్వీడన్ దేశాలకు చెందిన వైద్యులు ఎక్కువగా వున్నారు. నెలకు 20 వేలనుండి 30 వేల వరకూ వేతనాలుంటాయి వారికి. సంవత్సరానికి 5 కోట్ల పెట్టుబడితో నడుస్తున్న ఈ ఆస్పత్రి ఓడలో పనివేళలు, పనిరోజులనే నియమం లేదు. ఒక్కోసారి రోజుల తరబడి విశ్రాంతిలేకుండా రోగులకు చికిత్స చేయవలసివుంటుంది. అందువలన కలిగే అలసటను, చికాకును పోగొట్టడానికి టెలివిజన్, వీడియో టేపులు, వాద్య యంత్రాలు మొదలైన వినోద కార్యక్రమ విభాగం వుంది. ఓడలోని మద్యశాలలను మాత్రం ఖుమేని పరిపాలన వచ్చాక మూసివేశారు.

ఆస్పత్రి సిబ్బందికి లభించే నెలసరి వేతనం ఆకర్షణీయంగా వున్నప్పటికీ, వారి విధినిర్వహణ బాధ్యతతో కూడుకున్నది. వృత్తిపట్ల శ్రద్ధాసక్తులు, మక్కువ వున్నవారే ఇందులో స్థిరంగా మనస్ఫూర్తిగా పని చేయగలుగుతారు. బైట ప్రపంచంతో పెద్దగా సంబంధాలు లేని ద్వీపవాసులకు ఎనలేని సేవ చేస్తున్న 'గుల్ ఎ సుర్ఖ్' ఆస్పత్రి ఓడలకే ఆదర్శవంతమైనదని చెప్పుకోవచ్చు.

* * *

భూప్రపంచంతో సంబంధం లేకుండా హాయిగా సాగర కెరటాలపైన విలాసవంతమైన జీవితం గడపాలనుకునేవారికి డబ్బుండాలేగాని సకల సౌకర్యాలు సమకూరుస్తుంది ప్రపంచంలోని అత్యంత పెద్ద ఓడ క్వీన్ ఎలిజబెత్ టు. ఆధునిక యంత్రాలతో నడిచే ఆ ఓడ





సెటిలైట్ సహాయంతో దారి తెలుసుకుంటుంది. ఓడలో ప్రత్యేకంగా అమర్చిన కంప్యూటర్ వాతావరణాన్నీ, ఇతర అంశాలనీ దృష్టిలో వుంచుకుని ఓడ పయనించవలసిన మార్గాన్ని సూచిస్తుంది.

1967లో జల ప్రవేశం చేసిన ఈ ఓడ బ్రిటన్‌నుంచి ఫ్రాన్స్ మీదుగా అమెరికాలోని న్యూయార్క్‌కు అయిదు రోజుల్లో ప్రయాణం చేస్తుంది. ఏప్రిల్ నుంచి డిసెంబరు దాకా మొత్తం 23 సార్లు ప్రయాణిస్తుంది. బయల్దేరబోయే ముందు "సముద్రపు అలలపై జీవితం" అనే పాటని బాండ్ మీద వాయిస్తారు.

1200మంది ప్రయాణించడానికి వీలుగా వున్న ఈ మూడు అంతస్థుల ఓడలో ఫస్ట్ క్లాస్ టూరిస్టుక్లాస్ అనే రెండు తరగతులున్నాయి. అయిదు రోజుల ప్రయాణంలో ప్రయాణికుల వినోదం కోసం సినిమా హాలు, టేబుల్ టెన్నిస్, గ్రంథాలయం, బార్ మొదలైనవాటితో బాటు మాజిక్ చేసేవాళ్ళు, హాస్యగాళ్ళు కూడా వున్నారు. ఇందులోని మూడు రెస్టారెంట్లలోను ప్రపంచంలోని ఏ దేశానికి చెందిన భోజనమయినా దొరుకుతుంది. అయిదురోజుల్లో 50 వేల సంచుల టీ, 900 కిలోల కాఫీ, 2300 కిలోల చక్కెర, 600 డబ్బాల చిన్నపిల్లల ఆహారం, 22 కిలోల కుక్క బిస్కట్లు, 9500 లీటర్ల పాలు ఖర్చవుతాయి. ఈ ఓడలో ఫస్ట్‌క్లాస్ టిక్కెట్టు ఖరీదు 92 వేల రూపాయలైతే టూరిస్ట్



క్లాస్‌లో 6660 రూపాయలే.

1987 కల్లా ఈ ఓడ పాతదయి పోతుంది. 1990 సంవత్సరం తర్వాత సముద్రయానానికి ఎంతమాత్రమూ పనికి రాదు. ఆ తర్వాత ఏదయినా సముద్ర తీరంలోగల పట్టణానికి దగ్గర్లో నిలిపి సముద్రంమీద ఉండే హోటలుగా మార్చే ఉద్దేశం వుంది.

*   *   *

సముద్రయానం గురించి మాట్లాడు కుంటుంటే 'వాటర్ వాటర్ ఎవ్విరీవేర్ బట్ నో డ్రాప్ టు డ్రింక్' (ఎటు చూసినా నీళ్లు వున్నాయిగాని తాగడానికి ఓ మంచినీటి చుక్కయినా లేదు) అన్న చిన్నపిల్లల నర్సరీ రైమ్ గుర్తుకొస్తోంది. కాని ఉప్పునీటి విశాల సాగరంలో కోట్లాది మెట్రిక్ టన్నుల తియ్యటినీరు ఘనీభ వించి, పర్వతంగా మారి ఈదులాడు తుంటాయన్న సంగతి అభూతకల్పనలా అనిపించినా నూటికి నూరుపాళ్ళు యదార్థం.

1956లో "ప్రశాంత మహాసాగరం"లో ప్రయాణిస్తున్న ఒక అమెరికా ఓడ 370 కిలోల పొడవు, 96 కిలోమీటర్ల వెడల్పు గల ఓ మంచుపర్వతం ఈదులాడడం గమనించింది. హిమానీనదాలు అనబడే ఈ పర్వతాలు 'అంటార్కిటిక్' నుండి ఈదడం ప్రారంభిస్తాయి. అక్కడ వేలాది చదరపుకిలోమీటర్ల ప్రాంతంలో మంచు సముద్రంపై పేరుకొని ఉంటుంది. వాటిలో కొన్ని మంచు పర్వతాలు ఉత్తర ధృవం నుండి బయల్దేరి సాగరం వరకూ వచ్చే స్తాయి.

ఈ హిమానీనదులలో ప్రపంచ మంతటా లభించే తాగే నీటిలో 70 శాతం దాకా ఉందనీ, నీరు లభించని లేదా నీరు తక్కువగా లభించే ప్రాంతాలకు ఈ మంచినీటి పర్వతాలను తరలించగలిగితే ప్రపంచమంతటా నెలకొనివున్న నీటి కొరత సమస్యకు సులభంగా సమా ధానం లభిస్తుందని శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడుతున్నారు.

శాస్త్రజ్ఞుల అభిప్రాయానికి కార్య రూపాన్నిస్తూ సౌదీ అరేబియా రాజు



ఖాలిద్ సోదరుని కుమారుడయిన ప్రిన్స్ ఫైజుల్ ముందుకొచ్చాడు. ఫైజుల్ ఫ్రాన్స్‌లోని 'సీ ట్రాన్స్‌పోర్టు'తో బేరసారాలు చేసి ఓ పెద్ద హిమానీనదిని పట్టుకుని సౌదీ అరేబియా ఓడ రేవు జెద్దావరకు తీసుకువచ్చేలా కంట్రాక్ట్సు కుదుర్చుకున్నాడు. 'సిసిర్ ఇంజనీర్స్' సంస్థ 9కోట్ల రొక్కానికి 5 సంవత్సరాల్లో సదరు మంచు పర్వతాన్ని జెద్దాకు చేర్చే ఒప్పందం కుదుర్చుకుంది. కావల్సిన హిమానీనదిని ఎన్నుకోడానికి కొంచెం కష్టపడాలి. భూఉపగ్రహం తీసిన చిత్రాల ఆధారంతో హెలికాప్టర్లమీద వెళ్ళి సర్వే చేసి సాంకేతిక నిపుణులు కావల్సిన హిమానీనదిని ఎంపిక చేసుకుంటారు. ఎన్నుకున్న హిమానీనదికి లోహంతో చేసిన పొడవయిన దబ్బనంలాంటి బల్లెం గుచ్చి, బల్లానికి రెండవ చివరవున్న గొలుసులు, తాళ్ళను ఓడకి కడతారు. ఓడతోబాటు హిమానీనదికూడా ఈదులాడుకుంటూ వస్తుంది.

ఇదంతా ఒకఎత్తు. ఆ తర్వాత ఈ పర్వతాన్ని గమ్యస్థానం చేర్చడం మరో ఎత్తు. మంచు మధ్యలోనే కరగిపోకుండా మొత్తం పర్వతాన్ని ప్లాస్టిక్ వస్త్రంతో చుట్టి 'పోలీయూరీథిన్'కు చెందిన నకిలీ మేఘాలలో పర్వతాన్ని కప్పివేయాలి. ఆ మేఘాలు, ప్లాస్టిక్ వస్త్రం సూర్యుని వేడిని పర్వతం వరకు చేరనివ్వవు. కాకపోతే ఆరేడు మాసాల పాటు సాగే ఈ దీర్ఘ ప్రయాణానికి అవసరమైన ఉపకరణాలు సమకూర్చుకోవడం, ప్రయాణం మధ్య అకస్మాత్తుగా ఎదురయ్యే ఇక్కట్లను ఊహించి వాటికి పరిష్కారాల్ని అన్వేషించటం కఠినమైన కార్యాలు. అయినా అన్ని కష్టనష్టాలను భరించి జెద్దా చేరిన హిమానీనదిని ముక్కలుగా నరికి, ఆ ముక్కల్ని కరిగించి గొట్టాల

ద్వారా ప్రజలకు నీటిసరఫరా చేస్తారట.

* * *

కాసేపు సముద్రయానాన్ని మరిచి ఒడ్డుకివస్తే ఎన్ని అందమైన దీవులు కనబడతాయి. బాహ్య దృష్టికి ఈ దీవులన్నీ సౌందర్యనిలయాలుగానే కనిపించినా తరచిచూస్తే ద్వీపవాసుల జీవన విధానంలో దీవికీ దీవికీ మధ్య ఎంతో అంతరం కనిపిస్తుంది.

ప్రశాంత మహాసాగరంలో 1600కిలోమీటర్ల మేర వ్యాపించి ఉన్న న్యూగినీ ద్వీపం నరభక్షకుల నిలయంగా చెప్పుకుంటారు. 20 సంవత్సరాల కిందట మనుషులు ఆ దీవివైపు వెళ్ళడానికి భయపడేవారు. ఇక్కడ పెద్దపెద్ద నదులున్నాయి. దీవిలోని దుర్గమమైన లోపలి భాగంలో వందలాది మైళ్ళవరకూ రాకపోకలు నదులపైనే సాగించాలి.

న్యూగినీ ఆదివాసులు పదివేల సంవత్సరాల క్రితం ఏవిధంగా ఉన్నారో ఇపుడూ అలాగే ఉన్నారు. దీవిలోపల అభేద్య ప్రాంతంలో లక్షలాది ఆదివాసులు నివసిస్తున్నారు. బైటి ప్రపంచం గురించి బొత్తిగా తెలీనివారు ఇప్పటికీ రాతి గొడ్డళ్ళు, బల్లేలు వాడుతున్నారు.

1527లో జాన్ జార్జ్ డిమెన్సన్ అనే స్పెయిన్ నివాసి ఈ ద్వీపంలో అడుగుపెట్టేడు. అప్పట్నించి ఇప్పటి వరకూ ఎంతో మంది సాహసులు అక్కడికి వెళ్ళారుగానీ ఎవరూ లోపలి భాగంలోకి ప్రవేశించలేకపోయారు.

గత 47 సంవత్సరాల్లో ఆ అభేద్యమైన పర్వతాలు, అరణ్యాల మధ్య ఏముందో తెల్సుకోవడానికి తీవ్ర ప్రయత్నం జరిగింది. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత ఈ పర్వతాలవెనక బంగారు గనులు ఉన్నాయనే వదంతి



వ్యాపించడంతో సాహసికుల మధ్య పోటీ ప్రారంభమైంది. కాని, చాలా తక్కువ మంది మాత్రమే సజీవంగా తిరిగి రాగలిగారు. అలా తిరిగి వచ్చినవారిలో ఆస్ట్రేలియాకు చెందిన 'షార్ కీ ఇ' అనే గని కార్మికుడు ఒకడు. అతను ధైర్యంగా కీకారణ్యంలోకి ప్రవేశించగానే 'కుకుకుకు' ఆదివాసులు అతనిపై దాడి చేశారు. తెలివిగా వారి బారినుండి తప్పించుకుని వచ్చిన 'షార్ కీ ఇ' 'బుల్ ల్' అనే ప్రదేశంలో కోరంగా నది సమీపంలో బంగారు గనులు ఉన్నాయని చెప్పాడు. దాంతో అసంఖ్యాకంగా ప్రజలు బంగారం కోసం అక్కడికి చేరారు. క్రైస్తవ మిషనరీలు కూడా ఇక్కడికి చేరుకున్నాయి. న్యూగినీ 'హైలాండ్'ను వీరే కనుగొన్నారు. అలా వచ్చిన ప్రజలలో చాలామంది ఇపుడు న్యూగినీ రాజధాని పోర్ట్‌మోర్స్‌బీలో స్థిరపడ్డారు.

అక్కడి ఆదివాసుల ప్రధాన గ్రామం అభేద్య పర్వతలోయలో ఉంది. న్యూగినీ ఆదివాసులు మెలెనిసియన్ వంశీయులు. 50 వేల సంపత్సరాల క్రితం ఈ దీవికి వచ్చి స్థిరపడిన వీరికి 8 వేల సంవత్సరాల నాటి నుంచి వ్యవసాయం చేయడం తెలుసు. కొందరు 'పొలినేశియ, మైకొనేశియా'ల నుండి కూడా వచ్చారు. కానీ 90 శాతం ఆదివాసులు మెలెనిసియన్ జాతికి చెందినవారే! వీరి ప్రధాన ఆహారం చిలగడదుంపలు. అత్యధిక ప్రజలు చిన్న చిన్న పల్లెల్లో నివసిస్తారు. అరటి పళ్ళు, చిలగడదుంపలు, మొక్కజొన్న, చెరకు, ఖర్జూరం విరివిగా పండిస్తారు. ప్రస్తుతం రబ్బరు, తేయాకు, కాఫీ, కోకో, కొబ్బరి కూడా ఉత్పత్తి చేస్తున్నారు. ఇక్కడి



ఆర్థిక వ్యవస్థ వ్యవసాయంపైనే ఆధార పడి ఉంది.

ఈ ఆదివాసుల ఉత్సవాలు విచిత్రంగా ఉంటాయి. ఉత్సవాలలో ముఖాలకు రకరకాల రంగులు పూసుకుంటారు. కొందరు తమ పూర్వీకుల పుర్రెలను పెద్దపెద్ద రంధ్రాలు గల సంచులలో వేసి ఇంటి ముందు వేలాడదీస్తారు. కొందరు జింక పుర్రెలను దిండుగా ఉపయోగిస్తారు. విధవలు తమ మృత భర్త పుర్రెను మెడలో వేసుకుంటారు. పిల్లలకు ప్రారంభం నుండే కష్టాలను, బాధలను నవ్వుతూ సహించడం అభ్యసింపజేస్తారు.

వివాహం అయ్యేంతవరకు అందరూ స్వేచ్ఛగా జీవిస్తారు. ఆడపిల్లలు ముఖాలను రకరకాల రంగులు, పక్షిరెక్కలు, శంఖులతో అలంకరించుకుంటారు. పురుషుడు ఎన్ని పెళ్ళిళ్ళయినా చేసుకోవచ్చు. వధువుకు రెండువేల పందులు, శంఖాలు, గొడ్డళ్ళు, బల్లేలు చెల్లించగల సత్తా వుండాలి.

ఆస్ట్రేలియా ప్రభుత్వం ఈ ద్వీపాన్ని అభివృద్ధి చేయడానికి, అనాగరిక ఆదివాసులను నాగరికులుగా రూపొందించడానికి ఎన్నో ప్రయత్నాలు చేసింది. విద్య, వైద్య సౌకర్యాలు కూడా కల్పించింది.

* * *

న్యూగినీకి పక్తు వ్యతిరేకమైన దీవి తహితి. ప్రశాంత మహాసాగరానికి సుదూరంగా దక్షిణ దిశన ఈ తహితి అనే అందాల ద్వీపం వుంది. రెండు శతాబ్దాల క్రితం కనుగొన్న తహితీ ప్రణయ శృంగారాలకు ప్రఖ్యాతిగాంచింది. యూరప్ వాసులు తమ స్వేచ్ఛా ప్రణయాన్ని తహితి ద్వీపంనుండే దిగుమతి చేసుకున్నారని ప్రతీతి.

ఈ ద్వీపం కప్పపిల్ల ఆకారంలో వుంటుంది. తహితి చుట్టూ వరుసగా వున్న శిఖరాల్లో ఎత్తైన శిఖరం పేరు ఓర్‌హినా. ఇది 7,336 అడుగుల ఎత్తుంది. విశాలమైన వలయాకారపు పచ్చని లోయలు సముద్ర తీరంవరకూ వ్యాపించి వున్నాయి. ద్వీపవాసులు సముద్ర తీరంలోని ఒక సమతల ప్రదేశంలో నివసిస్తారు.

ద్వీపం లోపలిభాగం పర్వతాలు, లోయలు, శిఖరాలు, వృక్షాలు, జలపాతాలు, గుహలతో నిండి వుంటుంది. ఇక్కడ మామిడిపళ్ళు, అరటిపళ్ళు, బ్రెడ్ ఫ్రూట్, ఎవోకిడ్ అనే పళ్ళు అధికంగా ఉత్పత్తి అవుతాయి. ద్వీపం నలువైపులా 90 మైళ్ళ పొడవుగల గుండ్రని తీర మార్గం వుంది. మల్లెలు, కొబ్బరిచెట్ల సుగంధంతో ఈ ద్వీపం మత్తెక్కిస్తుంది.

1767లో శామ్యూల్ వాలిస్ అనే ఆంగ్లేయ కేప్టెన్ తాహితి దీవిని కనుగొన్నాడు. దీనిపై అధికారం సంపాదించడానికి ఫ్రాన్స్‌దేశీయులు, ఆంగ్లేయులు సంవత్సరాలతరబడి పోటీ పడ్డారు. చివరికి ఆ అధికారం ఫ్రాన్స్ దక్కించుకుని ఇప్పటి వరకూ నిలబెట్టుకుంది. క్రైస్తవ మిషనరీలు అక్కడకి చేరుకుని ద్వీప ప్రజలను క్రైస్తవులుగా మార్చారు.

తహితి ప్రజలు పోలినీశియన్ జాతి వారు. దాదాపు వంద సంవత్సరాల క్రితం వందలాది చైనా కార్మికులు కూడా ఇక్కడికి వచ్చారు. రంగు భేదం లేదు. విభిన్న జాతుల, దేశాల ప్రజలు పరస్పరం వివాహం చేసుకుంటారు. ఈ ద్వీపంలో అన్నిటికంటే గొప్ప వస్తువులు భోగ విలాసాలే. కాలమే నిలచిపోయినట్లుంటుం దిక్కడి వాతావరణం. యుద్ధం, హత్యలు,

దొంగతనాలకిక్కడ స్థానంలేదు.

తహితి స్త్రీల అందం వర్ణనాతీతం. వారితో పోలినీశియా, ఫ్రాన్స్, చైనా రక్తాల మిశ్రమం వుంది. వహాయిన్ అనే స్త్రీలలో పోలినీశియా రక్తం ఎక్కువగా వుంటుంది. ప్రస్తుతం ఈ జాతి సంఖ్య అతిస్వల్పం. శరీరం రంగు బంగారం లేదా తేనె రంగులో వుండే అక్కడి స్త్రీలు బలంగా, ఆరోగ్యంగా వుంటారు. జుట్టు పొడుగ్గా వుంటుంది. చెవుల వెనుక పూలు పెట్టుకుంటారు.

సగం చైనా, సగం తహితీవాసులైన 'డామిస్' జాతి స్త్రీలు పొడవైన పోలినీశియన్ స్కర్ట్‌లు ధరిస్తారు. తలకు పూలమాల చుట్టుకుంటారు.

తహితిలో వివాహానికి ప్రాముఖ్యత లేదు. ఇక్కడ 43 శాతం పిల్లలు అవివాహిత తల్లిదండ్రుల సంతానమే. అలా అని సమాజం ఈ పిల్లల్ని హీనదృష్టితో చూడదు.

తహితికి రాజధాని అయిన పేపితి ఈ ద్వీపానికి వాయవ్య దిశలో వుంది. కట్టుబాట్లులేని నగరమైనా ఇక్కడి వాతావరణంలో ఏవిధమైన కాలుష్యం లేదు. తహితీ ద్వీపంలోని సగం ప్రజలు పేపితిలో నివసిస్తారు. తహితిలో వస్తువుల ఖరీదెక్కువ.

వెన్నెల రాత్రుల్లో కొబ్బరిచెట్ల నీడల్లో సాగర తీరాన అసంఖ్యాక జంటలు గిటార్ వాయిస్తూ, పాటలుపాడుతూ కనిపిస్తాయి. కెరటాలపై పడవలు నాట్యం చేస్తుంటాయి, హాయిగా, ఆనందంగా జీవించే కళ తహితి ప్రజలను చూసి చేర్చుకోవాలి.. *





# డామిట్... కథ అడ్డం తిరిగింది!

అబ్బబ్బ... మ్యావ్... మ్యావ్... ఎంత మాంచి నిద్ర పట్టిందీ! కలలో ఎన్ని ఎలకలు దొరికాయీ! ఎంత పసందుగా ఉన్నాయని! తినబోయేలోగా కల కరిగి పోయి మెలకువ వచ్చేసింది ఖర్మ... అరెరె... అదేమిటే? నాకోసమేనా ఈ మూషిక సుందరి? మ్యావ్... మ్యావ్...

సరే! దీని పని చూద్దాం...

కల నిజమాయెగా...కడుపు నిండ
నుండెగా... ఏమదృష్టం! కళ్ళు తెరిచీ
తెరవగానే కళెదుట పసందైన విందు...!





మూషిక మణీ ! నీపని పట్టకుండా
ఊరుకోనులే... ఎక్కడా దాక్కోలేవులే...
చూడూ ... వస్తున్నా...



డామిట్! గ్లాసులో కథ
అడ్డం తిరిగినట్లుందే? ఏదీ
ఆ మూషిక బాల?

# రిపోర్టింగ్

చతుర

రిజల్ట్సు రాగానే తేలిగ్గా ఊపిరి పీల్చాడు చిట్టిబాబు. డిగ్రీ అయిపోయింది. ఇహ ఉద్యోగాల వేట ప్రారంభించాలి అనుకున్నాడు. చిట్టిబాబుకి అడపాదడపా కథలు, కవిత్వం, వ్యాసాలు రాసే అలవాటుంది. ఒక వ్యాసం, ఒక కవిత, ఒక సంపాదక లేఖ ప్రచురితమయ్యాయి కూడా. పత్రికారంగమంటే కాస్త మోజున్న చిట్టిబాబు కొన్నాళ్ళకి ఎలాగైతేనేం ఓ దినపత్రికలో రిపోర్టరుగా సెలక్టయ్యాడు. ఆ రోజు చిట్టిబాబు



ఎవరెస్టు శిఖరాన్నధిరోహించినంతగా సంబరపడిపోయాడు.

ఆఫీసుకి వెళ్ళేరోజున కొత్త పేంటు వేసుకొని, కొత్త షర్టు టక్ చేసుకొని, బెల్టు బిగించి, క్రితం రోజు కొన్న కొత్త పైలట్ పెన్ను జేబులో పెట్టుకొని బయల్దేరాడు. ఆఫీసులో సహోద్యోగుల్ని పరిచయం చేసుకొని కొంచెం సేపు వాళ్ళు చేసే పనిని గమనించాడు. అంతలో బాస్ దగ్గరనుంచి పిలుపొచ్చింది.

ఆ రంగంలో తల నెరిసిన సదరు బాస్ కళ్ళద్దాల్లోంచి ఓసారి చిట్టిబాబుని నిశితంగా పరికించి చూశాడు. గొంతు సవరించుకొని టూకీగా రిపోర్టర్ విధుల గురించీ, పనిలో ఉండాల్సిన శ్రద్ధ గురించీ ఓ చిన్న ఉపన్యాసమిచ్చి చివరికి వార్త ఎలా రాయాలన్న విషయం దగ్గరకి వచ్చాడు.

"చూడూ! పూర్తి ఆధారాలుంటే తప్ప వార్త రాయకూడదు. ఆధారాలు లేకుండా రాస్తే మన పత్రిక అనవసరంగా చిక్కుల్లో పడుతుంది. అందుకని వార్త రాసేప్పుడు... అలా అనుకుంటున్నారు, ఇలా చెప్పారు, అలా భావిస్తున్నారు, అభిజ్ఞ వర్గాలవారి భోగట్టా ఇలా ఉంది, వారు అలా ఊహిస్తున్నారు – లాంటి పదాలను వాడితే ఏ గొడవా వుండదు. సరే! ఇవాళ సాయంత్రం టౌన్‌హాల్లో మహిళల సమావేశం ఒకటి వుంది. వెళ్ళి న్యూస్ రాసుకురా" అని చెప్పి పంపించాడు.

చిట్టిబాబు ఆ సమావేశానికి హాజరయి రిపోర్టు రాసి తీసుకెళ్ళి బాస్ ముందుంచాడు.

ఆయనగారు ఆ రిపోర్టు చదవడం ప్రారంభించారు. "నేటి సాయంత్రం టౌన్ హాల్లో కొందరు ప్రముఖ మహిళా మణుల సమావేశం జరిగినట్లు అభిజ్ఞ

# కతలు

వర్గాలవారి భోగట్టా. ఈ సమావేశంలో పాల్గొన్న మహిళల్లో పొరుగు రాష్ట్రం నుంచి వచ్చారని చెప్పబడుతున్న శ్రీమతి వనిత తప్ప మిగిలినవారందరూ స్థానికులే అని భావిస్తున్నారు. ఈ సమావేశానికి శ్రీమతి ధనలక్ష్మి అధ్యక్షత వహించారని అనధికారవార్త. ఈమె తను ఓ స్థానిక బాంకు మేనేజరుగా భావించబడుచున్న శ్రీ వీరాస్వామి అనే వ్యక్తికి భార్యనని అంటున్నారని అనుమానించబడుతున్నది..." ఇలా సాగిపోయింది ఆ వార్త.

—శాంతి

## మ్యాజిక్

రెండ్రోజులు సెలవులు కలసిరావడంతో కృష్ణా ఎక్స్‌ప్రెస్‌లో వరంగల్లు బయలుదేరాను. సికింద్రాబాద్ స్టేషన్‌లో సరి అయిన సమయానికే రైలు బయలుదేరింది. చాలా రోజుల్నుండి మా మావయ్యగారింటికి వెడ్దామనుకొంటూనే వాయిదావేస్తూ వచ్చాను. కనీసం ఇప్పటికయినా వీలు పడింది... అదే నా సంతోషం!

నా సీట్‌కు ఎదురుగా ఓ చిన్నపిల్ల కూర్చునివుంది. నాలుగేళ్ళు ఉండవచ్చు. ఆ పిల్ల పక్కనే తల్లిదండ్రులు కూర్చునివున్నారు. పక్కన తమ పాప కూర్చుంది అన్న ధోరణే లేకుండా వాళ్ళిద్దరూ... ఏమేమో మాట్లాడేసుకుంటున్నారు. వారి మాటల్ని మధ్యలో ఆపుతూ, ఆపాప వారిని ఏదో అడుగుతోంది. అయినా వారు ఆ పిల్లమాటల్ని విన్పించుకోవడం లేదు. ఆ దంపతులమీద నాకు చిరాకు వేసింది. అందునా...నాకు చిన్నపిల్లలతో కబుర్లు చెప్పడమంటే ఇష్టం కావటంతో నాకెక్కడలేని ఉషారొచ్చేసింది. వెంటనే ఆ పిల్లను చూసి నవ్వాను. అంత మారాంచేస్తున్న పిల్ల కాస్తా...నావంకతమాషాగాచూసింది.

"నీకో తమాషా చేసి చూపించనా పాపా?" అన్నాను.



"నా పేలు 'పాప' కాదు పల్లవి!" ముద్దుముద్దుగా అంది.

"ఓ...పల్లవా? అయితే ఇటురా! పల్లవీ! నీకు నేను ఓ మాజిక్ చేసి చూపిస్తాను!" అంటూ మాటకలిపాను.

తన 'మారాం' గురించి మర్చిపోయి నాదగ్గరకు వచ్చేసింది పల్లవి.

"మాజిక్ చేసి చూపించు!" గదమాయించింది నన్ను.

వెంటనే నా జేబులోంచి 'రుమాలు' తీశాను. దాన్ని పల్లవికిచూపించి "నేనిపుడు దీన్ని కిటికీలోంచి అవతలపారేస్తున్నాను!" అంటూ నా చేతిని కిటికీ బయటపెట్టి, రూమాలును బయట పారేసినట్లు నటించి, చాలా వేగంగా పల్లవికి కన్పించకుండా నా వెనక దాచేశాను. తర్వాత నా చేతులు పల్లవికి చూపించాను. నేను రుమాల్ని బయట పారవేశాననే అనుకొంది ఆమె!

"పల్లవీ! ఇపుడు చూడు! నేను బయట పారేసిన రూమాల్ని...ఓ మాజిక్ చేసి మళ్ళీ నా చేతిలోకి వచ్చేట్లు చేస్తాను" అంటూ కాసేపు హడావుడిచేసి రుమాల్ని చూపించాను.

ఎంతో ఆనందంగా చప్పట్లు కొడ్తూ గట్టిగా నవ్వింది పల్లవి! "చాలా బాగుంది అంకుల్ మీ మాజిక్!" అంటూ వరస కూడా కలిపేసింది. "అంకుల్...అంకుల్! నేను కూడా ఇపుడు మీరు చేసిన మాజిక్ చెయ్యనా" అంటూ పల్లవి, వాళ్ళ అమ్మ హాండ్‌బాగ్ తీసుకొని ఎంతో వేగంగా కిటికీలోంచి బయటకు విసిరేసింది. పల్లవి అలా చేస్తుందని నేను ఊహించలేదు! కిటికీలోంచి అంత ఎక్కువగా గాలి వేస్తున్నా నాకు చమట పట్టడం మొదలయ్యింది.

హాండ్‌బాగ్‌ను బయట పడెయ్యగానే నేను అంతకు ముందు చేసినట్లు తన బుల్లి చేతుల్ని అటూ ఇటూ తిప్పసాగింది పల్లవి.

"అంకుల్! నాకు సగం మాజిక్ మాత్రమే తెలిసింది. మిగిలిన సగం ఎలా చెయ్యాలో చెప్పవా? ఇపుడా బాగ్ రాక పోతేఅమ్మ నన్ను కొడ్తుంది" అంటూ నాచెయ్యి పట్టుకు లాగుతోంది పల్లవి!

—రాచపూడి

# సారంగం

ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో కూర్చున్నారు వాళ్ళు నలుగురూ. అందులో ఓ వైపు కూర్చొన్న ఇద్దరు యువకులూ పాతికేళ్ళలోపువాళ్ళే.

అందులో ఎర్రగా, పొట్టిగా ఆపిల్ పండులా ఉన్న కుర్రాడు నల్లచొక్కా వేసుకొన్నాడు. నల్లగా, పొడుగ్గా ఉన్న కుర్రాడు తెల్లచొక్కా వేసుకొన్నాడు.

యువకులు కూర్చొన్న సీట్ల కెదురుగా కూర్చున్నారు ఇద్దరు స్త్రీలు. అందులో యాభై ఏళ్ళు పైబడ్డ స్త్రీ పట్టుచీర కట్టుకొంది. ఇరవై ఏళ్ళలోపు యువతి పంజాబి డ్రెస్ వేసుకొంది. నల్లచొక్కా కుర్రాడు అమ్మాయివైపు చూశాడు.

"అచ్చు హేమమాలినిలా ఉంది" అనుకొన్నాడు.

తెల్లచొక్కాకుర్రాడుకూడా చూశాడు.

''అచ్చు జయమాలినిలా ఉంది" అనుకున్నాడు.

పట్టుచీర కట్టుకున్న స్త్రీ కుర్రాళ్ళిద్దరి వైపూ చూసింది.

"ఛీఛీ ఈనాటి కుర్రాళ్ళకి బొత్తిగా సిగ్గు లేకుండా పోతోంది. ఆడపిల్ల కనపడగానే ఎలా చూసేస్తున్నారో" అనుకొంది ఈర్ష్యగా, కోపంగా.

పంజాబీడ్రెస్ అమ్మాయి కుర్రాళ్ళిద్దరి వైపూ చూసీ చూడనట్లు చూసింది.

"పెద్ద హీరోల్లా ఉన్నామని పోజు కొడుతున్నారు. ఒకడు నల్లకోతీ, ఒకడు

ఎర్రకోతీ" అనుకొంది గర్వంగా

నల్ల చొక్కా కుర్రాడు తెల్ల చొక్కా కుర్రాడివైపు చూశాడు.

"పెద్ద అమితాబ్బచ్చన్‌ని అనుకొంటు న్నట్టున్నాడు. నల్ల మొహం వీడూను" కోపంగా అనుకొన్నాడు.

తెల్ల చొక్కా కుర్రాడు నల్ల చొక్కా కుర్రాడివైపు చూశాడు.

"ఎన్టీ ఆర్ ని అనుకొంటున్నాడు కాబోలు అడంగిమొహం వీడూనూ!" కసిగా అనుకొన్నాడు.

ట్రెయిన్ వెళ్తూనే ఉంది. నల్గురూ ఒకరితో ఒకరు మాట్లాడుకోడం లేదు.

కుర్రాళ్ళిద్దరూ అమ్మాయివైపు ఆశగా, ఒకరివైపొకరు కోపంగా చూసుకొంటు న్నారు.

ఇంతలో సొరంగం వచ్చింది. కంపార్ట్ మెంటంతా చీకటిగా అయిపోయింది రెండు నిమిషాలు.

ఆ చీకట్లో 'ప్చ్' అని గట్టిగా ముద్దు పెట్టుకొన్న చప్పుడూ, దాని వెంటనే 'ఫట్'మని లెంపకాయకొట్టిన చప్పుడూ వినిపించాయి.

సొరంగం దాటిపోయింది. వెలుగొ చ్చింది.

ఆ వెలుగులో అందరికీ స్పష్టంగా కనిపించాయి ఎర్రటి కుర్రాడి బుగ్గమీద అయిదువేళ్ళు!

"వెధవకంతే కావాలి! చీకట్లో అమ్మాయిని ముద్దు పెట్టుకుందామని చూస్తే లెంప పగలగొట్టకేంచేస్తుంది!" సంతృప్తిగా అనుకొన్నాడు నల్ల కుర్రాడు.

"ఈ నల్ల వెధవ అమ్మాయిని ముద్దు పెట్టుకున్నట్టున్నాడు. చీకట్లో వాడిని కొట్టబోయి నన్ను కొట్టేసింది. ఇప్పుడీ విషయం చెప్పినా ఎవళ్ళూనమ్మరు. నన్నే తంతారు" అనుకొన్నాడు చెంపని చేత్తో కప్పుకొని ఎటో చూస్తూ.

"రౌడీ రాస్కెల్! చీకట్లో నన్ను ముద్దుపెట్టుకోబోయి ఆ ముసలావిడని ముద్దుపెట్టుకున్నట్టున్నాడు. లెంప పగల గొట్టింది" అనుకొంది అమ్మాయి - ఓర చూపులు చూడ్డం మానేసి పుస్తకంలో తల దూర్చుతూ. ముసలావిడ మాత్రం సంతృప్తిగా చిరునవ్వు నవ్వుకొంటూ కిటికిలోంచి బయటకు చూస్తూ అనుకొంది-



"ముగ్గురికీ బుద్ధొచ్చింది! ఆ వగలా డింక వాళ్ళవైపు ఓరచూపులు చూడదు! తానే పెద్ద అందగత్తెననుకొంటోంది కాబోలు! ఆ కోతి వెధవలింక ఆవిడగారి వైపు చూడరు: ఎప్పుడూ ఆడమొహం చూడనివాళ్ళలా ఆకలి చూపులూ వీళ్ళూనూ! ఇంక చచ్చినా వీళ్ళెవరికీ తెలియదు నేనే గాల్లో 'ప్చ్' అని శబ్దం చేసి ఆ కుర్రాడి లెంప పగలగొట్టానని!"

—అవధానుల విజయలక్ష్మి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly. Eenadu Compound, Hyderabad - 500 004.

